

# పురాణవేదమ్

రాణి శివ శంకర శర్మ

DVK01K136

**రాణి శివ శంకర శర్మ:** 1966లో కోనసీమలోని మోడేకుర్రు అనే గ్రామంలో జన్మించారు. బాల్యం నుంచి సంస్కృత కావ్యాలూ, వ్యాకరణం, వేదాంత శాస్త్రాలని పండితుల వద్ద అభ్యసించారు. తెలుగు-సంస్కృత భాషలలో ఎం.ఎ. పట్టాని పొందారు. సంస్కృత తెలుగు భాషలలో రెండింటిలోనూ రచనలు చేసి ప్రచురించారు. చాలాకాలం విప్లవ రచయితల సంఘంలో సభ్యునిగా వున్నారు. ప్రముఖ దళిత కవి మద్దూరి నగేష్‌బాబుతో కలిసి 'ఊరు-వాడ', సంకర కవిత రచించారు. ఆయన రచించిన 'ది లాస్ట్ బ్రాహ్మిణ్' గ్రంథం తెలుగునాట సంచలనం సృష్టించింది. ఆంగ్లంలోకి అనువదించబడినది కూడా. ఈ పుస్తకం కులమతాల గురించి కొత్త ఆలోచనల్ని రేకెత్తించింది. 'హిందూత్వ' అనే నృత్య రూప కాన్ని కూడా రచించారు. ఆయన రచించిన వ్యాసాలూ కథలూ కవితలూ వివిధ తెలుగు దిన, వార పత్రికలలోను, సంకలనాల లోను ప్రచురితమయ్యాయి. రాణి శివశంకర శర్మ రచించిన 'గ్రహాంతరవాసి' నవలని పాఠకలోకం ఆదరించింది. తెలుగు సాహిత్య ప్రపంచంలో చర్చనీయాంశమైంది. తాత్వికుడు, కవి, రచయిత, విమర్శకుడైన రాణి శివ శంకర శర్మ రచించిన విలక్షణమైన పుస్తకం ఇది.

# పురాణవేదమ్

రాణి శివ శంకర శర్మ




౧౧౧

PURANAVEDAM
by **Rani Siva Sankara Sarma**
Cell : 9985987465
ranisivasankara@gmail.com



| | | |
|---|---|---|
| Cover Painting | : | Kiran Kumari |
| First Edition | : | February 2010 |
| For Copies | : | Palapitta Books<br># 16-11-20/6/1/1<br>403. Vijayasai Residency<br>Saleemnagar, Malakpet<br>Hyderabad - 500 036<br>Cell : 98487 87284<br>palapittabooks@gmail.com |
| DTP & Layout | : | Manu Graphics<br>1-8-185/2, Chikkadpally<br>Hyderabad-20<br>Ph : 040-27633574 |
| Printed at | : | Vipla Computer Services<br>(Designers & Multicolour Offset Printers)<br>Nallakunta, Hyderabad - 500 044<br>Ph: 27677078, 27676910, 27654003<br>viplavision@gmail.com |
| Price | : | **Rs. 60/-**<br>**$ 6** |

# ఒకమాట

వేదాలు, పురాణాలు, ఉపనిషత్తుల గురించి వాస్తవాల కన్నా అపోహలు ప్రచారంలో ఎక్కువగా వున్నాయి. నిజానికి వేదం, విద్య, పురాణం, కావ్యం, ధర్మం వీటి అంతస్సంబంధం సకలమూ వ్యాఖ్యాన సాపేక్షములే. ఆ వ్యాఖ్యానములు బహుళములు, అనంతములు. ఆ వ్యాఖ్యానాలని రాణి శివ శంకర శర్మ పురాణభాష్య రూపంలో పొందుపరిచారు. వలసతత్వాన్ని ఎదుర్కొవడానికి తగిన బలం భారతీయ తాత్విక చింతనలో ఏ రీతిన వున్నదో చెబుతున్నారీ రచయిత. "భారతీయతత్వంలో పరిణామవాదం వుంది. కాని అది పాశ్చాత్య పరిణామం వంటిది కాదు. పాశ్చాత్య పరిణామ వాదం నీచరూపల నుంచి ఉన్నతరూపాలకి అభివృద్ధి సాగుతుందని, దీనితో రూపం మెరుగుపడ్తుందని అంటుంది. యీ వాదానికి మూలం అరిస్టాటిల్‌లోనే ఉంది. కాని భారతీయుల అన్ని రూపాలూ పరిపూర్ణమైనవే నంటారు. యీ అనంత విశ్వంలో అనంత రూపాలలో ప్రతిరూపానికి దాని ప్రత్యేకత వుంది. దాని స్థానం దానికి ఉంది. కనుక నీచ ఉన్నత భేదాలు తాత్వికమైనవి కావు" అంటున్నారు రాణి శివ శంకర శర్మ. ఈ అంశాన్ని కూలంకషంగా చర్చిస్తూ ఆసక్తికరమైన రీతిలో ఈ పుస్తకాన్ని రాశారు. పురాణ సంహితలోని పది కథల్లో ఈ రచయిత విలక్షణమైన సృజనాత్మక ప్రతిభ కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. పురాణాల గురించి, వేదాల గురించి పాఠకుల అవగాహన పరిధి విస్తృతికీ, వైశాల్యానికీ ఉపకరిస్తుందీ 'పురాణవేదమ్'. మా ఇతర పుస్తకాల మాదిరిగానే ఈ పుస్తకాన్ని పాఠకలోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాం.

- పాలపిట్ట బుక్స్

# విషయక్రమం

# పురాణ వేదమ్

## పురాణ సూత్రములు

1) వేదాః అపేరుషేయాః, వాఙ్మయః అపౌరుషేయః
ప్రకృతిః అపౌరుషేయా
పంచభూతాని అపౌరుషేయాణి
అకర్తృత్వాత్ అనాదిత్వాత్ చ

2) అపౌరుషేయత్వం నామ సహజత్వం
ఉఛ్వాసవత్, ప్రకృతివత్ చ

3) సంయోగః ఏవ సృష్టిః
స్త్రీ పురుషాణాం, అణూనాం, పంచభూతానాం ఇతి తాత్పర్యం

4) బౌద్ధే బహుళత్వం అసాధ్యం
సూక్ష్మస్య ఆకాశస్య నిరాకరణాత్
సూక్ష్మస్థూలయోః అవినాభావ సంబంధాత్ చ

5) క్రైస్తవే బహుళత్వం అసాధ్యం
సృష్టికర్తృత్వ స్థాపనాత్, ఏకో దేవః ఏకో మార్గః
ఇతి ప్రతిపాదితత్వాత్ చ.

6) సనాతనే సర్వం బహుళం
మార్గాణాం, దేవతానాం, వర్ణానాంచ బాహుళ్యాత్

7) బహుళత్వం దృష్టి గ్రాహ్యం,

ఏకత్వం అంతర్ దృష్టి గ్రాహ్యం

ద్వయమపి సత్యమేవ

8) సనాతనే మత స్థాపనం అసాధ్యం

మార్గాణాం అనేకత్వాత్

9) అనంతః విశ్వః, అనంతాని బ్రహ్మాండాణి

అనంతాని రూపాణి, అనంతాః సంఖ్యాః

అనాది అనంతం సృష్టిః

10) వేదం నభవతి గ్రంథః,

విద్యా న భవతి గ్రంథః

సర్వవ్యాపిత్వాత్, శ్రుతిరూపత్వాత్‌చ.

11) ప్రవృత్తి నివృత్తి మార్గయోః సమన్వయమేవ సనాతనం,

తస్మాదేవ శృంగారస్య పురుషార్థత్వం

బ్రహ్మానంద సహోదరత్వం చ

12) సనాతనే నాస్తి కర్తృత్వం,

సనాతనే నాస్తి సృష్టి కర్తృత్వం

సనాతనే నాస్తి కావ్య కర్తృత్వం

సనాతనే నాస్తి శాస్త్ర కర్తృత్వం

13) వేదస్య ప్రామాణిక గ్రంథత్వ స్థాపనం అజ్ఞాన జనితం,

వేదః నగ్రంథః, శృతిరేవ వేదః

స్మృతిరేవ శృతిః

# పురాణ భాష్యమ్

నవ్యత్వ పురాణత్వ
దశావ్యపనయ దుర్నిరూప సౌందర్యా
వేదవ్యాస వాక్ ప్రకాశిత
దివ్యధురాధుర్య యోగి ధీ సత్కార్యా

ఓ పరమేశ్వరా నీవు కాలమునకు హేతువు అగుట చేత నీ సౌందర్యము నవ్యమని గాని, ప్రాచీన మనిగాని చెప్పుటకు శక్యముగాదు. నీవు వేద వ్యాస భగవానుని యొక్క అనంత వాఙ్మయముచే ప్రకాశించెదవు.

(తిక్కన సోమయాజి)

అథాతో పురాణ జిజ్ఞాసా- నేను బహురూపములతో అనంత నామములతో. సృష్టిని చేసెదను అను తీవ్ర యిచ్ఛ యీశ్వరునిలో జ్వలించినది. సో కామయత బహుస్యాం అని తైత్తిరీయ ఉపనిషత్తు.

అట్టి యీశ్వరేచ్ఛ నుంచి యింత బహుళత్వముతో నిండిన జగత్తు ఆవిర్భవించెను. జగత్తుని సృజించవలెననే ఈశ్వరేచ్ఛనే సిసృక్ష అంటారు. భగవంతునికి గల వొకే వొక కామన యిది. కవీశ్వరునికిగల కోరిక కూడా యిదే, సిసృక్ష.

యీశ్వరుడు పాదార్థిక జగత్తుని సృజించును. కవీశ్వరుడు శబ్ద జగత్తుని సృజించును. శబ్దమూ శబ్ద వాచ్యమైన పదార్థమూ అభిన్నములు, పార్వతీ పరమేశ్వరముల వంటివి, విడదీయరానివి. శబ్దమే లేకపోతే జగత్తు అంధకారమయమగునని దండి కావ్యాదర్శములో చెప్పినాడు.

కవీశ్వర జగదీశ్వరుల వాంఛయొక్కటే. కార్యమూ వొక్కటే. అందుకే అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః అన్నారు. కవి ప్రపంచమును మార్చుట కాదు. ప్రపంచమునే సృజించుచున్నాడు అని సనాతనవాణి. అందుకే నిరంకుశాః కవయః అన్నారు.

ఈశ్వరుడు జగదీశ్వరుడు మాత్రమే కాదు. జగత్తు కూడా అతడే. అందుకే అతనిని అభిన్ననిమిత్తో పాదానకారణం అనుచున్నారు. అనగా కుమ్మరీ అతడే మట్టి కూడా అతడే. అట్లే జగత్తూ ఈశ్వరుడూ వొక్కరే.

కవీశ్వరుడూ కావ్య ప్రపంచమూ సర్వాత్మనా అభిన్నములు. వ్యాస వాల్మీకులు కవులుగానే కాదు వారి కావ్యములలో ప్రధాన పాత్రలుగా కూడా భాసించుచున్నారు. పురాణ యితిహాస కర్తలుగానే కాదు. అందలి రసరూపులుగా కూడా విరాజిల్లుతున్నారు.

గాయపడిన పక్షిని చూసి దుఃఖించి కావ్యమును రచించుట మాత్రమే కాదు సీతా చరితమును గానము చేయుట మాత్రమే కాదు అడవిలో అసహాయురాలై దుఃఖించుచున్న పరిత్యక్త సీతను ఆదుకొన్నదీ, జానకీ సుతులకు విద్యా బుద్ధులను గరిపి పెద్దజేసినదీ వాల్మీకి మహర్షియే.

అంటే కవి వేరు కావ్యము వేరు కాదు. కవే కావ్యము, కావ్యమే కవి. అట్లే శ్రోత కూడా కావ్యములో అంతర్భాగమే. అతడొక కొత్త రామాయణమును సృజించగలడు. పురాణమును నదితో పోల్చవచ్చును. అది అనేకములైన పిల్లకాలువలను, ఉపనదులనూ కలుపుకొని విస్తరించును. అదే పురాణత్వమూ, నవీనత్వమున్నూ.

పురాణముల్లు సృష్టి ప్రతిపాదకములని పెద్దలు చెప్పుదురు. సృష్టిని గురించి వర్ణనలు వేదములలో ఉపనిషత్తులలో సూత్రప్రాయముగా గలవు. వాటిని కథామంజరిగా బహుముఖముగా వికసింపజేసినది పురాణ సాహిత్యం.

పురాణములు సృష్టికి యీశ్వరుని కర్తగా వర్ణించుచున్నవి. ఈశ్వరుని సృష్టికర్తృత్వ మెట్టిది?

కర్మవలన జీవులు జన్మించుచున్నవి. కర్మ చక్రములో పరిభ్రమించుచున్నవి. యిక్కడ ఈశ్వరునికి కర్తృత్వమెట్లు సిద్ధించును? సారాంశములో యీశ్వరుడు కర్మఫలప్రదాత మాత్రమే. అతడు అవ్యక్త స్థితిలోనున్న కర్మలను వ్యక్తము చేయుచున్నాడు. కర్మబద్ధులైన జీవులను వ్యక్తము చేయుచున్నాడు. నామరూపములను ప్రదానము చేయుచున్నాడు. యిదంతా ఈశ్వరుని లీల, క్రీడావినోదము, యింద్రజాలముగా అభివర్ణించబడినది. యీ సృష్టినుంచి అతడు యెట్టి ఫలితమును ఆశించుట లేదు. ప్రయోజనమును నిర్దేశించుట లేదు.

శ్రీశ్రీ కవిత్వ సృష్టి రహస్యమును యిట్లు చెప్పినాడు. తుమ్మెద పుష్పముల నుండి మకరందమును సేకరించి తేనెపట్టుని నిర్మించును. కవికూడా అంతే. సర్వాత్మనా నూతనమైన కవిత్వమేదియు లేదు. నూతన కవిత్వ సృష్టి అనునది లేదు. సృష్టి అనగా స్మృతి మాత్రమే. జ్ఞాపకం మాత్రమే.

శబ్దమును స్మరించు వారు మాత్రమే వున్నారు. వారే వేదరుషులూ, కవులూ. అట్లే సృష్టికర్త లేడు, సృష్టిస్మర్త మాత్రమే ఉన్నాడు. అతనినే మనం వాడుకలో సృష్టికర్త అంటున్నాము. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తన ఆత్మకథకు అనుభవాలూ జ్ఞాపకాలునూ అని పేరుపెట్టుటలో యీ సనాతన రహస్యమే దాగి వున్నది.

స్మృతికీ యిచ్ఛకూ గల సంబంధము ఎట్టిది? స్మృతిలో యిచ్ఛకు స్థానమున్నదా? స్మృతి యనగా గతము యొక్క కొనసాగింపు. గతానుగతికత్వమునకు తప్ప నూతనత్వమునకు స్థానము లేదా? నవనవోన్మేషశాలి యగు ప్రతిభకు చోటెక్కడ?

వైదిక ధర్మము ప్రధానముగా స్మృతిపై ఆధారపడి యున్నది. వైదిక కర్మకాండను గురించి విపులీకరించే పూర్వమీమాంసా శాస్త్రము స్మృతికే ప్రాముఖ్యతను యిచ్చినది. వైదికులకు పితృదేవతారాధన (పితృయజ్ఞం) ప్రధానమగుటకు కారణమిదే. యీ పితృయజ్ఞం ద్వారా పితృప్రపితామహుల స్మృతిపరంపర కొనసాగుచున్నది.

శబ్దము అనగా వేదము అనాది స్మృతి మాత్రమే. శబ్ద అతిరిక్తమైన దైవమును మీమాంసకులు అంగీకరించరు. మంత్రా ఏవ దేవతాః మంత్రములే దేవతలని వారు అందురు. దేవతలకు ప్రత్యేక నామరూపములను వీరు నిరాకరింతురు. గురుశిష్యపరంపర ద్వారా వచ్చిన వేదమంత్రమే ఫలితమునిచ్చుచున్నది. అంటే వీరు సర్వాత్మనా స్మృతిపై ఆధారపడుదురని సారాంశం.

యింతగా స్మృతికి ప్రాధాన్యమిచ్చిన వీరు యిచ్ఛకు స్థానమీయలేదు. నిజమే వీరు సన్యాసాశ్రమమును తిరస్కరించిరి. గృహస్థాశ్రమమే ఉత్తమ ధర్మమనుచు ప్రవృత్తి మార్గమునకు పెద్దపీట వేసిరి. దానికి కారణము యిచ్ఛాపూర్తి మాత్రము కాదు. ప్రజాయై గృహమేధినాం అని కాళిదాసు అన్నట్లు సంతానము ద్వారా వేదధర్మమునూ, యజ్ఞమునూ కొనసాగించుటే. అందుకే వీరి భాషలో విధి చోదక శబ్దజాలమే కనబడును.

యిచ్ఛకు పూర్తిగా ప్రాధాన్యమిచ్చినది వామాచారము అని పిలవబడు తంత్రశాస్త్రము. యత్రేచ్ఛా సఏవ ధర్మః యత్ర నేచ్ఛా సఏవ అధర్మః ఇచ్ఛయే ధర్మము, వాంఛలేని విషయమే అధర్మము. ఆనందం బ్రహ్మణోరూపం, తచ్చ దేహే వ్యవస్థితం. దేహమే బ్రహ్మానందం. రూపములోనే ఆనందము వుందని నిర్వచించిన వామాచారులు దేవికి సహస్రరూపములను సహస్ర నామములను కల్పించినారు.

శాంభవీ, వైష్ణవీ, భవానీ, బ్రహ్మాణీ, శర్వాణీ ఇత్యాది నామములతో దేవిని స్తుతించుట ద్వారా, వొకే దేవి బ్రహ్మవిష్ణు మహేశ్వరాది బహుదేవతామూర్తులతో యిచ్ఛాపూర్తికై చరించినదని వర్ణించినారు తాంత్రికులు. చలం పాత్రలు పతివ్రతలు అని శివశంకరస్వామి అభివర్ణించుటలో యిచ్ఛయే ధర్మమన్న సనాతన తాంత్రిక రహస్యమే దాగియున్నది. తాంత్రికులు దేవిని రసపూర్ణగా అభివర్ణించారు.

యీ తాంత్రిక మార్గములో జగన్నాథ పండిత రాయాది మహాపండితులూ, మహాకవులూ ప్రయాణించినారు. కొన్ని శంకరమఠములు కూడా యీ మార్గమును అనుసరించినవి. ఈ రహస్యములు కళ్యాణ శ్రీకళా అను సంస్కృత గ్రంథమును, దానికి రాయప్రోలు లింగన సోమయాజిగారు వ్రాసిన ఆముఖమును పరిశీలించినచో స్పష్టమగును.

దేవీపూజ అతి ప్రాచీనమైనది. పరంబ్రహ్మయే పార్వతి, గాయత్రి ఇత్యాది స్త్రీదేవతా రూపములను ధరించినట్లు కేనోపనిషత్తు వర్ణించుచున్నది. అసలు సృష్టికి భగవంతుని లోని స్త్రీతత్వమే కారణమని సనాతనులు భావించిరి. వైదికమందలి యిచ్ఛాతత్వమును తాంత్రికులు తీవ్రరూపములోనికి తీసుకొని వెళ్ళిరి.

బౌద్ధులు యిచ్ఛను దుఃఖముగా భావించిరి. క్రైస్తవం యిచ్ఛను పాపంగా అభివర్ణించింది. వామాచారులు యిచ్ఛను ఆనందంగా అభివర్ణించారు. పౌరాణికులు యిచ్ఛను సృష్టిమూలంగా వ్యాఖ్యానించారు. భగవంతుడే స్త్రీపురుషరూపములు ధరించి సంయోగము పొందగా సృష్టి జరిగినది. భగవంతుడే మాయ యొక్క గర్భములో ప్రవేశించినాడు. యిత్యాది పురాణకథలు కోకొల్లలు.

యిచ్ఛ స్వేచ్ఛకు దారితీసినది. ప్రేమ భావమునకు పురాణ కావ్యములలో స్థానము లభించినది. భవభూతి ఉత్తర రామచరిత్రలో దాంపత్యమును కేవల వైదిక ధర్మబద్ధముగా వర్ణించలేదు. అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వా స్వవస్థాస్వపి, విశ్రామో హృదయస్య యిత్యాదిగా వర్ణించినాడు. సుఖదుఃఖములలో అద్వైతముగా, ముసలితనం వల్ల కూడా క్షీణించని రసతత్వముగా, హృదయమునకు విశ్రాంతిగా దాంపత్యమునకు భాష్యం చెప్పినాడు. యిదే స్ఫూర్తితో శ్రీశ్రీ ఆనందం అర్ణవమైతే, అనురాగం అంబరమైతే అనుచు అద్వైత ప్రేమతత్వమునే ఆలపించినాడు. యీ ప్రేమతత్వమే యీశ్వరుని యందు భక్తితత్వమైనది.

దైవ అవతారములలో యిచ్ఛాతత్త్వము విశ్వరూపము ధరించినది. రసోవైసః అను వేదవాక్కుకి భాష్యములుగా శ్రీకృష్ణ రామాది అవతార కథలు నిలిచినవి. పురాణములు వైదిక తాంత్రిక తత్త్వముల సమన్వయంతో జన్మించినవి.

**అయం క్రియా యోగపదైః**

**పుమాన్ వైదిక తాంత్రికైః**

**అర్చన్ను భయతః సిద్ధిం**

**అతో విందత్య భీపిత్సం** (భాగవతం)

వైదిక తాంత్రిక మార్గముల సమన్వయమునే భాగవతాది పురాణములు బోధించినవి.

స్మృతి, యిచ్ఛల సమన్వయమే పురాణ సృష్టితత్త్వము.

అలాగే తంత్రము పూర్తిగా వర్ణాశ్రమ విరుద్ధము. వైదిక సనాతన ధర్మము వర్ణాశ్రమ బద్ధము. ఈ రెండింటి సమన్వయమే భక్తిమార్గమైన పురాణతత్త్వము. ద్వంద్వములు పరస్పరాశ్రితములు అవడం వల్ల యిట్టి సమన్వయం సాధ్యమైంది.

సృష్టి లయములు నిత్యములు. ప్రతిక్షణము సంభవించుచునే యున్నవని పురాణములు స్పష్టము చేయుచున్నవి. యీశ్వరుని మొదటి అవతారం జగత్తే. ఈశ్వరుని నిజమైన నిత్య అవతారం జీవుల హృదయములలోనే.

కవియే కావ్యముగా అవతరించును. శబ్దమే అతని లీలామానుష విగ్రహం. సహృదయుని హృదయమే అతని నిత్యావతార క్షేత్రం.

ఈశ్వరతత్త్వమూ, కవితత్త్వమూ సారాంశంలో వొకటే. పదమూ పదార్థమూ వొకటే.

అద్వైతులు జగత్తుని మాయయనుచున్నారు. ఈశ్వరుడు మాయావి అనుచున్నారు. కవి కూడా మాయావియే. అతడు శబ్ద జగత్తుని సృష్టించుచున్నాడు. అందువల్ల కవీశ్వరుడు, యీశ్వరుల కార్యకలాపము వొక్కతీరులోనిదే. రెండూ కల్పితములే. ఆ కల్పనే రసస్వరూపము. రసోవైసః యీశ్వరుడూ రసస్వరూపుడే కవీ రసస్వరూపుడే. అసలు యీశ్వరుడూ కవీ కూడా వారి కృతుల్లాగే వట్టి కల్పనలని పారమార్థిక సత్యమైయున్నది. మరోరకంగా కూడా చెప్పవచ్చును. కృతే కర్తని కల్పిస్తోంది. శబ్దమే కవినీ, జగత్తే యీశ్వరుణ్ణీ కల్పిస్తున్నాయి. వొకే సత్యమును బహుళముగా

వ్యాఖ్యానించవచ్చును. అసలు బహుళ వ్యాఖ్యానములు మాత్రమే దృష్టి గోచరములూ, శబ్ద గోచరములున్నూ.

వేదం, విద్య, పురాణం, కావ్యం, ధర్మం వీటి అంతస్సంబంధం. సకలమూ వ్యాఖ్యాన సాపేక్షములే. ఆ వ్యాఖ్యానములు బహుళములు, అనంతములు. అట్టి వ్యాఖ్యానములను పురాణ భాష్యరూపములో రాణి శివశంకరశర్మ పొందుపరచు చున్నాడు.

# వేదవిద్యలు

విద్య అంటే యేమిటి? విద్యా నామకా? తత్వం విశదయతు అని అర్థించే జిజ్ఞాసువుల నిమిత్తం యీ అధ్యాయం ఉద్దేశించబడింది.

విద్‌జ్ఞానే. వేదము, విద్య అనే పదాలు ఒకే ధాతువు నుండి పుట్టాయి. రెండింటికీ జ్ఞానమనే అర్థం.

వేదములనగా నేమి? త్రయీ అనే పేరు వుంది వేదానికి. చతుర్వేదాలు అని ప్రసిద్ధి ఉంది. అనంతా వై వేదాః అన్నారు. అంటే వేదములు అనంతములు, విద్యలు అనంతములు. మరి యీ లెక్కేమిటండి? మూడని నాలుగని సంఖ్య యెలా వచ్చిందంటే, - వేద వ్యాసుడు వేద విభజన చేశాడన్నారు. బ్రహ్మకి నాలుగు ముఖములన్నారు. బ్రహ్మ అంటే విశ్వవ్యాప్తుడని అర్థం. మరి అతనికి నాలుగు ముఖాలేమిటి అంటే వ్యవహారం యెప్పుడూ పరిమితిని ఆపేక్షిస్తుంది. సంఖ్య వొక పరిమితి. మానవ బుద్ధికి అవధి వుంది. పరిమితి ఉంది. అందువల్ల వేదవ్యాసుడు యిట్టి వేదవిభజనకు పాల్పడ్డాడు. నాలుగు వేదాలనే వాడుకని తీసుకువచ్చాడు.

కాని యిది వాడుకోసం లోకం కోసం ఉద్దేశించబడినది మాత్రమే. వేదం అనిర్వచనీయం. యేది వేదం? యేది విద్య? ధనుర్వేదం అన్నారు, ఆయుర్వేదం అన్నారు. సకల శాస్త్రాలనీ నైపుణ్యాలనీ వేదంగా విద్యగా నిర్వచించారు.

వల్లించడమే కాదు గురి చూడడమూ వేదమూ, విద్యే. నాడిని పట్టి చూసి రోగ నిర్ధారణ చేయడమూ, చికిత్స చేయడమూ వేదమే, విద్యే.

ముఖే ముఖే సరస్వతీ - ప్రతీ ముఖంలోనూ విద్య వుంది. జ్ఞానం వుంది. వేదం విశ్వవ్యాప్తం. ప్రముఖ రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గోదావరి తీరంలోని ఆడవారి కబుర్ల నుంచి భాషని అభ్యసించానన్నారు.

అంటే విద్య గాలిలోనూ నీటిలోనూ సర్వవ్యాప్తంగా వుంది. శబ్ద గుణక మాకాశం అన్నారు. శబ్దం అంటే వేదమని అర్థం. అంటే అంతటా అవ్యక్తంగా వేదం ఉంది విద్య వుంది. రుషులు చేసింది వొడిసి పట్టుకోవడమే.

వేదానికి కర్తలేదు. విద్యలకి కర్తలు లేరు. స్మర్తలు మాత్రమే వున్నారు. అంటే జ్ఞప్తికి తెచ్చుకునేవారు. వారినే రుషులు అన్నారు. వీరిలో స్త్రీ పురుషులు యిద్దరూ వున్నారు. శృతి, స్మృతి పురాణాలు గురుముఖతః శిష్య ప్రశిష్య మార్గం ద్వారా ప్రవహిస్తున్నాయి. అలాగే పశుపాలనం, వ్యవసాయం, చేనేతలాంటి విద్యలన్నీ గురుకుల పద్ధతిని అనుసరించి కొనసాగుతున్నాయి. సకల కులవృత్తులూ వేదాలే, విద్యలే.

దీనికి ప్రమాణంగా నిలిచేవి బ్రహ్మ పురాణంలోని యీ శ్లోకాలే.

**కర్షకాణాం కృషిఃవృత్తిః**

**పణ్యం పణ్యాయ జీవినాం**

**అస్మాకం గాః పరావృత్తిః**

**వార్తాభేదైరియంత్రిభిః**

**విద్యయా యే యయా యుక్తః**

**తస్య సా దైవతం మహత్।**

**సైవ పూజ్యా అర్చనీయా చ**

**సైవ తస్యో్ పకారికా.**

కృషి వాణిజ్యం, పశుపాలన అన్ని వృత్తులూ విద్యలే. యెవరి విద్య వారికి సాక్షాత్తూ దైవం. ఆ విద్యే వారికి మేలు చేస్తుంది. అందుకే ఆవిద్యనే దైవంగా పూజించాలి. యిది గోపాలకుల వేద వాక్కు. బ్రహ్మ పురాణం నుండి స్వీకృతం.

విద్య అంటే వైవిధ్యభరితమైనది. బహుళమైనది. అసంఖ్యాకమైనది. దానికి వొకే సిలబస్ లేదు. వొకే స్థలం లేదు. వొకే కాలం లేదు. అది స్థలకాలాతీతం.

కాని క్రైస్తవ విద్యా విధానం విద్యని స్థలకాలబద్ధం చేసి వేసింది. అసలు క్రైస్తవ దృష్టే పరిమితం. దాని విశ్వం పరిమితం. దృష్టి పరిమితం, కాలం పరిమితం. అలాగే కేంద్రీకృతం. చర్చి, గ్రంథం దానికి ప్రాణాలు.

అందుకే క్రైస్తవుల పరిపాలన మొదలై పాఠశాల వ్యవస్థ ప్రారంభం కావడంతో విద్య నశించింది. అంటే విద్య కేంద్రీకృతమైంది.

అంతక్రితం ఉపాధ్యాయుని యిల్లే పాఠశాల. గురుకులం అంటే గురువుగారి యిల్లు అని అర్థం. ఊరే గురువుని పోషించేది. అతడు గ్రామంలో విడదీయరాని భాగం. ఆనాడు గ్రామీణులు అందరికీ అక్షరజ్ఞానం, గణితజ్ఞానం తప్పనిసరిగా లభించేవి.

వలస క్రైస్తవులు వచ్చి పాఠశాలలు పెట్టి, సిలబస్ నిర్దేశించి, స్థలకాలాలని క్రమబద్ధం చేశారు. విద్యని వ్యవస్థీకరించారు. కేంద్రీకరించారు. దానితో అక్షరాస్యత క్షీణించింది. గురువు ఉద్యోగిగా మారాడు. అతడు గ్రామంలో భాగం కాదు. పైగా విద్య అంటే ప్రభుత్వం నిర్దేశించిన సిలబస్ అని అర్థం. పాఠ్యప్రణాళిక బహుళత్వాన్ని రద్దు చేసింది. ప్రణాళిక ప్రధానమై సహజగమనం మందగించింది.

పాఠశాల వొక భవనంలో వుంటుంది. దానికి నిర్దిష్ట సమయం వుంటుంది. ఆ సమయంలోనే గురువు గురువుగా వ్యవహరిస్తాడు. పాఠశాల సమయం ముగిశాక అతడు గురువు కాదు. గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః అంటూ గురువుకి యిచ్చిన విశాలమైన స్థానం వ్యాపకత్వం చిన్ని కంతలోకి కుదించబడింది. విశాలత్వాన్ని బహుళత్వాన్ని కత్తిరించి కుదించడం క్రైస్తవుడి కర్తవ్యం. వాడి దృష్టే సంకుచితం.

క్రైస్తవ విద్యా విధానంలో కులవృత్తులు విద్యలు కాకుండా పోయాయి. అందుకే యీనాడు వ్యవసాయం, చేపలు పట్టడం విద్యలు కావు. అవి ప్రజల అవసరాలతో సంబంధం కలిగినవైనా వాటికి జ్ఞానంగా గుర్తింపులేదు. కూటికొరకు కోటివిద్యలు అనే మాటకి అర్థం మరుగున పడిపోయింది. తిండిపెట్టక పోయినా బడిలో నిదే చదువు. యీ దిక్కుమాలిన చదువులే చివరికి తీవ్ర ఆహారసంక్షోభానికి దారి తీస్తున్నాయి.

ముక్కోటి దేవతలు, అనంత వేదాలు, కోటివిద్యల స్థానే విశ్వవిద్యాలయం డిగ్రీలూ పట్టాలూ వచ్చి చేరాయి. పుస్తకాల్లోనే చదువు వుందనే అజ్ఞానాన్ని వ్యాపింపజేశాయి. పరీక్షలు పెరిగి పెరిగి వ్రాతే విద్య అనే అవిద్యని సర్వతోముఖం చేశాయి.

వైదికులూ, పశుపాలకులూ యిద్దరికీ చేతిలో పుస్తకం లేదు. కలం లేదు. యిద్దరూ విద్యావంతులే, సరస్వతీ పుత్రులే.

లేఖనం మాటపై దొరతనం చలాయించడమనేది క్రైస్తవం తప్ప మరేమీ కాదు. లేఖనం వాక్కుని అనుసరిస్తుంది అది సనాతనం.

వాక్కు అందరిదీ వొకటే కాదు. వాక్కులు అనంతం. అందుకే ఆయా అధికారి భేదాన్ని బట్టి కులాలని బట్టి ప్రాంతాలని బట్టి విద్య వుంటుంది. పురాణాలు, పాటలు, సామెతలు, శృతిస్మృతులు, శాస్త్రాయి యిలా విద్య చాలా వైవిధ్యభరితంగా ఉంది.

వేదశాస్త్రాల్లో చెప్పిన సూక్ష్మాల్నే పురాణాల్లో సులభ బోధకంగా చెప్పేవారు. అందువల్లనే అన్ని శాస్త్రాలూ అన్ని విషయాలూ అందరికీ స్థాయీ భేదంతో అందుతాయి. వివిధ భాషల మధ్య అనుబంధం ఉంది. అలాగే వివిధ ఆలోచనలూ, వ్యాఖ్యానాలూ, కథనాల మధ్య గాఢ బంధం వుంది.

యీ విశాల విద్యావిధానాన్ని వలస క్రైస్తవుడు సంకుచితం చేసి వేశాడు. బంధించాడు. కుదించాడు.

యీనాడు మెకాలే మానసపుత్రులైన దళితవాదులూ, ప్రగతివాదులూ సిలబస్ యెలా ఉండాలి, యెలాంటి పాఠాలు వుండాలి అని తీవ్రంగా చర్చిస్తున్నారు అంతేకాని పాఠ్యప్రణాళికనే మూలమట్టంగా తిరస్కరించడం లేదు. అసలు పాఠ్యప్రణాళికను యెవరు నిర్దేశించగలరు అని ప్రశ్నించడం లేదు. యిన్ని కులాలకి, జాతులకి, భాషలవారికి, ప్రాంతాలవారికి వొకే సిలబస్ యెలా సాధ్యం, వొకే విద్యావిధానం హింస కాదా అని చర్చించడం లేదు. అన్ని భాషల్నీ మాండలికాల్నీ పక్కకు నెట్టి ఇంగ్లీషు మాధ్యమం రాజ్యం చేయడాన్ని గురించి, క్రైస్తవ ఆధిపత్యం గురించి మాట్లాడడం లేదు.

క్రైస్తవ అభివృద్ధి నమూనాయే లక్ష్యంగా విద్యావిధానం విస్తరిస్తోంది. క్రైస్తవ సామ్రాజ్యవాదమే దాని పాఠ్యప్రణాళిక. క్రైస్తవ దేశాలకి కూలీలని తయారుచేయడమే దాని లక్ష్యం.

కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా.

భారతదేశం ఈ నాటికీ యీ మాత్రంగానైనా స్థిరంగా నిలిచి ఉండటానికి ప్రాచీన కులవృత్తులూ, ప్రాచీన వ్యవసాయ పద్ధతులూ అంతరించకపోవడమే కారణం. మన ఐదువేళ్ళూ నోట్లోకి వెళ్ళడానికి కారణం యింగ్లీషు చదువులు కాదు. గ్రామీణ వృత్తులే కారణం. సనాతన జ్ఞానమే శ్రీరామరక్ష.

క్రైస్తవ నాగరికతల వల్ల కులవ్యవస్థ నశిస్తుంది. దానితోపాటు సనాతన జీవిత విధానాలు కూడా నశిస్తాయని వలస క్రైస్తవులు ఆశించారు. మార్క్సు వంటి ఆధునిక మేధావులూ కలలు కన్నారు. పాశ్చాత్య ప్రగతి నమూనాయే భారతఖండానికి తారకమంత్రం అన్నారు.

కాని భారతీయులు సర్వాత్మనా ఆధునికత వైపు ప్రయాణించలేదు. కాళీపూజ ద్వారా కమ్యూనిజం మిషతో క్రైస్తవ పెట్టుబడి దారీ అభివృద్ధిని అడ్డుకుంటూ వచ్చారు.

భారతీయులు మబ్బుల్ని చూసి ముంత వొలక బోసుకోలేదు. ట్రాక్టర్లను చూసి యెద్దులని విడనాడలేదు. అందువల్లనే చమురు సంక్షోభం తలెత్తలేదన్నారు మేధావులు.

అలాగే మిల్లు యంత్రాన్ని చూసి చేనేతని విడనాడలేదు. భారతీయులలో చేతికి చాలా ప్రాధాన్యం వుంది. కరాగ్రేవసతే లక్ష్మీఃఅన్నారు. కరమూలేతు గోవిందః అన్నారు. ఇంద్రియాల్ని దేవతలుగా భావించారు. అందుకే యే యితర సాధనాలను వాడకుండా చేతితోనే భోజనం చేస్తారు భారతీయులు. మొదట ఈ ఆచారం తెల్ల క్రైస్తవులకి వింతగానే కనబడింది. నాగరికులవ్వాలని భావించేవాళ్లు వలస పాలనలో క్రైస్తవుల్ని అనుకరిస్తూ ఫోర్కులతో, చెంచాలతో భోజనం చేసేవాళ్లు. గాంధీ యీ పద్ధతినే మొట్టమొదట అవలంబించాడు. తన పిల్లలకీ భార్యకీ కూడా నేర్పాడు. తర్వాత యీ క్రైస్తవ నాగరికత పద్ధతిని విడనాడడానికి చాలా కష్టపడ్డానని రాశాడు గాంధీ మహాత్ముడు సత్యశోధనలో.

యేతావాతా తేలిందేమిటంటే భారతీయులకి చెయ్యి చాలా ప్రధానమైనది. అందువల్ల చేతి వృత్తులు వారి సంస్కృతిలోనూ, జీవన విధానంలోనూ, రక్తంలోనూ భాగమైపోయాయి. కనుక యెన్ని యంత్రాలు వచ్చి పోటీకి దిగినా ఆత్మహత్యలకైనా సిద్ధపడ్డారు కాని చేతివృత్తుల్ని సర్వాత్మనా విడనాడలేదు. యూరప్‌లో సంభవించిన పారిశ్రామిక యాంత్రిక విప్లవం భారతదేశంలో యీనాటికీ పూర్తిగా చోటు చేసుకోలేదు. కుమ్మరి వీధులు, కమ్మరి వీధులు, సాలెవీధులు యింకా మటుమాయం కాలేదు. గ్లోబలైజేషన్ తర్వాత కూడా పరిస్థితిలో పూర్తి మార్పు లేదు.

అత్యాధునిక షాపింగ్ మాల్స్ వచ్చి కోమటి దుకాణాల్ని మూయించేస్తా యన్నారు. కులవృత్తులు నశిస్తాయి అన్నారు. వాటితో కులాలూ అంతరిస్తాయని ప్రగతి వాదులూ, దళిత వాదులూ విశ్లేషించారు. కాని కోమటి దుకాణాలు వర్ధిల్లాయి.

షాపింగ్‌మాల్స్ మూతపడ్డాయి. వైశ్యజాతికి కన్యకాపరమేశ్వరీదేవి చలవ వుంది. మాల్స్ మూతపడడానికి కారణం యేమిటి? కుల వ్యవస్థ. కృషి గోరక్ష వాణిజ్యం, వైశ్య కర్మ స్వభావతః (భాగవతం)

కులవ్యవస్థ సామాజికమైనది. సాంస్కృతికమైనది. వేల సంవత్సరాల చరిత్ర కలది.

షాపింగ్‌మాల్స్‌కి యిక్కడి స్థానిక సంస్కృతులతో సమాజంతో యెటువంటి అనుబంధమూ లేదు. అది వ్యాపార దుకాణం అంతే. ప్రజలతో యెటువంటి సంబంధం లేదు. సంస్కృతి స్పర్శ శూన్యం. డబ్బు సంబంధం మాత్రమే అక్కడ వుంది. అందుకే అవి చిల్లర దుకాణాల ధాటికి కొట్టుకుపోయాయి.

భూమికి ఆర్నెల్ల ముందు పుట్టానంటాడు జాంబవంతుడు. జాంబవంతుడు మాదిగ కులదైవం. యీ కులాలూ, కుల వృత్తులూ సింధునాగరికత కంటె ప్రాచీనమైనవి. ఆ స్మృతులూ చెదిరేవి కావు. స్మృతే శృతి. స్మృతుల నుండే సంస్కృతి రూపొందుతుంది. సంస్కృతికీ వృత్తికీ అవినాభావ సంబంధం వుంది. యీ సంబంధాన్ని తుదముట్టడించడం క్రైస్తవుడికి సాధ్యం కాలేదు. యీలోగా క్రైస్తవ నాగరికతే సంక్షోభంలో పడింది.

## ప్రపంచీకరణ ప్రమాదం

అందువల్ల కులవృత్తులు ప్రకృతి సహజమైనవి. క్రైస్తవ నాగరికత వికృతి. అందుకే దానిలో బహుళత్వం శూన్యం. అది ఏకశిలా సదృశం.

కులవృత్తుల్నీ, విద్యల్నీ అణచివేతగా భావించడం క్రైస్తవ నాగరికత ఫలితం క్రైస్తవుడి దృష్టిలో విద్య అంటే గ్రంథం అని మాత్రమే. కాని భరతఖండంలో ప్రామాణిక గ్రంథం అంటూ యేదీ లేదు.

భారత ఖండంలో విద్య అంటే గ్రంథం కాదు. అనాది స్మృతి మాత్రమే. అది శిష్య ప్రశిష్య పరంపరగా కొనసాగుతుంది. ఆ కొనసాగింపులోనే నూతనత్వం కొని రాబడుతుంది.

వలస పాలనకు ముందు భారతదేశం నాణ్యమైన వస్త్రాల్ని క్రైస్తవ దేశాలకి యెగుమతి చేసేది. కళాత్మకతలోనూ నాణ్యతలోనూ, ఆ వస్త్రాలను మించినవే వుండేవి కాదు.

ఈ విశ్వం పంచభూతములనే నూలుతో నేయబడిందని వర్ణించాడు అన్నమయ్య. ఆ వృత్తికి అంత గౌరవం వుండేది. దైవాలకి కూడా కుల వృత్తులతో అనుబంధం వుండేది. దేవతలు కూడా వస్త్రధారులే కదా? దైవమూ మానవుడూ వొక్కరే. అందుకే ఆహారంలోనూ వేషంలోనూ పోలిక. తదన్నాస్తస్య దేవతాః అని రామాయణం చెప్తోంది. అంటే ఆయా కులస్తులు స్వీకరించే ఆహారాన్నే ఆయా దేవతలు స్వీకరిస్తారు. వేషధారణ కూడా అంతే. అందుకే దైవారాధకులైన నందవరీక బ్రాహ్మణులకి సాలెవృత్తిని అవలంబించిన కులాలవారితో గాఢ అనుబంధం వుండేది. ఈ అనుబంధమే ఈ విశ్వాన్ని విష్ణువు యొక్క నేత పనిగా వర్ణించడానికి దారితీసింది. మరి అన్నమయ్య నందవరీత బ్రాహ్మణుడే (శ్రీ అన్నమాచార్యులు యక్షగాన సంప్రదాయం–అబ్బూరి గోపాలకృష్ణ)

యే కులానికాకులం ద్వీపంలా వుండేది. పరస్పర సంబంధాలు వుండేవి కాదనడం క్రైస్తవ దృక్పథం. యీ వలస క్రైస్తవులే బ్రాహ్మణులకి శ్రమతో, వృత్తులతో యేమాత్రం సంబంధం లేదన్నారు. విప్రులు యితర కులాలనీ వృత్తులనీ కించపరచి ఏకాంతమందిరాల్లో కూర్చుని అవాస్తవిక రచనలు చేశారన్నారు. వాస్తవానికి బౌద్ధిక పరిశ్రమకీ వృత్తులకీ అవినాభావ సంబంధం వుండేది. యీ అనుబంధం నుంచే సనాతన వాఙ్మయం ఆవిర్భవించింది. అందుకొక చక్కని దృష్టాంతం అన్నమయ్య కవిత్వం.

విశ్వమంతా పరస్పరాధారితం. అదొక విరాడ్రూపం అని భారతీయుల భావన. అలాగే వివిధ కులాల మధ్య కులవృత్తుల మధ్య బంధం వుంది. వీరందరికీ పంచాంగాన్ని ఆశ్రయించి కాల చక్రగమనాన్ని గురించి వివరించే బ్రాహ్మణునితో విడదీయరాని బంధుత్వం వుంది.

యీ సంబంధానికంతటికీ క్రైస్తవుడు గండి కొట్టాడు. వ్యవసాయానికీ వృత్తులకీ గల సంబంధాన్ని తెంచివేసినట్లే, వివిధ కులాల మధ్య చిచ్చుపెట్టాడు. అంగాంగి భావాన్ని గురించి మౌనం వహించి, అసమానతలని, అణచివేతని మాత్రమే భూతద్దంలో చూపాడు.

దీని ఫలితంగా స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థకి క్షీణదశ పట్టింది. దాని విషాద శిథిలాలే యీనాటికీ కొనవూపిరితో కొట్టుమిట్టాడుతున్న కుల వృత్తులూ, కుల విద్యలూ. ఆ కొనవూపిరిని కూడా ఆర్పెయ్యాలని ఆధునిక ప్రభువులు ఆలోచిస్తున్నారు. దానినే ప్రపంచీకరణ అంటున్నారు.

మాకు గతంతో పనిలేదు మంచి గతమున కొంచె మేనోయ్ అంటారు ఆధునికులు. అంటే మరెవరో కాదు క్రైస్తవులు. వర్తమానం అంటే క్రైస్తవ సామ్రాజ్యవాదమనే అర్థం.

గతాన్ని తీసివేస్తే మిగిలేది క్రైస్తవ అభివృద్ధి నమూనాయే. అదే మనకి తరుణోపాయం అంటున్నారు ఆధునికులు. అంటే గతస్మృతులేవీ లేని శుష్కవర్తమాన మన్నమాట.ప్రపంచీకరణ అభివృద్ధి పేరుతో, ప్రగతి పేరుతో సాగే విధ్వంసమన్నమాట.

హరిత విప్లవం పేరుతో సాగిన క్రైస్తవ వాణిజ్య వ్యవసాయం ఫలితంగానే దళితులపై దాడులు జరిగాయి. దళితులపై దాడికి కారణం కులవ్యవస్థ కాదు. వలస అభివృద్ధి నమూనాయే యీ తీవ్ర హింసకి మూలం. యిక హిందూ వాదమైతే ప్రచ్ఛన్న క్రైస్తవమే.

## ప్రకృతితో అనుబంధం

ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు, పితర్మాతర్యది హోపబ్రువే వామ్.

ఇది సంధ్యా వందనమంత్రము. భూమిని తల్లిగానూ, ఆకాశాన్ని తండ్రిగానూ భావించి నమస్కరిస్తున్నారు యీ మంత్రం ద్వారా బ్రాహ్మణులు.

ప్రకృతిని సనాతనులు అంతగా ఆరాధించారు. ప్రాచీన సాంఖ్యులు మానవుడు ప్రకృతి నుంచి ఆవిర్భవించాడన్నారు. ప్రకృతి తల్లి అన్నమాట. ప్రకృతిపై మానవ ఆధిపత్యం అనేది క్రైస్తవ సామ్రాజ్యవాదం నుంచి పుట్టిందే.

శకుంతల కణ్వాశ్రమం నుంచి భర్త దగ్గరికి వెళ్లిపోతూ చెట్లకి పశువులకి దిగులుగా వీడ్కోలు పలికింది అభిజ్ఞాన శాకుంతల నాటకంలో. కుమార సంభవ కావ్యంలో పార్వతి దేవదారు వృక్షాల్ని కాపాడడం కోసం సింహాల్ని కాపలా పెట్టింది. శాపగ్రస్తుడై విరహాన్ని పొందిన యక్షుడు మేఘంతో భార్యకు సందేశాన్ని పంపాడు. పురాణాలలో పంచతంత్రాది కథలలో పశుపక్ష్యాదులకీ భాష వుంటుంది. అవి కూడా మాట్లాడ్తాయి. ఉపనిషత్తులలో పక్షుల్ని వాటి ప్రవృత్తిని ఆత్మతత్వ వివరణగా గ్రహించడం పండిత విదితమే.

క్రైస్తవం దృష్టిలో మనిషికి మాత్రమే ఆత్మ వుంది. పశుపక్ష్యాదులకి ఆత్మ లేదు. అవి మానవుడికి ఆహారంగా ఉద్దేశించబడినవే కాని జీవులుకావు. దీనినే ప్రస్తావిస్తూ గాంధీ మహాత్ముడు సత్యశోధన గ్రంథంలో క్రైస్తవ సంకుచితత్వాన్ని

విమర్శించాడు. ప్రాచ్యతత్వం ప్రకృతినంతటినీ ఆత్మతత్వంగా భావిస్తోంది. అందుకే పాశ్చాత్య పర్యావరణవాదులకి ప్రాచ్యతత్వమే దిక్కైంది. భారతీయ తత్వం ప్రకృతి అంతా పరమాత్మ స్వరూపమేనని చాటుతోంది. భగవానుని మొదటి అవతారం ప్రకృతియేనని భాగవత పురాణం వర్ణిస్తోంది.

ఈ భారతీయ దృష్టివల్లే జగదీశ్ చంద్రబోస్ చెట్లకి కూడా స్పందన వుందని, సుఖదుఃఖాది ద్వంద్వాలు వున్నాయని వైజ్ఞానికంగా నిరూపించాడు. దీని వెనుక భారతీయ తత్వమే చోదక శక్తి. మనిషిని ప్రకృతిలో విడదీయరాని భాగంగా చూడదు క్రైస్తవం. ప్రకృతినీ మనిషినీ విడదీస్తుంది. ప్రకృతిని కించపరుస్తుంది.

అందువల్లనే క్రైస్తవ నాగరికత ప్రకృతి విధ్వంసాన్ని తీవ్రతరం చేస్తోంది. వ్యవసాయ సంక్షోభానికి, వ్యవసాయ సమాజంలో హింసకీ దారి తీస్తోంది.

భూమిని పూర్తి మారకపు వస్తువుగా మార్చివేయడం వెనుక క్రైస్తవ దృష్టే కారణం. మానవ కేంద్రకము ప్రకృతి వ్యతిరేకమైన తత్వమే కారణం. క్రైస్తవ సైన్సు కూడా యిట్టి ప్రాపంచిక దృక్పథంతోనే పురోగమిస్తోంది.

## ప్రకృతిసిద్ధమైన వర్ణవ్యవస్థ

వర్ణ వ్యవస్థ అపౌరుషేయం. అది ప్రకృతి సహజం.

కులం అంటే నివాసం అని అర్థం. గురుకులం అంటే గురువు యొక్క నివాసం అని అర్థం. కులాయం అంటే గూడు అని అర్థం. యిది కులశబ్ద భవమే. అంటే వొక వ్యవస్థ ద్వారా ప్రకృతిని వాసయోగ్యంగా మార్చేదే కులవ్యవస్థ. ఈ వ్యవస్థలో వృత్తులూ ఆచారాలూ దేవతలూ భాగం. యిది బహుళత్వంతో కూడిన వ్యవస్థ. వృక్షజాతులలోని వర్ణవ్యవస్థని వృక్షాయుర్వేదం సుస్పష్టం చేస్తోంది.

**లఘు యత్ కోమలం కాష్ఠం**

**సుఘటం బ్రహ్మజాతి తత్**

**దృఢాంగం లఘు యత్ కాష్ఠం**

**అఘటం క్షత్రజాతి తత్**

**కోమలం గురు యత్ కాష్ఠం**

**శూద్రజాతి తదుచ్యతే**

విభిన్న జాతి ద్వయ కాష్ఠ జాతా
నశ్రేయసే నాపి సుఖాయ నౌకా
నైషా చిరం తిష్ఠతి పచ్యతేవ
విభిద్యతే సరితి మజ్జతేచ

(వృక్షాయుర్వేదం)

ఈ శ్లోకాలు వృక్షాలని వర్ణధర్మాన్ని ఆశ్రయించి వర్ణిస్తున్నాయి.

1) తేలికైనది మృదువైనది బ్రాహ్మణ వర్ణానికి చెందిన కర్రగా చెప్పవచ్చు.

2) దృఢమైనది తేలికైనది క్షత్రియ జాతి కాష్ఠము.

3) బరువైనది కోమలమైనది వైశ్యజాతి కాష్ఠం.

4) దృఢమైనది బరువైనదైన కాష్ఠం శూద్రజాతి కాష్ఠం.

భోజుని దృష్టిలో క్షత్రియ కాష్ఠంతో కూర్చిన నౌక మాత్రమే సుఖాన్ని యిస్తుంది. అన్ని వర్ణాల కాష్ఠాల్ని కలిపి చేసిన నౌక సుఖాన్ని కానీ శుభాన్ని కానీ చేకూర్చదు. పైగా అది తొందరగా శిథిలమైపోతుంది. ముక్కలై సాగరంలో కలిసిపోతుంది.

ఇక్కడ నౌకా నిర్మాణంలో కూడా కులప్రసక్తి కనబడుతుంది. వర్ణ సాంకర్యంతో కూర్చబడిన నావ శిథిలమౌతుందన్న హెచ్చరిక కనబడ్తుంది.

వర్ణాలు తమ తమ ప్రత్యేకతను నిలుపుకుంటూ రావాలన్న తత్వం భారతీయ శాస్త్రాలలో దర్శనమిస్తుంది. నిజమే. యిది యెవరి ప్రత్యేకతల్ని యెవరూ విడనాడనక్కర లేదన్న సత్యాన్ని స్ఫుటం చేస్తుంది. ప్రత్యేకతల్నీ విశిష్టతల్నీ బలపరుస్తుంది. సాంస్కృతిక బహుళత్వానికి సుగమమైన మార్గం యిదే. సాంకర్యం అస్తిత్వానికే ముప్పుగా పరిణమించకూడదు.

స్థానిక ప్రత్యేకతలు -వృత్తి ప్రత్యేకతలు- సాంస్కృతిక ప్రత్యేకతలు యిలాంటి నానాత్వాన్ని అంతటినీ రద్దుచేసి విశ్వమానవ వాదాన్ని స్థాపిస్తే ఆ నౌక నడిసంద్రంలో మునిగిపోతుందని రుషివాక్కు.

## సాంకర్య తత్వం

పంచభూతాల సాంకర్యం నుంచి ప్రకృతి ఆవిర్భవించింది. దృశ్య జగత్తు పురుడు పోసుకుంది. శంకరాచార్యుల వారు పంచీకరణ గ్రంథంలో పంచభూతాలు

వివిధ పాళ్ళలో మిశ్రమం కావడం ద్వారా స్థావర జంగమ జగత్తు రూపుదిద్దుకున్న విధానాన్నే వివరించారు. అంటే మిశ్రమం, సాంకర్యం ప్రకృతి సిద్ధమే.

సాంకర్యం ప్రకృతిలోని వాస్తవం అన్న ప్రకటన ప్రత్యేకతల్ని అభావం చెయ్యదు.

సారాంశం యేమిటంటే - సాంకర్యమూ వాస్తవమే. ప్రత్యేకతలూ వాస్తవమే.

సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి అని భూసురులు ప్రతినిత్యం ఉచ్చరించే మంత్రం అనంతకోటి దేవతలని అదృశ్యం చెయ్యదు.

పైగా సర్వాంతర్యామియే యీ సూక్ష్మస్థూల బ్రహ్మాండాలుగా బహుళంగా గోచరిస్తున్నాడన్న సత్యాన్నే బలపరుస్తుంది.

అలాగే సాంకర్యం ప్రకృతిసిద్ధమైన ప్రత్యేకతల్ని సర్వాత్మనా తెరవెనక్కి నెట్టి వెయ్యదు. సమానత్వం యింత వైవిధ్యంతో కూడిన రంగులనీ, కులాలనీ ఏకత్వంలో లయం చేసే దౌర్జన్యానికి దిగదు. అది యీశ్వరేచ్ఛ కాదు.

నిజమే కులం అనేది చారిత్రక నిర్మాణం, సాంస్కృతిక నిర్మాణం. అది వ్యావహారిక సత్తాయే. అది పారమార్థికం కాదని మునులే చెప్పారు. కాని వ్యావహారిక సత్తా కూడా సత్తాయే అంటే అది కూడా ఉనికిలో వున్నదే. స్థలకాల పరిమితుల్లోనైనా కులం ఉనికి వాస్తవమే.

విశ్వం అనంతం కాని సంఖ్యలు కూడా సత్యమే భూమి తిరుగుతోంది కాని నిలకడగా వుందన్న దైనందినిక అనుభవమూ వాస్తవమే మనుషులంతా వొకటే కాని కులాలూ జాతులూ వాస్తవమే.

సాంకర్యం గురించి పంచమ వేదాలైన పురాణాలే బహిరంగంగా చాటాయి. సాంకర్యం లేని స్వచ్ఛఅస్తిత్వం ప్రకృతిలోనేలేదు. వశిష్ఠుడు గణికా గర్భసంభూతుడని పురాణాలు వర్ణించాయి. ఆయన భార్య మాదిగ ఆడపడచు అని సనాతన గ్రంథాలే చాటాయి. యింకా తెలుసుకోవాలనుకొంటే - ఉప్పులూరి గణపతిశాస్త్రిగారి వేదసార రత్నావళి గ్రంథాన్ని శ్రద్ధగా పరికించండి. పరశురాముడు దేశములో బ్రాహ్మణ వర్ణం క్షీణదశకురాగా, వైవర్తులకు - బెస్త వారికి యజ్ఞోపవీతధారణ చేయించాడు. వారిని బ్రాహ్మణులుగా మార్చాడు. యిది స్కాంద పురాణంలోని సహ్యాద్రి ఖండంలో వుంది. అసలు యీ కులాలే కాదు శక మ్లేచ్ఛ యవనుల పుట్టుక గురించి కూడా పురాణాల్లో వుంది. వారిని కూడా స్థానిక కులాలుగానే పురాణాలు చెప్తున్నాయి. మేచ్ఛులు, ప్రచేతసుడు అనే క్షత్రియుని సంతతి అని భారతం.

అలాగే వశిష్ఠ హోమధేనువునుంచే యిట్టి జాతులు జన్మించాయని మహాభారతం ఆదిపర్వంలో వుంది. పండితులైన మేచ్ఛులనీ యువనులనీ, రుషుల వలె పూజించాలని బృహత్ సంహిత అనే గ్రంథం బోధిస్తుంది.

వొక కులం మరొక కులం గానూ, మరొక జాతిగానూ మారినట్లు భారత, భాగవత, విష్ణు పురాణాలు వర్ణించాయి. యెక్కడెక్కడినుంచో వేదభూమికి తరలివచ్చిన జాతులన్నిటినీ కులవ్యవస్థ ఆప్యాయంగా తనలో పొదవుకుంది. వాటి ప్రత్యేకతల్నీ ఆచార వ్యవహారాల్నీ కూడా స్వీకరించింది. వారి జ్ఞానాన్నీ స్వీకరించి గౌరవించింది. బహుళత్వానికి ఆదరణ కులవ్యవస్థ వల్లనే సాధ్యమైంది. అది మత హింసని నివారించింది. జ్ఞాన వికాసానికి తోడ్పడింది.

ప్రత్యేకతలూ సరిహద్దులూ జ్ఞానానికి అవరోధం అంటారు కొందరు మేధావులు. కాని అది పూర్తిగా తప్పు. ప్రత్యేకతల వల్లే శాస్త్రాలు వర్ధిల్లుతాయి. సృజనాత్మకత రెక్కలు విప్పుకుంటుంది. కులప్రత్యేకతలు వైవిధ్యాన్ని పెంచి, సృజనాత్మకతకు ద్వారాలు తెరుస్తాయి.

భారతదేశంలో కులవ్యవస్థే సకల శాస్త్రాలకీ కళలకీ పురాణాలకీ పుట్టినిల్లు.

## సహజవికాసమే వైదికం

వొక ప్రత్యేకమైన ప్రదేశంలో వొక మొక్క పుడ్తుంది. పెరుగుతుంది. వికసిస్తుంది. అదే మొక్కని వేరే ప్రాంతంలో వేరే వాతావరణంలో నాటితే నశిస్తుంది. జంతువులూ అంతే.

మనిషి ప్రత్యేకతలకి అతీతుడు కాదు. సంస్కృతీ ధర్మమూ అతని ప్రత్యేకతలు. మానవులందరూ వొకటి కాదు. సంస్కృతులన్నీ వొకటి కాదు. అవి అనంతం అనేకం. ఆ ప్రత్యేకతల్ని మైనస్ చేస్తే మనిషీ లేడు అతని జ్ఞానమూ లేదు.

బౌద్ధం అనేది వ్యాపారంతో పాటు యెదిగింది. అందుకే అది ప్రపంచీకరణ మార్గం. దానిలో ప్రత్యేకతలకి స్థానం లేదు. అందువల్లనే బౌద్ధుల కాలంలో తర్కం ఎదిగినంతగా మరేదీ యెదగలేదు.

వైవిధ్యభరితమైనవి అన్నీ వైదిక సంస్కృతి నుంచే ఆవిర్భవించాయి. ప్రకృతిని వ్యాఖ్యానించే విజ్ఞానం, ప్రకృతిని అద్భుత కల్పనలతో ఆవిష్కరించే పురాణాలూ కావ్యాలూ వైదిక సంస్కృతి నుంచే ఉద్భవించాయి.

దీని నుంచి మనం నేర్చుకోవాలసినది యేమిటంటే భారతదేశం నిలవాలంటే విదేశీభక్తిని విడనాడాలి. తనకు తానుగా యెదగాలి. తనదైన తత్వంతో యెదగాలి. ప్రపంచీకరణని యెదిరించాలి. అందుకు వైదిక ఆత్మజ్ఞానమే శరణ్యం.

## ప్రత్యేకతల్లోనే అనంత వైశాల్యం

యెప్పుడైనా చిన్ని ప్రపంచంలోనే విశాలబుద్ధి వికసిస్తుంది. విశాల ప్రపంచంలో విహరించే వాడికి, విశ్వాన్ని చుట్టి వచ్చేవాడికి ఊహలు సంకుచితమైపోయే ప్రమాదం ఉంది. స్థల కాలాల్లో విస్తృతి యెప్పుడూ పరిమితమే. హృదయ వైశాల్యమే వైశాల్యం.

అందుకే గొప్ప టెలిస్కోపు కంటె కవి హృదయమూ గణిత సమీకరణలే విశ్వంలో చాలా దూరాల్ని అధిగమించగలవు.

అలాగే పైపై చూపులకి సంకుచితంగా కనబడే ప్రత్యేకతల్లోనే అనంతవైశాల్యం దాగివుంది. భారతీయ బహుళత్వ భావనలోనే అనంత బ్రహ్మాండాలు దాగివున్నాయి. అంతులేని కులాలు, అనంత కులదేవతలు విస్తరించి అనంత బ్రహ్మాండాలకి దారులు తెరిచారు, భరతఖండంలో.

భారతీయ తత్వశాస్త్రంలో వేదపురాణాల్లో అనంతం అనే భావన సర్వే సర్వత్రా కనబడ్తుంది. చాలా శతాబ్దాల క్రితమే అనంతం భారతీయ గణితంలో ఆవిష్కరించబడింది. అది అరబ్బుల ద్వారా సున్నాతో పాటు పాశ్చాత్యదేశాల్లోకి అడుగుపెట్టింది. సరే దేవీభాగవతం, శ్రీమద్భాగవతం యిత్యాది మహాపురాణాలు బ్రహ్మాండాలు అనంతమైనవి, లెక్కించరానివి అని పదేపదే స్పష్టం చేశాయి. దేవీ పురాణమైతే కల్పనాజగత్తులో మరింత ముందుకు వెళ్ళి అనంత బ్రహ్మాండాలే కాదు. ప్రతి బ్రహ్మాండానికి బ్రహ్మ విష్ణుమహేశ్వరులు వేరువేరుగా వున్నారు. వారు కూడా అనంతంగా వున్నారని నిర్ధారించింది ఈ విధంగా. దేవతలూ అనంతమైన వారేనని స్పష్టం చేసింది.

అనంతం అనంతం అనంతం యిదీ భారతీయ తత్వం.

యింకా స్పష్టంగా చెప్పాలంటే అనాది అనంతం వేదసారం.

కులాలు అనంతాలు, కులదేవతలు అనంతాలు, బ్రహ్మాండాలు అనంతాలు బ్రహ్మలు అనంతాలు అంటే బహుళాలని అర్థం.

శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగంలో తన అనంత రూపతత్వాన్ని బోధించాడు.

నానా విధాని దివ్యాని

నానా వర్ణ ఆకృతీని చ,

పశ్య మే పార్థ రూపాణి

శతశోథ సహస్రశః

శ్రీకృష్ణ పరమాత్మ తన స్వరూపంగా వర్ణిస్తున్న బహుళవర్ణాలు, ఆకారాలు, రూపాలు నిజానికి మనవే. అహం బ్రహ్మ అస్మి అని కదా భారతీయ తత్వం. అందుకే భారతీయ విశ్వరూపాన్ని యిలా దర్శింపజేస్తోంది కూర్మపురాణం.

భారతేతు స్త్రియః పుంసః

నానా వర్ణాః ప్రకీర్తితాః

నానా దేవార్చనే యుక్తాః

నానా కర్మాణి కుర్వతే.

భారతదేశంలోని స్త్రీ పురుషులు బహుళ వర్ణములు, బహుళ దేవతలు, బహుళ వృత్తులు కలవారని కూర్మపురాణ బోధ.

సరిగ్గా యిదే సత్యాన్ని శివాజీగురువు సమర్ధ రామదాసు దాసబోధఅనే మరాఠీ గ్రంథంలో పునర్వచించారు.

నానా ధ్యానే నానా మూర్తీం

నానా ప్రతాప్ నానాకీర్తీ

తయాపుడేఁ నరస్తుతీ

పృణతుల్యవాటే

బహుళమైన యీశ్వరధ్యానాల్నీ, బహుళరూపాల్నీ, బహువిధమైన ప్రతాపాల్నీ ఆవిష్కరించే ప్రసాదకవిత్వం. అదే ఉత్తమ కవిత్వం.

జగత్తుకాని జగదీశ్వరుడు కాని అనంతమైన బహుళత్వం తో కూడుకొని వున్నారు. సహస్రనామాలు అంటే యేమిటి? సహస్ర శబ్దం అనంత వాచకం. అనంత నామరూపాలన్నమాట.

యీ రూపాలన్నీ పరిపూర్ణమైనవే. వొక రూపం కన్న మరొక రూపం గొప్పదని కాని, న్యూనమని కాని చెప్పలేం. అనంతంలో బిందువు వుండదు. కేంద్రం వుండదు. కేంద్రీకరణకి ఆస్కారం లేదు. కనుక సాపేక్ష దృష్టికి ఆస్కారం లేదు.

**ప్రతీ అణువులోనూ బ్రహ్మాండం వుంది.**

**ప్రతీ రూపంలోనూ పరమాత్మ వున్నాడు.**

కనుక ఎద్దులబండి కన్న రాకెట్టు గొప్పదని చెప్పలేం. వేగవంతమని చెప్పలేం. రెండూ రెండు రూపాలు అంతే.

జంతువు కన్న మనిషి వున్నతుడని చెప్పలేం. రెండూ పరమాత్ముని యొక్క రెండు రూపాలు.

అందుకే పురాణాల్లో భగవంతుని జంతురూపంలోనూ, మానవరూపంలోనూ, రెండింటి సంకర రూపంలోనూ కూడా ఆవిష్కరించారు. యీ బహుళ రూపాలే నిత్యనూతనాలు. యే రూపమూ ప్రామాణికం కాదు. కేంద్రం కాదు. దేనికదే పరిపూర్ణం.

అందుకే ప్రగతి కాని, అభివృద్ధి కాని లేవు. బహుళత్వం మాత్రమే సత్యం.

అభివృద్ధి భావనలో హెచ్చుతగ్గులు అనివార్యం. అభివృద్ధి చెందిన రూపం అభివృద్ధి చెందని రూపం వుంటాయి. అలాగే సమాజం విషయానికి వస్తే - అభివృద్ధి చెందిన సమాజం, అభివృద్ధి చెందని సమాజం (అనగా వెనుకబడిన సమాజం) అనే విభజన ప్రారంభమౌతుంది. యూరప్ అభివృద్ధి చెందిన సమాజమైతే, ఆఫ్రికా చాలా వెనుకబడిన సమాజం. యీ విభజనలు ఆధునిక కాలంలో చాలా హింసకి దారితీశాయి. హెగెల్ యీ పరిణామ తర్కాన్నే ఆశ్రయించి న్యూనస్థితిలో వున్న ఆఫ్రికన్లకి బానిసత్వం తప్పదన్నాడు. అది అభివృద్ధిలో వొక దశ అన్నాడు. క్రైస్తవులు మన సమాజాన్ని కూడా తమతో పోల్చుకొని, నీచస్థితిలో వున్నదిగా వర్గీకరించారు. దాన్ని తామే ఉద్ధరించాలన్నారు.

భారతీయతత్వంలో పరిణామవాదం వుంది. కాని అది పాశ్చాత్య పరిణామం వంటిది కాదు. పాశ్చాత్య పరిణామవాదం నీచ రూపాల నుంచి ఉన్నతరూపాలకి అభివృద్ధి సాగుతుందని, దీనితో రూపం మెరుగు పడ్తుందని అంటుంది. యీ వాదానికి మూలం అరిస్టాటిల్‌లోనే ఉంది. కాని భారతీయుల అన్ని రూపాలూ పరిపూర్ణమైనవే

నంటారు. యీ అనంత విశ్వంలో అనంత రూపాలలో ప్రతిరూపానికి దాని ప్రత్యేకత వుంది. దాని స్థానం దానికి వుంది. కనుక నీచ ఉన్నత భేదాలు తాత్వికమైనవి కావు. అవి వ్యవహారంలోనివి మాత్రమే. భేద దృష్టి వల్ల జనించినవే.

మరి పరిణామం అంటే యేమిటి? పరిణామం అవ్యక్తం నుంచి వ్యక్తం, సూక్ష్మం నుంచి స్థూలం ఆవిష్కృతం కావడమే. యీ క్రమం విలోమ పద్ధతిలో కూడా సాగుతుంది. అంటే స్థూలం నుంచి సూక్ష్మం, వ్యక్తం నుంచి అవ్యక్తం ఆవిష్కృతమౌతుంది. అందువల్లనే జీవుడు తన సూక్ష్మస్థితియైన ఆత్మతత్వాన్ని చేరుకోగలడు.

అందువల్ల సూక్ష్మ స్థూలాలైన అనంత రూపాలు – అణువు నుంచి బ్రహ్మాండం దాకా స్వయం పరిపూర్ణమైనవి.

పూర్ణమిదః పూర్ణమిదం అనే ఉపనిషత్ తత్వాన్ని అవగతం చేసుకుంటే, భారతీయులకి న్యూనతా భావం నశిస్తుంది.

దేనికదే పరిపూర్ణంగా విలసిల్లే అనంతరూపాలో, యీ బ్రహ్మాండమంతా భాసిస్తోంది. అదే సత్యం. అదే క్రైస్తవ సామ్రాజ్య వాదానికి సరైన సమాధానం.

## కూపస్థ మండూక లేఖనాలు

వొక నూతిలోని కప్ప తాను పాకగలిగినంత మేరే విశ్వమంది. అందువల్ల తన కాళ్ళతో మొత్తం విశ్వాన్ని కొలిచి, యీ బ్రహ్మాండం మొత్తం యెన్ని అంగుళాలు నిడివి వుందో చెప్పేస్తానంది. చివరికి బావినీ, దానిలో మండూకమనబడే తననీ సృష్టించిన దేవుడు యెక్కడ వుంటాడో తేల్చేస్తానని ప్రగల్భాలు పలికింది.

యింతకీ యీ కూపస్థ మండూకానికి సృష్టికర్తయైన దేవుడు యెక్కడ వుంటాడు? యింకెక్కడ? కనబడనివాడే దేవుడు కనుక బావి అంచుకి అవతల వుంటాడని విశ్వరహస్యాన్ని బోధించింది కప్ప.

క్రైస్తవుల విశ్వ నమూనా సరిగ్గా యిదే. అందుకే యీ విశ్వం అనంతం అని చెప్పినందుకు, అసలు అనంతం అనే పదం వుచ్చరించినందుకు క్రైస్తవులు బ్రూనో అనే శాస్త్రజ్ఞుడిని సజీవ దహనం చేశారు 16వ శతాబ్దంలో.

క్రైస్తవులకి అనంతం అనే పదం అస్సలు గిట్టదు. భారతదేశంలోనైతే శిశువు కూడా ఆ పదాన్ని ఉచ్చరిస్తాడు.

కారణం ఏమిటి? సృష్టికర్తని అంగీకరిస్తే ఆ సృష్టికి కాలంలోనే కాదు స్థలంలో కూడా పరిమితులు వుంటాయి.

అలాగే ఆ సృష్టిని చేసిన యింజనీరుకి కూడా ప్రత్యేక స్థలం అవసరం. అదే పరలోకం. ఆ పరలోకానికి కూడా ప్రత్యేక స్థలం కావాలి. అంటే సృష్టికి హద్దులు వుండాలి. సరిహద్దులు వుండాలి. అందుకే టోలమీ నమూనా అనే గ్రీకుల విశ్వనమూనాని క్రైస్తవులు స్వీకరించారు. దీని ప్రకారం భూమే విశ్వానికి కేంద్రం. పైగా విశ్వం పరిమితం చాలా పరిమితం. యెంత పరిమితం అంటే చాలా వేగంగా వెళ్ళగలిగితే విశ్వాన్ని వొక రోజులో చుట్టుముట్టి రావచ్చునన్నాడు (డివైన్ కామెడీలో) ఇటలీకవి డాంటే. ఇంతకీ యీ విశ్వం పుట్టింది కూడా మొన్న మొన్ననే కొన్ని వేల సంవత్సరాల క్రితం అంతే.

అంటే బహుళత్వం శూన్యం. విశ్వం చాలా పరిమితం.

యీనాడు క్రైస్తవులు బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతాన్ని సమర్థిస్తున్నారు. దానిలో బైబిల్ సృష్టి సిద్ధాంతం వుందంటున్నారు. నిజమే బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతంలో సృష్టికాలం చాలా వెనక్కి జరిగింది. కాని సృష్టికి ఆద్యంతాలు వున్నాయన్న క్రైస్తవ భావన పదిలంగానే వుంది. అంటే సృష్టికర్తకి స్థానం వుంది. స్థలంలో కూడా విశ్వం పరిమితమనే ఆలోచనకే యీ సిద్ధాంతం ఆస్కారమిస్తోంది.

యీ క్రైస్తవ వైజ్ఞానిక సిద్ధాంతాల మీద నాకు ఆసక్తి తక్కువ. కనుక యీ వివరణ చాలు. కాని మానవదృష్టి పరిమితం. సాధనాల వల్ల అతడు దూరాల్ని అధిగమించవచ్చు కాని అది కూడా చాలా పరిమితమే.

విశ్వమేమో అనంతం, క్రైస్తవుడు కూపాన్ని కొంచెం పెద్దదిగా చేస్తున్నాడు కాని, బావిని కూలగొట్టడం లేదు. భారతీయులు మొదట్లోనే చేసిందదే. సంకుచిత దృష్టిని తుంచివేయడం, అంతర్ముఖులు కావడం.

యీ బాహిరదృష్టికన్న లోచూపు గొప్పదని రుషులు గ్రహించారు. సృష్టికర్తనే నిరాకరించారు. సృష్టి అనాది అనంతం అన్నారు. కర్త లేదు అన్నారు. వేదాలకి కర్త లేదు. అలాగే ప్రకృతికీ లేదన్నారు.

యింకా ముందుకు పోయి అసలు కర్త అన్నవాడే లేడు పొమ్మన్నారు. మరి భాషలో కూడా కర్త లేదా అని నిలదీస్తే, యెక్కడా కర్తలేదు కర్తే మిధ్య అన్నాడు. క్రియా విశేషణంగా తప్ప కర్తకి ఉనికి లేదు. క్రియ సత్యం, కర్త మిధ్య అన్నారు

మీమాంసకులు. వైయాకరణులు తక్కువ తిన్నారా కర్త, కర్మ, క్రియ అనే విభాగమే లేదు. మొత్తంగా వాక్యమే అర్ధద్యోతకం, పరిపూర్ణ వాక్యమే సత్యం అన్నారు వేదాంత దృష్టితో. అదే స్ఫోటవాదం.

యింతకీ వేదాలని గురించి తెలుసుకొంటే అన్నీ తెలుస్తాయి. వేద జ్ఞానమే జ్ఞానం. సైన్సూ పిండాకూడూ మన కెందుకు క్రైస్తవులకి కాని. వేదాలు అపౌరుషేయాలు కర్తలేనివి అని అర్థం. అందుకే అనంతావై వేదాః అన్నారు. అనాది – అనంతములైనవే వేదములు. యీ బ్రహ్మాండ గోళాలన్నీ వేద మూలకాలే కదా అవీ అనంతములే అని తాత్పర్యం. యీ వేద సారాన్నే మన గణితశాస్త్రజ్ఞులూ బోధించారు. అనంతం, అనంతం అని పలవరించారు.

కాని వికాస వాద యుగం అని పిలిచే ఆధునికకాలం వరకు క్రైస్తవ గణిత శాస్త్రజ్ఞులు అనంతం అనే పదాన్నే అంగీకరించలేదు. అలాగే గణిత శాస్త్రంలో సర్వాత్మనా అనంతమును నిరాకరించారు. గ్రీకులు అనంతానికి పరిమితులు ఏర్పరచడానికి ప్రయత్నిస్తూ వచ్చారు. అంటే ప్రతి అంకెకీ వొకటి అనే సంఖ్యని కలపడం ద్వారా అనంతంగా సంఖ్యలు ఏర్పడ్తాయి. అంతేకాని యథార్థముగా అనంత సంఖ్యలంటూ యేమీ లేవు. సంఖ్య అంటేనే పరిమితమైనది అని గ్రీకులు భావించారు. గ్రీకు తాత్వికుడు అరిస్టాటిల్ తాత్వికంగా అనంతము అనే భావనని వ్యతిరేకించాడు. పదార్ధమునకు పరిమితి, హద్దు వున్నప్పుడే రూపము యేర్పడ్తుంది. లేకపోతే రూపం యేర్పడడం అసాధ్యం. అందువల్ల అనంతం అనేదేమీ లేదు అని సర్వాత్మనా తిరస్కరించాడు. క్రైస్తవులైతే అనంతం అన్న పదాన్ని వుచ్చరించిన శాస్త్రజ్ఞులను సజీవ దహనంచేశారు. కారణం అది సృష్టికర్తయైన దేవుని వునికిని రద్దు చేస్తుంది అని భయపడ్డారు. చాలాకాలం క్రైస్తవ శాస్త్రజ్ఞులు అనంతాన్ని అంగీకరించలేదు. తప్పని పరిస్థితుల్లో ప్రాగ్మాటిక్‌గా అంగీకరించారు. అవసరార్ధమైన కల్పన (యూజ్‌ఫుల్ ఫిక్షన్) గా స్వీకరించారు. చివరికి ఆధునిక కాలంలో పరిశోధనల ఫలితంగా భౌతికశాస్త్రంలోనూ, గణితంలోనూ కూడా అనంతమును పరమ యధార్ధంగా అంగీకరించక తప్పలేదు. కాని యీనాటికీ క్రైస్తవులు యీ భావనని తిరస్కరించడానికి కృషి చేస్తూనే వున్నారు.

క్రైస్తవ థియాలజీలో సరే, సైన్సులో కూడా అనంతం అనే భావనని రద్దు చేయడానికి తీవ్రమైన కృషి జరుగుతూనే ఉంది. దానికి క్రైస్తవ దృక్పథమే ప్రేరణ.

భారతీయ దృష్టిలో సంఖ్యాతత్వం బుద్ధి గోచరం కాదు. అది సూక్ష్మాతి సూక్ష్మం. సంఖ్యకు సంబంధించిన తత్వం సాంఖ్యదర్శనం వల్లనే బలపడింది. (సంఖ్యాతత్వ విచారణ చేయుట వల్ల సాంఖ్యమని పేరు వచ్చింది) సాంఖ్యదర్శన కాలంనుంచి, యింకా చెప్పాలంటే అనాదికాలం నుంచి భారతీయులు సూక్ష్మం నుంచి స్థూలం వచ్చిందని భావించారు. యిది సున్నాని కనుగొనడానికి, సున్నాతో సంఖ్యలు మొదలవుతాయన్న ఆవిష్కరణకి దారితీసింది. ఆది సంఖ్య సున్నా. అది అనిర్వచనీయం. సూక్ష్మం.

అంటే సంఖ్యాతత్వం అనిర్వచనీయమన్న మాట. అందుకే సనాతనులు సంఖ్యా పరమైన ఆధిక్యానికీ, విస్తృతికీ ప్రాధాన్యం ఇవ్వలేదు. యెంతమంది సనాతన ధర్మాన్ని అనుసరిస్తున్నారనే గణన అనవసరం. సారం ముఖ్యం అన్నారు శృంగేరీ శంకరాచార్య చంద్రశేఖర భారతి. హిందూవాదులు మతపరమైన జనాభా లెక్కలకు మత విస్తరణకు ప్రాధాన్యం యిస్తున్నారు. యిది క్రైస్తవ దృష్టి మాత్రమే.

అసలు మతపరమైన జనాభా లెక్కల్ని వలస క్రైస్తవులే ప్రారంభించారు. వలస క్రైస్తవులు మొదటిసారిగా 1881లో భారతదేశ జనాభా లెక్కలు తీశారు. అప్పుడు హిందువులు అనే పేరుతో కూడా మతపరమైన గణాంకాలు సేకరించారు.

ఆనాటినుంచి సనాతన దృక్పథం నశించి, పరిమితమూ సంకుచితమైన క్రైస్తవ గణన పద్ధతి మన బుర్రలలోకి ప్రవేశించింది. హిందువుల సంఖ్య పెరగాలనే వాదం బలపడింది. అందువల్ల గుంపుతత్వం బలపడింది.

దీనికీ సనాతన ధర్మానికీ, సంబంధం లేదు. క్రైస్తవం ప్రకారం సర్వం పరిమితం, గణనీయం, సంకుచితం.

సనాతన ధర్మం ప్రకారం ధర్మం విశ్వవ్యాప్తం. సూక్ష్మం, అనంతం, అనిర్వచనీయం. సనాతన గణితమూ అంతే.

నిజానికి అనంతం అనేదాన్ని సర్వాత్మనా అంగీకరిస్తే పాశ్చాత్య అభివృద్ధి నమూనాయే గాలికి పేలపిండిలా కొట్టుకుపోతుంది. అనంతాలైన సంభావ్యతలు తప్ప వొక ప్రామాణిక నమూనా సాధ్యం కాదు. విశ్వానికి నమూనా అనేది నిలవదు.

ప్రకృతి అనంతం అనే సత్యాన్ని అంగీకరిస్తే, ప్రామాణిక గ్రంథం, మతం, దేవుడు, అభివృద్ధి, విజ్ఞానం యిలా అన్ని పదాలని విడనాడవలసి వుంటుంది.

సత్యం యొక్క అనంత వ్యాఖ్యానాలకి తలుపులు తెరవవలసి వుంటుంది. అదే వైదిక మార్గం.

## గణించలేనిదే గణితం- వచించలేనిదే తత్వం

గణించడాన్ని నిలిపివేసినప్పుడే గణితం ఆవిష్కృతమౌతుంది. వాక్కులు నిలిచిపోయినపుడే తత్వం అవగతమవుతుంది.

యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, వాక్కులు మనస్సుతో సహా వెళ్ళి అందుకోలేక తిరిగివచ్చిన స్థలకాలాతీతస్థితే తత్వం, బ్రహ్మ, పరమాత్మ.

అలాగే గణించడం కుదరని స్థలకాలాతీత స్థితే అనంతం అని పిలవబడ్తోంది. భాస్కరాచార్యులవారు బీజగణితంలో చెప్పినది యీ సత్యాన్నే. ఏ సంఖ్యనైనా శూన్యంతో భాగిస్తే వచ్చేది ఖహారం - అనంతం. ఈ అనంతం నుండి ఏదేని పరిమిత సంఖ్యను తీసివేసినను, కలిపినను దాని విలువ మారదు. అనంతం అనేది అనంతుడైన పరబ్రహ్మ వంటిది. బ్రహ్మ కూడా భూతసృష్టి వల్లగాని, లయము వల్ల గాని మార్పు చెందదు అంటారు భాస్కరాచార్యులవారు.

(అస్మిన్వికారః ఖహారే నరాశౌ.... అనంతే అచ్యుతే భూతగణేషు యద్వత్ - భాస్కరాచార్య విరచిత బీజగణితం)

ప్రముఖ గణితాచార్యులు భాస్కరాచార్యులవారు అనంతం అనే పదానికి పర్యాయపదంగా 'ఖహారం' అనే పదాన్ని ప్రత్యేకంగా ప్రయోగించడం గమనార్హం. ఖం అంటే ఆకాశం. అంటే యీ పదానికి ఆకాశపు గొలుసు అని అర్థం. ఆకాశం సరిహద్దులులేనిది. గొలుసు అనేది కొనసాగింపునీ, క్రమాన్నీ సూచిస్తుంది. ఖహారం అంటే తాత్పర్యమేమిటంటే - అనంతమైన అంకెల కొనసాగింపు.

ఇన్‌ఫినిట్ నెంబర్స్, ఇన్‌ఫినిట్ సెట్స్ ఆఫ్ నెంబర్స్ వంటి పదాలు పాఠశాల విద్యార్థులకి కూడా నేడు సుపరిచితాలే. కాని అనంతం అనే అర్థంలో ఖహారం అనే పదాన్ని ప్రాచీన గణితశాస్త్ర రుషులు యెందుకు వాడారు? ఆకాశపు విశిష్టత యేమిటి? ఆకాశానికి ప్రాచీన భారతీయ పండితులు యిచ్చిన స్థానం యేమిటి? అనంతం అనే పదాన్నే ప్రయోగించక ఖహారం అనే పదాన్ని భాస్కరాచార్యులవారు యెందువల్ల ప్రత్యేకంగా ప్రయోగించారు.

యీ జిజ్ఞాసకి సమాధానం దొరకాలంటే వైదికుల పంచభూత తత్వవిచారంలోకి అడుగుపెట్టాలి.

## పంచభూతాల కలనేత

ఈ సృష్టిని పాంచభౌతికం అన్నారు సనాతనులు. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము యివే పంచభూతాలు. యీ పంచభూతాల కలయిక వల్లే యింత వైవిధ్యభరితమైన జగత్తు ఏర్పడిందన్నారు.

ఈ పంచభూతాలలో వొకదానికంటే మరొకటి సూక్ష్మమైనది. అన్నిటికంటె సూక్ష్మమైనది ఆకాశం.

ఆకాశానికి వైదికతత్వంలో చాలా ప్రాధాన్యం వుంది. సూక్ష్మం నుంచి స్థూలజగత్తు ఆవిర్భవించిందన్నారు. అంటే సూక్ష్మాతి సూక్ష్మమైన ఆకాశమే అన్ని భూతముల కంటే ప్రాథమికమైనది. అందుకే సూత సంహితాసారం ప్రళయాన్ని వర్ణిస్తూ, ప్రళయకాలంలో ప్రతిభూతమూ తనకంటె సూక్ష్మమైన భూతంలో లయిస్తుందని వర్ణించింది. చిట్టచివరిగా నాలుగు భూతాలూ లయించేది ఆకాశంలోనని చెప్పింది. అంటే విలయం లేని సూక్ష్మస్థితి ఆకాశమన్నమాట. అందుకే పరమాత్మని ఆకాశ శరీరుడన్నారు. చిదాకాశం అన్నారు.

మరి ఆకాశం కూడా భూతమైతే పదార్థమైతే దానికీ గుణం వుండాలి కదా? దాని గుణం యేమిటి? శబ్ద గుణక మాకాశం. అంటే ఆకాశం యొక్క గుణం శబ్దం. శబ్దమే లేకపోతే ప్రకృతి అంధకారమయిపోతుంది అంటారు మీమాంసకులు. అలాగే అంటారు వైయాకరణులు. వాక్యపదీయం చూడండి, తెలుస్తుంది. అందువల్ల శబ్ద ప్రమాణాన్ని అన్ని ప్రమాణాల కంటే గొప్పదిగా వైదికులు భావిస్తారని స్పష్టమౌతోంది.

శబ్దమంటే శృతి అని అర్థం. శృతి అంటే వేదమని రూఢ్యర్థం. శృతి అంటే వినబడేది అని యౌగికార్థం. శబ్దానికి వాహిక ఆకాశం. ఆకాశం ద్వారా మాత్రమే శబ్దం ప్రసరిస్తుంది. శృతియే సకలశాస్త్రాలకి మూలం. శబ్దమే సకల శాస్త్రాలకి మూలం. అసలు వాఙ్మయానికంతటికీ మూలం శబ్దమే. విశ్వానికీ మూలం యిదే అంటున్నారు మీమాంసకులూ, శబ్ద బ్రహ్మవాదులు వైయాకరణులూ. అట్టి శబ్దాన్ని ప్రసరింపజేస్తున్న ఆకాశం యొక్క విశిష్టతని వేరే చెప్పనక్కరలేదు.

ఆకాశం అంటే వట్టి ఖాళీ కాదు సరికదా అన్ని భూతముల కంటె విశిష్టమైన అస్తిత్వం ఆకాశానికి వుంది. అందుకే ఆకాశాన్ని ప్రత్యక్ష ప్రమాణ సిద్ధమైనదిగా వ్యాఖ్యానించారు భాట్టులు. వీరు మీమాంసకులలో వొక శాఖ. దీనికి కారణమేమిటి?

ఆకాశం దైనందిన అనుభవంలోకి ప్రతినిత్యం వస్తున్నదే. శబ్దరూపంగా తన వునికిని ప్రతి క్షణం చాటుకుంటోంది ఖం - ఆకాశం.

ఐతే ఆకాశం సూక్ష్మమైనది, సర్వవ్యాప్తమైనది. సర్వాధారమైనది. ఆకాశం శబ్దానికి ఆధారం అనడంలో విశ్వానికి ఆధారమనే వైదికుల దృష్టి స్పష్టమౌతుంది. యిదే గణిత శాస్త్రవేత్తలు అనంతానికి పర్యాయపదంగా ఖహారం అనే పదాన్ని వాడడంలోని పరమార్థం.

## ఆకాశం లేని బౌద్ధులు

సరేకాని అసలు ఆకాశాన్ని వట్టి ఖాళీ అని దాని వునికినే పూర్తిగా నిరాకరిస్తే యేమౌతుంది? అలా భారతీయ తాత్వికులెవరైనా చేశారా? చేశారు. వారే బౌద్ధులు. బౌద్ధులు 'చత్తారి భూతాని' అన్నారు. అంటే నాలుగే భూతములు అన్నారు. సూక్ష్మాతి సూక్ష్మమైన ఆకాశం యొక్క ఉనికినే నిరాకరించారు. దీని వెనక గల తత్వం యేమిటో మనం విచారించాలి.

బౌద్ధుల మౌలిక తత్వం అసత్ వాదం. అంటే ఉనికినే నిరాకరించడం. అనాత్మవాదం యొక్క సారమిదే. ప్రకృతికి స్వత్వం లేదు,. ఉనికి లేదు. దేని ఉనికినైనా మరొక దాని యొక్క సాపేక్షతతోనే నిరూపించగలం. అంటే దేనికీ స్వభావం లేదు.

వస్తుతత్వాన్ని పూర్తిగా తిరస్కరించి, వస్తువే లేని పరివర్తనని బోధించింది బౌద్ధం. అందుకే వస్తు జాలం యెలా యేర్పడింది? యీ వస్తువుల నామరూపాల విశిష్టత యేమిటి? అసలు యీ పాదార్థిక జగత్తు పరిణమించడంలోని అంతస్సూత్రమేమిటి? అనే ప్రశ్నలకి బౌద్ధంలో అవకాశం లేదు.

జగత్తు అనే భావననే బౌద్ధం తిరస్కరించింది. కదలిక తప్ప వట్టి కదలిక తప్ప- దాని వెనుక కదిలే వస్తువేదీ లేదు. యీ తర్కంలోని మంచిచెడులు, ఉచితానుచితాల సంగతి యిప్పుడు మనకి అనవసరం. కాని యీ తర్కం ద్వారా జగత్తుని వ్యాఖ్యానించడానికి ఆస్కారమే లేదు. జగత్తుని నిర్వచించే శాస్త్రాల ఆవిర్భావానికి జీవధాతువు బౌద్ధతర్కంలో లోపించింది.

బౌద్ధం అసలైన నాస్తికవాదంగా ముందుకు వచ్చింది. నాస్తిక వాదం అంటే దేవుడు లేడని అర్థం కాదు. భారతీయతత్వ శాస్త్రంలో దైవానికి ప్రాధాన్యం లేదు.

అది వేరే సంగతి. అసలు బౌద్ధం నాస్తికవాదం యెందుకైందంటే అస్తిత్వం (ఉనికి) అనే పదానికి అర్థమే లేదంది బౌద్ధం. యిట్టి తాత్విక శాఖ భారతదేశంలో మరొకటి కనబడదు. (అస్తిత్వాన్ని బలపరచే కమ్యూనిజం ఆస్తిక మతమే)

కాని నాస్తికవాదం నుంచి శాస్త్రాల ఆవిర్భావానికి అవకాశం లేదు. సృష్టి బోధకములైన పురాణములకు అసలు ఆస్కారం లేదు. యెందుకంటే – ఉనికి అనే పునాది పైనే శాస్త్రం పుట్టుంది. నఅసతో విద్యతే భావః అసత్తు నుంచి యేదీ పుట్టదు. (గీత)

యీ అసత్ వాదం యొక్క ఆవశ్యక పరిణామమే ఆకాశభూత నిరాకరణ. శబ్ద ప్రమాణాన్ని తిరస్కరించింది బౌద్ధం. శబ్దగుణకమైన ఆకాశాన్నీ పక్కకు నెట్టింది, దాని శూన్యవాదం ఖాళీని మాత్రమే మిగిల్చింది.

భారతీయ ప్రాపంచిక దృక్పథం ప్రకారం శబ్ద ప్రామాణికతని తిరస్కరించడ మంటే, ప్రపంచపు ఉనికినే తిరస్కరించడమన్నమాట. యెందుకంటే పదమూ, పదార్థమూ అర్ధనారీశ్వరుని వలె విడదీయరానివని భారతీయతత్వం. రెండూ వొకటేనన్నమాట. అందుకే పదార్థం అనే శబ్దం జనించింది. వాక్యపదీయం శబ్ద అర్థములకు అద్వైతస్థితినే బోధించింది.

శబ్దపు ప్రామాణికతను తిరస్కరించి, శబ్దగుణకమైన ఆకాశానికి భూతతత్వాన్ని నిరాకరించి బౌద్ధులు పదార్ధ జగత్తునే నాస్తి అన్నారు. యీ తీవ్ర నాస్తికత్వం దుః ఖంగా పరిణమించింది. అసలు ప్రాణి అంటేనే దుఃఖం అన్నారు బౌద్ధులు. యిందుకు భిన్నంగా ఉపనిషత్ కారులు ఆనందానికి పెద్దపీట వేశారు.

బౌద్ధంలో ఉనికికి ఆస్కారమే లేదు. పైగా సర్వం దుఃఖమయం. యిట్టి నిరర్థక చలనం నుంచి యెటువంటి ప్రాపంచిక వ్యాఖ్యానం, యెటువంటి శాస్త్రం రూపుదిద్దుకుంటుంది.

దుఃఖభరితమైన అధఃపతనంతో కూడిన విశ్వచిత్రమే రూపుదిద్దుకుంటుంది. గోళగ్రంథంలో బౌద్ధుని వ్యాఖ్యానాన్ని చూడండి.

**ఖస్థం నదృష్టం గురు చ క్షమాతః**

**ఖే అధః ప్రయాతీతి వదంతి బౌద్ధాః**

బరువైన పదార్ధమేదైనా నిరాధారమైన శూన్యంలో నిశ్చలంగా నిలవదు. అది కిందికి పడిపోతుంది. అందువల్లనే భూమి కూడా శూన్యంలో నిరంతరం అధఃపతనం చెందుతూ పోతోంది. యిదీ బౌద్ధుల ఖగోళతర్కం.

సరిగ్గా యిదే తర్కాన్ని ఆశ్రయించి వైదిక ఖగోళవేత్తలు భూమికి ఆకర్షణశక్తి వుందని నిరూపించారు. ఖస్థం గురు స్వాభిముఖం స్వశక్త్యా. ఆకాశంలో వున్న బరువుగల పదార్థాలనన్నిటినీ తనవైపు బలంగా లాక్కునే ఆకర్షణ శక్తి భూమికి వుంది. అందుకే పదార్థాలు కిందికి పడుతున్నాయి. భూమి నిలకడగానే వుంది. వొకే దృశ్యం రెండు వ్యాఖ్యానాలు. వొకటి బౌద్ధం. రెండవది వైదికం, సనాతనం. బౌద్ధం దుఃఖమయ అధఃపతనాన్నీ, వైదికం ఆనందమయ ఆకర్షణనీ జగత్తుకి వ్యాఖ్యానాలుగా స్వీకరించాయి. వారి తాత్విక దృష్టిభేదమే దీనికి కారణం. (భూమిని నిలిపివుంచే విశ్వనియమం వుంది. అదే ఋతం అంటోంది వేదం)

## శృంగారమే సర్వశాస్త్ర మూలం -సంయోగమే విశ్వరహస్యం

ఆనందాన్నీ, ఆకర్షణనీ ప్రాపంచిక దృక్పథంగా స్వీకరించారు వైదికులు. దానికి కారణం స్త్రీ పురుష సంయోగాన్ని ప్రకృతికి అన్వయిస్తూ సృష్టిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడమే.

మానవజాతి కొనసాగడానికి సంయోగం మూలం అనేది ప్రత్యక్ష అనుభవసిద్ధమే. దీనినే విస్తృతార్థంలో చూసినపుడు ప్రకృతి – పురుష సంయోగం, భూమి ఆకాశాల సంయోగం. అణువుల సంయోగం, జీవాత్మ పరమాత్మ సంయోగం, పంచభూతాల సంయోగం... ఇత్యాదిగా సంయోగమనేది సర్వే సర్వత్రా భారతీయ తాత్విక ధోరణులలో స్పష్టమౌతుంది.

ఆధ్యాత్మికం, భౌతికం, దైవికం యీ మూడు దశల్లోనూ శృంగార ఆకర్షణని చూశారు వైదికులు.

ఆత్మ పరమాత్మలు, ప్రకృతి – పరమాత్మలు, (ప్రకృతి – పురుషులు)శక్తి ఈశ్వరులు వీరి మధ్య ఆకర్షణ వల్లే జగత్తు ఆవిర్భవిస్తోంది, ప్రవర్తిస్తోంది. యిది ఆధ్యాత్మిక ఆకర్షణ. అన్ని పురాణాల్లో దీనిని చూడవచ్చు.

ఖగోళంలో గ్రహ నక్షత్రాదుల మధ్య ఆకర్షణ వుంది. అవి అట్టి బంధంతోనే చలిస్తున్నాయి. అని విష్ణు పురాణంలో వర్ణించబడింది. ఈ ఆధ్యాత్మిక భౌతిక ఆకర్షణలకి

ఖగోళవేత్తలూ, పౌరాణికులూ వొకే విధమైన వుపమానాన్ని వాడారు. అదే లోహ అయస్కాంత ఆకర్షణ. యింక దైవికమైన ఆకర్షణని చంద్రతారా ప్రణయం, భూదేవి విష్ణువుల దాంపత్య బంధములలో చూడవచ్చు.

అలాగే భూమినీ, జగత్తునీ కూడా కదంబ, కమల పుష్పములతో పోల్చడం పురాణాల్లోనూ, ఖగోళ శాస్త్ర గ్రంథాల్లోనూ కనిపిస్తోంది. దేవిని కదంబవన వాసినీం అని స్తుతించారు. పుష్పములలో స్త్రీత్వాన్ని చూస్తారు. అలాగే పుష్పములు సూర్యకర స్పర్శ వల్ల వికసిస్తున్నట్లు కవి వర్ణన ప్రసిద్ధమే. అందువల్ల జగత్తుని (భూమిని) పుష్పముతో పోల్చడం వెనుక వొక గూఢార్థం వుంది. స్త్రీ ఆకర్షణ వంటిదే భౌతిక జగత్తులోనూ వుంది అని అంతరార్థం. యింతకీ భూమి స్త్రీదేవతే.

బ్రహ్మని పద్మాసన ఆసీనుడిగా పురాణాలు వర్ణించాయి. పద్మం అంటే జగత్తు. తామరతూడుకి ఆదిని బ్రహ్మ కూడా కనుక్కోలేక పోయాడని భాగవతం వర్ణించింది. అంటే జగత్తు అనంతం అని అర్థం.

మనిషి విషయంలో శృంగారానికి స్థూల శరీరమూ సూక్ష్మమైన యింద్రియ మనస్సుల సమన్వయం ప్రధానం. అలాగే ప్రకృతి విషయంలోనూ స్థూల సూక్ష్మాల సంయోగమే లోక ప్రవృత్తికి మార్గం.

మానవ అనుభవంలో లాగే స్థూల జగత్తు అస్తిత్వాన్ని నిర్ధారించడానికి సూక్ష్మం యొక్క అస్తిత్వాన్ని స్థాపించక తప్పదు.

భూమి వుందని నిరూపించడానికి ఆకాశం యొక్క సత్తా -ఉనికిని స్థాపించక తప్పదు. వాటి మధ్య సంయోగాన్ని నిరూపించక తప్పదు. ఘటాకాశం పటాకాశం వంటి పదాలు న్యాయశాస్త్రంలో విరివిగా దర్శనమిస్తాయి. కారణమేమిటంటే పదార్థాల స్థితికీ, వ్యాప్తికీ అవకాశమిచ్చేదే ఆకాశం.

అట్టి ఆకాశపు ఉనికినే బౌద్ధులు గుర్తించ నిరాకరించారు. అందువల్ల పదార్థ జగత్తు నిలవడానికి గల అవకాశాన్ని జారవిడుచుకున్నారు. ఫలితం అనంతమైన అథఃపతనం. అవ్యవస్థ.

అలాగే బౌద్ధులు సన్యాసాశ్రమానికి, నివృత్తి మార్గానికీ ప్రాధాన్యం యిచ్చారు. దాని ఫలితం ప్రవృత్తికి అవసరమైన సూత్రాన్ని కనుగొనలేక పోయారు. పైగా విశ్వ అరాచకానికి (కాస్మిక్ అనార్కిజం) దారితీశారు.

శృంగారం, శృంగారానందం. యిది వైదికుల అంతస్సూత్రం. దీనినుంచే సకల శాస్త్రాలూ ఆవిర్భవించాయి. ప్రవృత్తి మార్గమంటే యిదే. ప్రకృతి రహస్యం

యిదే. శృంగార సంయోగం వల్ల అండపిండాలు యేర్పడి దానినుండి శిశువు జనించినట్లే యీ బ్రహ్మాండాలు యేర్పడ్డాయని భారతీయులు తలచారు.

పరమాత్మ తనని స్త్రీ శక్తిగా పురుషుడిగా రెండుగా విభజించి సంయోగం ద్వారా సృష్టిని ప్రారంభించినట్లు పురాణాలలో కనబడ్తుంది. అందుకే 'స్త్రీ పుంస యోగోద్భవాం' అన్నారు ఆర్యులు. మైథునీ సృష్టిః అనే పౌరాణిక సృష్టి వ్యాఖ్యానం , శృంగారానికి భారతీయులు యిచ్చిన ప్రాధాన్యాన్ని స్పష్టం చేస్తుంది. ఆనందోబ్రహ్మ అని పరమాత్మని ఆనంద స్వరూపుడిగా వర్ణించడం వెనుక శృంగార ఆనందం అనేది అంతర్లీనంగా ఉంది. విష్ణువుని శృంగార అధిష్టాన దేవతగా పౌరాణికులు వర్ణించారు. అందుకే వరూధిని తన ప్రేమని తిరస్కరించిన ప్రవరుడితో 'ఆనందో బ్రహ్మయటన్న ప్రాచదువు అంతర్బుద్ధి నూహించుమా' అంది. ఆలంకారికులు శృంగారాన్ని రసరాజంగా గౌరవించారు.

శృంగారానికి భారతీయులు యింత ప్రాధాన్యాన్ని యెందుకు యిచ్చారు? ప్రకృతి క్రమాన్ని అర్థం చేసుకోవాలంటే ప్రకృతినే ఆశ్రయించాలి. అనేది భారతీయుల తాత్విక ధోరణి. వేదం అపౌరుషేయం అనడంలో కూడా యీ ప్రాకృతిక దృష్టే వుంది. పదార్ధ జగత్తు సహజసిద్ధమైన సంయోగ ప్రక్రియ ద్వారా అనాది అనంతంగా కొనసాగుతోంది. పదార్థానికి మూలం పదం అంటే శబ్దం. శబ్దమంటే వేదం అందువల్ల వేదం అనాది, పాదార్థిక జగత్తు లాగే. యిదీ వైదికుల నిర్ధారణ.

మనం యిప్పుడు స్త్రీ పురుష సంయోగం నుంచి కొంచెం ముందుకు కదులుదాం. సంయోగం ద్వారా అండపిండాలు, వాటినుంచి జీవి ఆవిర్భవిస్తోంది. పిండాండం లాగే బ్రహ్మాండం కూడా జనిస్తోంది. బ్రహ్మ అంటే బృహత్ – పెద్ద అని అర్థం. పెద్ద అండమే బ్రహ్మాండం. భగవంతుడు స్త్రీ పురుష రూపములు ధరించి, సంయోగమును పొందగా అండం వెలువడింది. అదే సృష్టి మూలం అని దేవీ భాగవతం.

గోళాకృతిని సూచిస్తూ అండ పదాన్ని, పిండపదాన్నీ వాడడం అనేది, ఖగోళ శాస్త్ర గ్రంథాల్లోనూ, పురాణాల్లోనూ కూడా కనిపిస్తోంది. భూమిని వర్ణిస్తూ అండ, పిండ పదాల్ని ఖగోళశాస్త్ర గ్రంథాల్లో వాడారు. అలాగే అండగోళకం అనే పదం భాగవత పురాణంలో కనబడ్తోంది. బ్రహ్మాండం అండం వంటి పదాలు విరివిగానే కనబడ్తున్నాయి పురాణాల్లో.

భాగవతంలో గర్భస్థ శిశువు పరిణామ క్రమం వర్ణించబడింది. అణువుల సంయోగంతో మొదలై, క్రమేపీ పిండరూపం ధరించడం, కరచరణాద్యవయావాల్ని సంతరించుకోవడం క్రమపద్ధతిలో వర్ణించబడింది. సూక్ష్మ అణుస్థితి నుంచి స్థూలస్థితికి పరిణామం జరుగుతోందని వర్ణించబడింది. అలాగే కాలం సూక్ష్మాతి సూక్ష్మ స్థితినుంచి చాలా బృహత్ రూపం వరకు వర్ణించబడింది. అతి చిన్నకాలం రెండు అణువుల కలయికకు సంబంధించిన కాలం. అతి పెద్ద కాలం బ్రహ్మ జీవితకాలం. సూక్ష్మాతి సూక్ష్మ స్థితినుంచి స్థూలాతి స్థూల స్థితిలోకి పరిణామం జరుగుతోంది అని పూరాణాలు వర్ణించాయి. దేశకాలాలని కూడా ఆ దృష్టితోనే కొలిచాయి. అంతిమంగా అనంత బ్రహ్మాండాలని ఆవిష్కరించాయి.

భారతీయ తత్వశాస్త్రం బయట లోపల, ద్రష్ట దృశ్యము లాంటి భేదాల్ని వొప్పుకోదు. అణువులో వున్నదే బ్రహ్మాండంలోనూ వుంటుంది. మనిషిలో జరుగుతున్నదే అనంత విశ్వంలోనూ జరుగుతుంది. సూక్ష్మబృహత్ రూపాల్లో వొకే విధమైన సృష్టి ప్రక్రియ కొనసాగుతుంది.

అందువల్ల సృష్టికీ ప్రకృతికీ కారణాన్ని యెక్కడో వెతకడం కంటె జీవుడు తనలోనే వెతుక్కోవాలి. మనం చూస్తున్నదే సత్యం. సత్యం యెక్కడో లేదు. అందువల్ల సంయోగం వల్ల జీవులు పుడ్తున్నారనేది కనబడే సత్యం. దానినే పొడిగిస్తే అనంతంగా గుణిస్తే విశ్వమంతా సంయోగ ప్రక్రియ తప్ప , ఈశ్వరుని శృంగార లీల తప్ప మరేమీ కాదు.

అందుకే భక్తి కవిత్వంలో శృంగారానికి అంత ప్రాధాన్యం వచ్చింది.

ప్రపంచంలో పరోక్షమైనది యేదీలేదు. ప్రతీదీ ప్రత్యక్షమే. బ్రహ్మజ్ఞానాన్ని అపరోక్షానుభూతి అన్నారు అందుకే.

యీ జగత్తుకి బయట ఏదీ లేదు. జగత్తుకి కారణాన్ని జగత్తుకి బయట వెతకడం వ్యర్థం. మరి యీశ్వరుడెక్కడ వున్నాడు? జగతోస్య జగచ్చసః అని విష్ణు పురాణం అంటే విష్ణువు జగత్తుకే జగత్తు. అంటే నిజానికి అతడే జగత్తు.

జగత్తు సంయోగ వియోగజనితం కదా? అది అనిత్యం కదా? దానికి ఉనికి లేదు. యెందుకంటే యేది సంయోగజనితమో అది అనిత్యం. వివిధ మూలకాల కలయిక వల్ల జనించినది నశించక తప్పదు. మరి జగత్తే విష్ణువు. అంటే సత్యమూ నిత్యమైనది యేదీ లేదా?

దీనికి సమాధానం యీస్థూల జగత్తు దృశ్యభ్రమ. నిజానికి అణువులు కైవల్య స్థితిలో వుంటాయి. కైవల్యస్థితి అంటే యేకాంతస్థితి. దేనితోనూ కలవని స్థితి. అది స్థలకాలాతీతమైన శుద్ధసత్. మరి సంయోగ వియోగాలో? అవి మాయ. అవి ఈశ్వరలీల. దృశ్యభ్రాంతి (శ్రీమద్భాగవతం చూడండి) అలాగే జీవుడి స్వస్థితి కైవల్యమేనని భావం.

దృశ్యమంతా భ్రాంతి అని ఖగోళశాస్త్రవేత్తలు, వేదాంతులు యేకకాలంలో నిరూపించారు. యిందుకు వొకేరకమైన ఉదాహరణలని ఆశ్రయించారు.

ఆర్యభటుడు యేమన్నాడంటే – నీటిలో చలిస్తున్న పడవలో కూర్చున్నవాడు వొడ్డున వున్న వృక్షాలూ గృహాలూ కదులుతున్న భ్రాంతికి గురవుతాడు. (రైలు కదుల్తున్నప్పటి పరిస్థితి యిదే)

అలాగే భ్రమిస్తున్న భూగోళంపై వున్న మనిషి చంద్రసూర్య నక్షత్రమండలాలు కదుల్తున్న భ్రాంతికి గురవుతాడు. నిజానికి భూభ్రమణమే సత్యం. యీ సత్యాన్ని భ్రాంతి వలన గుర్తించలేకపోతున్నాడు. చలిస్తున్న భూమిని స్థిరమైనదిగా భ్రమ పడతాడు. యిదే వుదాహరణని స్వీకరించి జీవికి కర్తృత్వం అనేది భ్రాంతి జనితం అని వ్యాఖ్యానిస్తారు శంకరాచార్యులవారు. భగవద్గీతలో కర్మణ్యకర్మయఃపశ్యేత్ అనే శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ కర్మని ఆచరిస్తూ కూడా, తనకి కర్తృత్వం అంటదని గుర్తించినవాడే జ్ఞాని అంటాడు. ఆత్మకి కర్తృత్వం లేదంటాడు. అది నిశ్చలమైనది, నిర్లిప్తమైనది. సాక్షి మాత్రమే. కదలని నిశ్చల వస్తువు కదుల్తున్నట్లు భావించడం దృష్టి భ్రమ మాత్రమే. అలాగే కర్తృత్వ భావన కూడా భ్రాంతి జనితమని ఆర్యభటుడు యిచ్చిన దృష్టాంతాన్నే చూపుతారు శంకరాచార్యులు గీతా భాష్యంలో.

యిక్కడ ఖగోళ శాస్త్రం వేదాంతం రెండింటికీ మూలం వొక్కటే. దృశ్యాన్నే సత్యంగా స్వీకరించకూడదు. స్థూల దృశ్యం ద్వారా సూక్ష్మ సత్యాన్ని గ్రహించాలి. అట్టి సత్యం వైపు ప్రయాణించాలి.

అంటే సంయోగ వియోగజనితమైన దృశ్య ప్రపంచం వెనక నిశ్చల నిర్వికార తత్వం, సూక్ష్మసత్యం సత్యమైన స్థితి దాగివున్నాయి అని గ్రహించాలి. యిదీ సనాతన తత్వం.

నిజమే మనం ప్రత్యక్షంగా కనబడే ప్రకృతి నుంచే ప్రయాణం ప్రారంభించాలి. దాని అర్థం అక్కడే ఆగిపోవాలని కాదు. స్థూల జగత్తే సత్యమని నిలిచిపోవడం

భావ్యం కాదు. అక్కడినుంచి సూక్ష్మంలోకి ప్రయాణించాలి. కంటికి కనబడే దానినుంచి కంటికి కనబడని సత్యం వైపు వెళ్ళాలని తాత్వికుల శాస్త్రజ్ఞుల బోధ. ప్రత్యక్ష ప్రమాణం నుంచి అనుమాన ప్రమాణంలోకి ప్రవేశించక తప్పదు. స్థూలే నిర్జిత మాత్మానం, శనైః సూక్ష్మంధియా నయేత్ అనే భాగవత ప్రబోధానికి అర్థం యిదే.

భారత ఖండంలోని శాస్త్రాలన్నీ సూత్రమూ, భాష్యము అనే రూపంలో కొనసాగడానికి యీ సూక్ష్మస్థూల పరిణామమే మూలం.

సూక్ష్మస్థితిని సూత్రం అంటారు. సూత్రధారి అంటే భగవంతుడు, పరమాత్మ అని అర్థం వుంది. నాటకంలో సూత్రధారి కనబడ్తాడు. మొత్తంమీద సూత్రం అంటే మనకి కనబడకుండా వుండి యీ దృశ్యజగత్తులోని బహుళత్వానికి మూలమైనది, ఆధారమైనది, దృష్టి గోచరం కానిది, సూక్ష్మమైనది. దానినుంచే యింత విస్తృతమైన పద పదార్థ జాలం ఆవిర్భవించింది. సూక్ష్మంనుంచి స్థూలం ఆవిర్భవించింది.

జగత్తు ద్వారా జగదీశ్వరుని వైపు, సంసారం ద్వారా తత్వ సారం వైపు ప్రయాణించడం మాత్రమే అనాదిగా వైదికమార్గం.

జగత్తునీ కుటుంబాన్నీ కూడా వైదికులు సంసారం అన్నారు. అంటే ఉనికి కలది, అర్థవంతమైనది, సారము కలది అంటే రసపూర్ణమైనది అని కూడా అర్థాలు వున్నాయి. సంసారం అనే పదం బౌద్ధ గ్రంథాల్లో కూడా కనిపిస్తుంది. కాని యీ పదానికి గల వ్యుత్పత్తి అర్థాన్ని బట్టి ప్రవృత్తి మార్గ ఆరాధకులైన వైదికులే మొదట యీ పదాన్ని ప్రాచుర్యంలోనికి తెచ్చి వుండవచ్చునని నా వూహ. నిస్సారం తేన సారేణ, సారవత్ లక్ష్యతే జగత్. (యీ వాక్యం సంసారపదం వైదికమని తెలియజేయుచున్నది) యీ జగత్తు సారభూతమైన పరమాత్మను ఆధారం చేసుకొని వుంది. అందువల్లనే సంసారమని పిలువబడుచున్నది. యిది అద్వైత వేదాంతి సురేశ్వరాచార్యుల వేదవాక్కు.

అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః అన్నారు ఆలంకారికులు. అంటే అనంతమైన కావ్య సంసారానికి – కావ్య జగత్తుకి కవే బ్రహ్మ.

అంటే రస పరిపూర్ణమైన కావ్యాన్నీ, కుటుంబాన్నీ, పాంచభౌతిక జగత్తునీ యీ మూడింటినీ కూడా సంసారమనే అన్నారు ఆర్యులు.

అదే సమయంలో బౌద్ధులు జగత్తు నిస్సారం అన్నారు. ఉనికి లేనిది, స్వభావం లేనిది దుఃఖమయమైనది అన్నారు. దుఃఖం, దుఃఖకారణం, దుఃఖనిరోధం, నిరోధపథం అనే నాలుగు ఆర్యసత్యాలని బుద్ధుడు చెప్పాడు. బుద్ధుని బోధలో దుఃఖం ప్రధానసూత్రం.

కాని యోగశాస్త్రం కూడా నాలుగు ఆర్యసత్యాలని చెప్పింది.

1) సంసారము (2) సంసారహేతువు (3) మోక్షం (4) మోక్షోపాయం. యిక్కడ సంసారం అనే పదాన్ని ప్రత్యేకంగా గమనించవచ్చు. వైదికుల దృక్పథం వారి భాషలో ప్రతిబింబిస్తూనే వుంది. వారు జగత్తుని దుఃఖమయంగా చూడలేదు. పైగా ఆనందమయంగా చూశారు అనే సత్యాన్ని యిక్కడ ప్రయోగించిన సంసారం అనే పదం సూచిస్తోంది.

చాలాకాలం పాటు వైదికులు మూడు పురుషార్థాలనే అంగీకరించారు. వాటిని త్రివర్గ అన్నారు. వాత్స్యాయన కామసూత్రం యీ త్రివర్గని నమస్కరించడంతో ప్రారంభమౌతుంది. వాల్మీకి మహర్షి యీ త్రివర్గని బోధించడమే లక్ష్యంగా భావించాడు. వీరు మోక్షాన్ని ప్రస్తావించలేదు. కౌటిల్యుని అర్థశాస్త్రమూ అంతే.

దీనిని బట్టి మోక్షం అనే పురుషార్థం తరువాతి కాలంలో చేర్చబడింది. బౌద్ధ నిర్వాణ ప్రభావం వల్ల చేర్చబడింది అని అర్థమవుతుంది. సంసారంలోనే బ్రహ్మజ్ఞానానికి మార్గం వుందని జనక యాజ్ఞవల్క్యాది జ్ఞానుల జీవిత చరిత్రలు బోధిస్తున్నాయి.

ప్రత్యేకంగా మోక్షం కోసం సన్యాసాశ్రమాన్ని స్వీకరించడం అనేది వైదిక ధర్మంలో లేదు. అందుకే మీమాంసకులు సన్యాసాశ్రమాన్ని ఖండించారు. పరమవైదికుడు మీమాంసాపండితుడైన మండనమిశ్రుడు శంకరాచార్యులవారిని మూర్ఖుడని నిందించాడు.

**స్థితోపి యోషితాం గర్భే**
**తాభిరేవ వివర్జితః**
**అహో కృతఘ్నతా మూర్ఖ**
**కథం తా ఏవ నిందసే.**

మూర్ఖుడా నీవు పరమ కృతఘ్నుడివి. స్త్రీ గర్భంలో నవమాసాలూ వున్నావు. వారి వల్లనే జన్మను పొందావు. యిప్పుడు ఆ స్త్రీలనే మోహబంధనాలని, మోక్షానికి

అడ్డంకి అని నిందిస్తున్నావు, నీకంటె  కృతఘ్నుడు లేదు అని మండని మిశ్రుడు శంకరాచార్యుల వారిని నిందించాడు. అంతేకాదు, భుక్తి కోసమే కాషాయవస్త్రాన్ని ధరించావన్నాడు.

నివృత్తి మార్గమైన సన్యాసం పట్ల తీవ్ర వ్యతిరేకత చాలాకాలం కొనసాగింది. వైదికధర్మంలో. అందుకే శంకరాచార్యులు కూడా కామం గురించి తెలుసుకొని కామశాస్త్రాన్ని రచించాడన్న కథ కూడా వాడుకలోకి వచ్చింది. ఇది శంకర విజయంలో వుంది. దీనికి కారణం సర్వాత్మనా  సన్యాసాశ్రమాన్ని  వైదికులు అంగీకరించ లేకపోవడమే. ప్రాచీన భారతదేశంలో కామశాస్త్రం వెలువడడానికి కారణం కూడా యిదే.

వారి ప్రాపంచిక దృక్పథంలో సన్యాసానికి స్థానం లేదు. బౌద్ధ సన్యాసంలో ప్రపంచనిరాకరణ ఉంది. ప్రకృతి నిరాకరణ వుంది. కాని వైదికం అట్టి దృక్పథాన్ని ఒప్పుకోదు. ప్రకృతికి గొప్పస్థానాన్ని యిస్తుంది. అన్నిటినీ సమన్వయదృష్టితో స్వీకరించే వైదిక ధర్మం చివరికి ప్రవృత్తి - నివృత్తి మార్గాల సమన్వయాన్ని బోధించింది. ఆశ్రమాత్ ఆశ్రమం గచ్ఛేత్ - వొక ఆశ్రమం తర్వాత మరొక ఆశ్రమాన్ని స్వీకరించాలి అని క్రమపద్ధతిని బోధించింది. అంటే అన్ని ఆశ్రమాలకీ సమాన స్థానాన్ని యిచ్చి సమన్వయాన్ని సాధించింది. హరి హర అద్వైతం లాగే ప్రవృత్తి నివృత్తి మార్గ సమన్వయాన్ని బోధించింది.

వైదిక ధర్మానికి ప్రకృతి పట్ల గల సానుకూల దృక్పథంవల్లనే సకల శాస్త్రాలూ వైదికం నుంచే ఆవిర్భవించాయి. పురాణాలూ, కావ్యాలూ వైదికం నుంచే స్ఫూర్తిని పొందాయి.

ప్రకృతి విరుద్ధమైన సన్యాసాన్ని ఆశ్రయించి దుఃఖాన్ని ఆరాధించి, ఉనికినే నిరాకరించిన బౌద్ధతర్కం నుంచి ప్రకృతికి వ్యాఖ్యానాలైన శాస్త్రాలు ఆవిర్భవించే అవకాశం మృగ్యమైంది.

అంటే శృంగారమే వైదిక ధర్మసారమని చెప్పవచ్చు. దేవాలయాల మీది శృంగార శిల్పాలు భారతీయ తాత్విక దృష్టినే ప్రతిబింబిస్తున్నాయి.

వలస క్రైస్తవ సామ్రాజ్యవాదం, వారు నేర్పిన విద్య శృంగారానికి సంయోగానికి వైదికులు యిచ్చిన విస్తృతార్థాన్ని విస్మరించేలా చేశాయి. అది పాపమని నీచమని వ్యాఖ్యానించాయి. క్రైస్తవం ప్రకారం దేవుడు ప్రకృతిని సృష్టించాడు.

శృంగారంలో పాల్గొనడం ద్వారా మనిషి పాపాన్ని పొందాడు. ఎందుకంటే - సృష్టి కర్త పరిధిలోకి మనిషి చొచ్చుకుపోయాడు. అది దైవ ధిక్కారం. అది పాపం.

కాని వైదికధర్మం ప్రకారం సృష్టి కార్యం పుణ్యకార్యం, అది ప్రకృతి ధర్మం, అంటే వైదికధర్మం కూడా. అసలు రెండూ వొకటే.

క్రైస్తవ ప్రభావం వల్ల దయానంద సరస్వతీ స్వామి శృంగార పరపూర్ణములైన భాగవతాది పురాణములు అవినీతి మయములని ఈసడించుకొన్నాడు. బెంగాల్ సంస్కర్తలు ప్రణయశీలియైన భాగవతకృష్ణుడిని నిరాకరించారు. భగవద్గీతనూ తత్వాన్నీ బోధించిన భారత శ్రీకృష్ణుడిని క్రీస్తువంటి ఆదర్శనీయ, పురుషుడిగా ముందుకు తీసుకువచ్చారు. ఆధునిక కాలంలో విష్ణు అవతారాల్ని అర్థం చేసుకోవడంలో, వారి చరిత్రని వ్యాఖ్యానించడంలో క్రైస్తవ ప్యూరిటన్ భావాలు, స్పష్టంగా కనిపిస్తాయి. హిందూవాదులు శ్రీరాముడికి మితిమీరిన ప్రాధాన్యం యివ్వడం దీనికి కొనసాగింపే.

అలాగే శివలింగం అంటే పురుషాంగం కాదు. పవిత్ర పర్వతాకృతి అని వివేకానంద వ్యాఖ్యానించాడు. మొత్తమ్మీద క్రైస్తవ ప్రభావం వల్ల సనాతన కథనాల్లో కనబడే శృంగారాన్ని తుడిచిపెట్టడానికి సంస్కర్తలు ప్రయత్నించారు. ఆ విధంగా తామూ క్రైస్తవ నీతి వంటి నీతినీ, క్రైస్తవ మతం వంటి మతాన్నీ కలిగి వున్నామని చాటుకోవడానికి నానా కష్టాలు పడ్డారు.

అందువల్లనే సంస్కరణ భావాలు గల ఆధునిక మేధావులందరూ ప్రబంధాల్ని శృంగారమయాలని యీసడించుకొన్నారు. ముద్దుపళని రాధికాసాంత్వనం వంటి కావ్యాల్ని నిషేధించాలన్నారు. చివరికి భావకవులు అమలిన శృంగారం అనే సిద్ధాంతాన్నే లేవదీశారు. ఈ విధంగా పాపప్రక్షాళన కోసం ప్రయత్నించారు.

## వేదాన్ని మతగ్రంథంగా మార్చిన క్రైస్తవం

క్రైస్తవ ప్రభావం వల్లే వేదానికి తీవ్ర ప్రాముఖ్యం వచ్చింది. మతగ్రంథంగా గుర్తింపు వచ్చింది. వలస క్రైస్తవుల రాకకు పూర్వం వేదానికి యిట్టి తీవ్రప్రాముఖ్యం లేనేలేదు. బైబిల్ లాగే ప్రామాణిక గ్రంథాన్ని స్థాపించాలన్న తపన వల్లే యిట్టి ప్రాధాన్యం యివ్వబడింది.

వాఙ్మయమంటే నాలుగు వేదాలే కాదు. స్మృతులు 'పురాణాలు' ఉపనిషత్తులు ఇత్యాదిగా అనంత గ్రంథరాశి వుంది. శంకరాచార్యుల వారు వేదాలకి భాష్యం రాయనేలేదు. అనంతరం రామానుజ మధ్వాచార్యులూ అంతే.

కారణం యేమిటంటే – వేదాలు పూర్వమీమాంసకు సంబంధించిన శృతులు. కర్మకాండ, ప్రకృతి ప్రార్థనలు వాటి సారం. అవే అనంత వాఙ్మయానికి మూలం అనేది కూడా సత్యమే కాని అవే చివరి మాట కాదు.

కాని క్రైస్తవం ప్రభావం వల్ల వేదాలని దైవలేఖనాలుగా భావించారు ఆధునిక మేధావులు. ప్రాచీనమైనది కావడం వల్ల చాలా ప్రాముఖ్యం యిచ్చారు. హిందూ బైబిల్‌గా భావించారు. వాటిలో ఆధ్యాత్మికమైన అర్థాల్ని, అదే సమయంలో క్రైస్తవ సైన్సుకి సంబంధించిన అర్థాల్ని వెతికారు. వ్యాఖ్యానించారు. ఒకే దేవుడనే క్రైస్తవ భావనని కూడా వేదాల్లోనే వెతికారు. సాయణాది వేద భాష్యకారులని పక్కకు పెట్టి, తమకు తోచిన అర్థాల్ని కూర్చారు; దయానంద, అరవింద స్వామి మొదలైన వారు. ఫలితంగా వేదాలకి ప్రాముఖ్యం హెచ్చింది. అవి గ్రంథాలుగా మారి, వైదిక సంస్కృతికి తిరుగులేని దెబ్బ తగిలింది.

చాలా ప్రాచీనమైనవని చారిత్రకంగా నిర్ధారించబడడం వల్ల వేదాలకి ప్రాముఖ్యత చాలాపెరిగింది. ఈ చారిత్రక దృష్టి వలస క్రైస్తవమే తప్ప సనాతనంకాదు.

కాళిదాసు యేమన్నాడు పురాణమిత్యేవ నసాధు సర్వం. ప్రాచీనమైనదవడం వల్ల దేని విలువ కూడా పెరుగదు. నూతనమైనది కావడం వల్ల నిరాకరించబడదు. వేదం కంటె పురాణాలు చారిత్రకంగా ఆధునికమైనవి. అంతమాత్రాన వాటి విలువ పడిపోదు. వేదం విలువ పెరుగదు. యిట్టి దృష్టి సనాతనమేకాదు. సనాతనమనేది పరంపరాగతమైన ప్రవాహం.

కేవలం ప్రాచీనత్వానికి ప్రాధాన్యం లేకపోవడంల్లే పురాణం అన్న పదానికి పురా నవం భవతి (పురా అపి నవం) ప్రాచీనమైనదైనప్పటికీ నవీనమై అలరారేది అని నిర్వచనమిచ్చాడు యాస్కుడు నిరుక్తంలో. అందువల్లనే పురాణాలు అసంఖ్యాకంగా వినూత్న వూహలతో విస్తరించాయి. యింతకీ చెప్పవచ్చేదేమిటంటే–ప్రాచీనమైనది కావడమే ప్రామాణికం కాదు. వేదాలు పాతవి కావడంవల్ల మితిమీరిన విలువనిచ్చి, వాటిని ఆధారం చేసుకొని మిగిలిన వాఙ్మయాన్నంతా తిరస్కరించడం వైదిక పద్ధతి కాదు. సనానత సంప్రదాయం కాదు. అసలు వేదంకంటె పురాణాల్నే ముందుగా బ్రహ్మ స్మరించాడని స్కాంద, పద్మ, మత్స్య పురాణాలు వ్యాఖ్యానించాయి. వేదాలకి ప్రాధాన్యత నిచ్చిన దయానంద సరస్వతి మొదలుకొని వీరేశలింగం పంతులు వరకు గల ఆధునిక సంస్కర్తలు పురాణాలని తిరస్కరించారు. పురాణాలని హేతు

విరుద్ధమైనవిగా వ్యాఖ్యానించారు. కాని నిజానికి శృతి స్మృతి పురాణములనేవి వొక పరంపర. వీటిలో ఏదో వొక బిందువుని పట్టుకుని వేరుచేసి ప్రామాణిక గ్రంథాన్ని కల్పించడం క్రైస్తవ విద్యా జనితమైన సంకుచిత దృష్టి. అంతేకాక సంస్కృతియొక్క ప్రవాహ శీలతను గుర్తించక, సంస్కృతిని వొకేవొక గ్రంథంలో ఘనీభవింపజేయడం వైదిక ధర్మ విరుద్ధం. నిజానికి వైదిక ధర్మమనేది అనాది కాలం నుండి నేటి వరకు ప్రవహిస్తూ వచ్చిన స్రవంతి మాత్రమే. వైదిక ధర్మం గురుశిష్య పరంపర ద్వారా కొనసాగుతూ వచ్చిన అవిచ్ఛిన్న పరంపర దానికి వొకే ప్రామాణిక గ్రంథమంటూలేదు.

## అవిచ్ఛిన్న పరంపర మాత్రమే సత్యం

వేదాలని సంహితలు అన్నారు. సంహిత అంటే సంకలనం, కూర్పు అని అర్థం. రుగ్వేద సంహిత, యజుర్వేద సంహిత యిత్యాది నామాలు ఆవిధంగా వచ్చినవే.

ఆయుర్వేద సంహిత గురించి వివరణ భారతీయ వాఙ్మయ సారాన్ని అవగతం చేసుకోవడానికి యెంతగానో ఉపయోగిస్తుంది (బ్రహ్మవైవర్త పురాణం).

ప్రజాపతి అంటే పరమాత్మ స్వయంగా చతుర్వేద అనుభవ సారాన్ని ఆయుర్వేద సంహితగా నిర్మించి భాస్కరునికి యిచ్చాడు. తరువాత దాని ఆధారంగా ధన్వంతరి మొదలైనవారు వివిధ సంహితలని (సంకలనాలని, కూర్పులని) విరచించారు. యీ విధంగా శిష్య ప్రశిష్య పద్ధతిలో వొకరి నుంచి మరొకరు పూర్వీకుల అనుభవాలనీ స్వానుభవాలనీ కలిసి సంహితీకరిస్తూ వచ్చారు.

అంటే భారతదేశంలో వైదిక మార్గంలో సంహితలు మాత్రమే వున్నాయి. ఇతిహాస పురాణాలు కూడా సంహితలే. అందుకే జయం అనబడే పాతికవేల గ్రంథం క్రమేపీ లక్ష శ్లోకాలకి విస్తరించి మహాభారతంగా అవతరించింది. మహత్వాత్ భారవత్వాత్ చ మహాభారతం అని ప్రశస్తి కెక్కింది. భారతాన్ని సంహిత గానే వ్యవహరించాడు వ్యాసుడు. అందువల్ల పురాణాలు, ఉపపురాణాలు, ఉపోప పురాణాలు, ఔపపురాణాలు యిత్యాదిగా అనంతమైన కూర్పులుగా గురుశిష్య పరంపర ద్వారా మౌఖికంగా శృతులుగా విస్తరిస్తూ అనంతమైన వాఙ్మయంగా అవతరించాయి. నేను చెప్పిందే వేదం అనడం వేద భూమిలో సాధ్యం కాదు వేదం సంహితా ప్రవాహమే కాని రాసి పారేసిన గ్రంథం కాదు.

అన్ని శాస్త్రాలూ, పురాణాలూ, కావ్యాలూ సంహితలే. అందువల్లనే వరాహ మిహిరాది ఖగోళ శాస్త్రవేత్తలు ఖగోళం గురించి పౌరాణిక కథలని కూడా తమ గ్రంథాల్లో పేర్కొన్నారు. (వరాహ మిహిరుని గ్రంథం పేరు బృహత్ సంహిత) యెందుకంటే భారతీయ గ్రంథరాశి అంతా తాతముత్తాతల కాలం నుంచి వస్తున్న కథనాల వ్యాఖ్యానాల కూర్పు మాత్రమే.

## ఏది ప్రామాణికం

వేదాలు అనంతం, బ్రహ్మాండాలు అనంతం. కనుక ప్రామాణికం అంటూ ఏదీ లేదు. అనంత వ్యాఖ్యానాలు మాత్రమే వున్నాయి. అనంత కథనాలు అనంత వ్యాఖ్యానాలు మాత్రమే వున్నాయి. యిట్టి బహుళత్వంలో వైరుధ్యాలు సహజమే. ఆ వైరుధ్యాల్ని సమన్వయం చేసుకోవాలి అంతేకాని బహుళత్వాన్ని నిరాకరించరాదు.

అందువల్లనే పురాణాల్లోని భిన్న కథనాలని కల్పభేదంవల్ల యేర్పడినవిగా సమన్వయించారు పౌరాణికులు. అంటే యుగాలు, చక్రంవలె తిరిగి తిరిగి వస్తాయి. అవతార పురుషులు తిరిగి తిరిగి జన్మిస్తారు. అందువల్ల సహజంగానే పురాణ కథనాల్లో వైవిధ్యం ఏర్పడుతుంది అంటారు పౌరాణికులు. అందుకే వందల రామాయణాలు పుట్టుకువచ్చాయి. యీ వైరుధ్యాల వైవిధ్యాల సమన్వయం నుంచే భారత బహుళ సంస్కృతి యేర్పడింది.

వైదికులు మూడు రకాల వ్యాఖ్యానాలని గురించి ప్రముఖంగా ప్రస్తావించారు. 1) అధిభౌతికం 2) అధిదైవికం 3) ఆధ్యాత్మికం.

అధి భౌతిక వ్యాఖ్యానం యీ ప్రపంచాన్ని పంచభూతాల అణువుల సంయోగంగా వ్యాఖ్యానిస్తుంది. అధి దైవిక వ్యాఖ్యానంలో దేవీ దేవతల పౌరాణిక కథనాలు వుంటాయి. యీ దేవీ దేవతలు జగత్తునీ యింద్రియాలనీ శాసించే విధానం వర్ణించబడ్తుంది. ఆధ్యాత్మికంలో ఈ ప్రపంచం పరమాత్మ స్వరూపంగా స్థలకాలాతీతమైన శుద్ధ సత్తుగా వ్యాఖ్యానించబడ్తుంది.

ఉత్తమ మధ్యమ అధమ అధికారి భేదాన్ని బట్టి ఆయా వ్యాఖ్యానాలు ఉద్దేశించబడ్డాయి. అందుకే గాయత్రీ మంత్రానికి సూర్యపరమైన, పరమాత్మపరమైన వ్యాఖ్యానాలు ద్వివిధంగా లభిస్తున్నాయి.

క్రైస్తవ దేశాలలోవలె వేద భూమిలో సైన్సు వ్యాఖ్యానాలు అంటూ వేరే లేవు. యీ బహుళ వ్యాఖ్యానాలలో అవి కూడా కలగలసిపోయి వుంటాయి. అలాగే యీ భిన్న వ్యాఖ్యానాల మధ్య అంతస్సంబంధం వుంది.

పురాణాలలో శాస్త్రీయ విషయాలు వుండవని విమర్శిస్తారు ఆధునికులు. శిష్ట్లా శ్రీనివాస్ భూమి కపిత్థాకారం-వెలగపండువలె గోళాకారం కలది అన్న ఖగోళ శాస్త్రవ్యాఖ్యానం పురాణాలలో అస్సలు కనబడదు అన్నారు. కపిత్థాకార భూగోళా అనే గ్రంథంలో యీ విమర్శ చేశారు. కానీ జనమంచి శేషాద్రి శర్మగారి తెలుగు బ్రహ్మ పురాణంలో కపిత్థ ప్రసక్తి వుంది. ఈ గ్రంథాన్ని వావిళ్లవారు 1930లో ప్రచురించారు.

అందుకే ఖగోళ గణిత, శాస్త్ర గ్రంథాలలో పౌరాణిక కథనాలు కనబడ్తాయి. పురాణాలలో శాస్త్రాల వ్యాఖ్యానాలు కూడా ప్రస్ఫుటంగా కనబడ్తాయి. అందువల్ల యీ గ్రంథాలలో యేవొక్కటీ ప్రామాణిక గ్రంథం కాదు. ఋదంతా అంతులేని వాక్ ప్రవాహం. అంతా వేదమే. కల్పన ప్రధానమైన పురాణాలకీ, హేతుప్రధానమైన శాస్త్రాలకీ అంతస్సంబంధం వుంది.

వీటి నుంచి యేవొక్క బిందువునైనా వేరుచేసి ప్రాధాన్యతనిచ్చి, మిగిలిన పరంపరని, ప్రవాహాన్ని తిరస్కరించడం, తద్వారా వొక మతవ్యవస్థని కల్పించాలని చూడడం వేద భ్రష్టత్వం మాత్రమే.

వేదాలూ, పురాణాలూ, శాస్త్రాలూ... వీటికి వేటికీ వొక మొదలు లేదు. వొక కర్త లేదు. పదమూ పదార్థమూ పార్వతీ పరమేశ్వరులవలె విడదీయరానివి కనుక అనాది అనంతాలు; ప్రకృతివలె సహజ సిద్ధమైనవి. శబ్దానికి ఆది లేదు. కర్త లేదు.

## శబ్దంపై పేటెంట్ హక్కు లేదు

ఆయుర్వేదం అకృతకం అంటాడు చరక సంహితకర్త. అంటే యెవరో వొక కర్త రచించినది కాదు. ప్రవచించినది కాదు. మరి యెలా ఆవిర్భవించింది?

స్వాభావికం చ అస్య లక్షణం అకృతకం యథా అగ్నేః ఉష్ణం, ఆపాం ద్రవత్వం.

నిప్పుకి వేడి, నీరుకి ద్రవత్వం యెలా సిద్ధించాయి. అలాగే ఆయుర్వేద సూత్రాలు ప్రకృతిలోనే వున్నాయి. అనాదిగా వున్నాయి. వాటిని యెవరూ రచించలేదు

మరి శాస్త్రవేత్తలు చేసిందేమిటి? ఆ సూత్రాలని స్మరించి సంహితీకరిస్తారు. సంకలనం చేస్తారు. అందుకే వాటిని చరకసంహిత, సుశ్రుత సంహిత అని పిలుస్తారు. వేద సంహితల్లాగే అవీనూ. వేదం లాగే అవీ అపౌరుషేయాలు.

అసలు శబ్దాన్ని వేదాన్ని యెవరు రచించారు? ప్రవక్త యెవరు? యెవరూ లేరు. ఈశ్వరుని నిశ్వాసంగా వెలువడ్డాయంటారు ఆర్యులు. అంటే యేమిటి? అవి సహజసిద్ధమైనవి. వేదమూలకమైన శాస్త్రాలూ అంతే.

## సృష్టే సృజన

సృష్టికి సంబంధించిన సిద్ధాంతాన్ని బట్టే సృజనకి సంబంధించిన సిద్ధాంతం పుడ్తుంది.

వైదికధర్మంలో సృష్టికర్త లేదు. మరి బ్రహ్మగారు యేం చేస్తున్నారు? ప్రళయానికి పూర్వం సంభవించిన జీవుల కర్మల్ని స్మరిస్తున్నాడంతే. అంటే బ్రహ్మ స్మర్త - స్మరించేవాడు మాత్రమే. కర్త కాదు. యిదీ పౌరాణిక వాదన. సృష్టికర్తని అంగీకరిస్తే అతడికి కూడా మరొక కర్త వున్నాడని అంగీకరించవలసి వస్తుంది. యిది అనంతమైన అవ్యవస్థకి దారితీస్తుందని వైదికులైన సాంఖ్యులు యేనాడో చెప్పారు.

వేదానికి కూడా కర్తలేదు. స్మర్త మాత్రమే వున్నారు. వారే మంత్రద్రష్టలైన రుషులు. పురాణాలకీ కర్తలేదు. బ్రహ్మ స్మర్త.

క్రైస్తవంలో సృష్టికర్తకు చాలా ప్రాధాన్యం వుంది. సృష్టికర్త వున్నప్పుడు సృజనకి కూడా కర్త ప్రధానం. కర్తలేనిదే సృజన అసాధ్యం. అందువల్ల కావ్యానికైనా శాస్త్రానికైనా కర్త ప్రధానం. పేటెంట్ హక్కులు ప్రధానం. అందుకే వేపపైన, బాస్మతీ బియ్యంపైన పేటెంట్ హక్కు కావాలంటారు క్రైస్తవ శాస్త్రజ్ఞులు. వాటి జ్ఞానానికి తామే కర్తలమంటున్నారు వారు.

వైదిక శాస్త్రజ్ఞులేమంటారు? ప్రకృతి అనాది. వాక్కు అనాది జ్ఞానం అనాది. దానికి కర్త లేదు. ప్రకృతిలోనే ప్రకృతి సూత్రాలు వున్నాయి. వాటిని శాస్త్రజ్ఞుడు రుషి సంకలనం చేస్తాడంతే. అసలు కర్తృత్వం అజ్ఞాన జనితం. యిదీ వేదసారం. అందుకే స్వయం భూలింగం స్వయం భూవిగ్రహం వంటి విశ్వాసాలు వచ్చాయి. అంటే స్వతస్సిద్ధంగా శిల్పిలేకుండా (కర్తలేకుండా) అవంతట అవే ఆవిర్భవించినవి అని అర్థం. యీ విశ్వాసాలకి మూలం కర్తృత్వ నిరాకరణే.

యీ వేదసారాన్ని బౌద్ధం కూడా అర్ధం చేసుకోవడంలో విఫలమైంది. అందుకే బౌద్ధానికి మూలాన్ని బుద్ధుడిలో వెతికింది. బుద్ధుడిని ప్రవక్త అంది. ఆయన ప్రవచనాల్ని త్రిపిటిక గ్రంథాలుగా వ్యవస్థీకరించింది. బౌద్ధాన్ని మతంగా మార్చింది. అందుకే బౌద్ధం సామ్రాజ్యవాద మతంగా ఆవిర్భవించింది. యిందుకు ప్రత్యక్ష ఉదాహరణ శ్రీలంక. కర్తనీ ప్రవక్తనీ మతాన్నీ వ్యవస్థీకరణనీ నిరాకరించిన వైదిక ధర్మం బుద్ధుడిని విష్ణువు యొక్క అనంత అవతారాలలో, రూపాలలో వొక రూపంగా బిందువుగా మార్చి, తనలో కలిపేసుకుంది. కారణం భారతదేశంలో కర్తృత్వానికి స్థానం లేదు. జ్ఞానంపై పేటెంటు హక్కు యెవరికీ లేదు. బుద్ధుడికైనా, క్రీస్తుకైనా సరే. యిదే వేదవాక్కు.

ఇందుకే పోతన మహాకవి 'పలికెడిది భాగవతమట. పలికించెడివాడు రామభద్రుడంట' అని కర్తృత్వాన్ని సర్వాత్మనా నిరాకరించాడు. కావ్యాల్ని యెవరూ వ్రాయరు. అవి సంభవిస్తాయి, సహజంగా.

నేడు రచయితల సంఘాలు మతం పాత్ర నిర్వర్తించి, రచయితలకి మార్గనిర్దేశనం చేయడం ద్వారా బహుళమార్గాలకీ బహుళ వ్యాఖ్యానాలకి తలుపులు మూసివేశాయి. సంహితా పద్ధతిని త్యజించాయి,. వైదిక బహుళ మార్గాన్నుంచి పెడగా వెళ్ళాయి. దానివల్ల స్థానిక కులపర బహుళత్వం క్షీణించింది. పైగా కర్తృత్వం బలపడి అహంకారానికి దారి తీసింది.

సనాతన సహజత్వం, ఆశుతత్వం క్షీణించాయి. కృతకమైన నీతిబోధ బలపడింది.

విష్ణువు తానే నిజమైన వైద్యుణ్ణి అన్నాడు. సర్వరోగ చికిత్సాంచ, జానామి చ చికిత్సకః అన్నాడు. ఈ ఆధునిక బౌద్ధిక నియంతృత్వానికి చికిత్సని ఆ విష్ణుమూర్తే చూపాలి.

## మంత్రాలకి చింతకాయలు రాల్తాయి

మంత్రరహస్య విదులు మాత్రమే సాహిత్యానికి మొత్తంగా వాఙ్మయానికి దిశానిర్దేశం చెయ్యగలరు.

వేదమంత్రం గురుముఖతః శిష్యునికి రహస్యంగా అందించబడ్తుంది. అర్థించిన శిష్యునికే అందించబడ్తుంది. శ్రద్ధాళువుకే బోధించబడ్తుంది. యీ విధంగానే విశ్వామిత్రుడు శ్రీరామచంద్రునికి బలా అతిబలా అనే విద్యల్ని మంత్రరూపంలో

బోధించాడు. అస్త్రశస్త్రాలన్నీ మంత్రరూపంలోనే వుంటాయి. అసలు విద్యలన్నీ మంత్రరూపాలే.

వేదమంత్రం సంక్షిప్తరూపంలో వుంటుంది. సూక్ష్మంగా ఉంటుంది. సూత్రానికి మూలం మంత్రమే. గాయత్రీమంత్ర రహస్యాన్ని తెలుసుకుంటే, సూర్యుడు కరతలామలక మవుతాడు.

భారతీయ ఖగోళశాస్త్రానికి మూలం సంధ్యావందనమే. సూర్యనమస్కారం నుంచే సూర్యకేంద్రక సిద్ధాంతం పుట్టింది. సూర్యున్ని ప్రచోదకుడిగా – సకల జీవి ప్రేరకుడిగా వర్ణించే గాయత్రీ మంత్రమే ఖగోళ రహస్యాల్ని బయట పెట్టింది. సూర్యః శశాంకస్య క్షయవృద్ధి విధేర్విభుః అని దేవీభాగవతం.చంద్రుణ్ణి ప్రకాశింపజేసేది సూర్యుడేనని సారాంశం.

విశ్వాసం హేతువూ వేరు వేరు కాదు. రెండూ వొకటే. బెట్రాండ్ రస్సెల్ అంటాడు. గ్రీకుల సూర్యారాధనే, సూర్యకేంద్రక సిద్ధాంతానికి ఉద్వేగభరితమైన స్ఫూర్తిగా పనిచేసిందన్నాడు (స్కెప్టికల్ ఎస్సేస్ – రస్సెల్)

అందువల్ల వేదమంత్రమే సృష్టిమూలం, జ్ఞానమూలం.

## మంత్రమే సత్యం- వాక్కే సాహిత్యం

గురుముఖతః బోధించబడిన మంత్రం. గురుముఖతః వెలువడిన వాక్కే ఫలప్రదాలు. శిష్యప్రశిష్య పరంపరద్వారా చేర్పులూ కూర్పులతో వాక్కు విస్తరిస్తూ పోతుంది. నది మొదట చాలా చిన్నదిగా వుండి విస్తరిస్తూ పోయినట్లే సూక్ష్మస్థితిలో సూత్రంగా చిన్నిమంత్రంగా వుండి భాష్యాలు వ్యాఖ్యోపవ్యాఖ్యానాలు ఉపాంగాలు యిత్యాదిగా శాఖోపశాఖలుగా విస్తరిస్తూ బృహదాకృతిని ధరిస్తుంది. అణువే బ్రహ్మాండమౌతుంది. బీజం మహావృక్షమౌతుంది. యిదీ భారతీయపరంపర.

సరస్వతి విద్యా దేవతేకాదు. సరస్వతి అనే నది కూడా వుంది. వాక్ ప్రవాహం అనే పదబంధం ప్రసిద్ధిలో వుంది. సూక్ష్మ పరిశీలన చేస్తే వాక్కు అనే పదమే భారతదేశంలో వ్యాప్తిలో ఉంది కాని లేఖనం కాదు.

వాక్కుకి లేఖనం ఉపాంగం మాత్రమే. అందుకే వ్యాసుడు చెపుతుంటే, వినాయకుడు భారతాన్ని లిఖించాడని కథ. వ్రాయసకాడు వేరు కవి వేరు. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ అని శృతి.

అక్షరం అంటే నశించనిది అని అర్థం. అక్షరం అంటే పరమాత్మ అని కూడా అర్థం. అవ్యక్తోక్షర ఉచ్యతే. పరబ్రహ్మ అవ్యక్తుడు అక్షరుడు. శబ్దబ్రహ్మ అక్షరము. (నశించనది) అని వాక్య పదీయం.

యింతకీ అక్షరం అంటే వ్రాసినది కాదు. వాక్కు మాత్రమే.

అందుకే వర్ణసమామ్నాయం – అచ్చులూ హల్లులూ శివుని ఢమరుకం నుంచి ధ్వనులుగా వెలువడ్డాయని వైయాకరణులు వర్ణించారు. అంటే అక్షరం అంటే శృతి అని అర్థమన్నమాట. వినబడేది అని అర్థమన్నమాట. మౌఖికంగా వచ్చినది వొక పరంపరగా నిలిచి వుంటుంది నిత్యసత్యంగా. లేఖనానికి ఆ శక్తి లేదు. లేఖనం అక్షరం కాలేదు. మౌఖిక మైనదే, శృతియే అక్షరం అని తాత్పర్యం.

లేఖనానికి గల నశ్వరత్వాన్ని సులభంగానే గ్రహించవచ్చు. జొరాష్ట్రియన్ మతగ్రంథం జండా అవెస్తా అనేకమార్లు నాశనం చేయబడింది. తిరిగి తిరిగి వ్రాయబడింది. అందువల్ల ఆ గ్రంథపు మూలరూపం మనకి యీనాడు అలభ్యం. యెందుకంటే లేఖనం నశ్వరం.

శృతి అక్షరం, నాశనం లేనిది. వల్లె వేయబడ్తూ ముఖతః వొక స్రోతస్సు వలె పరంపరగా వచ్చిన వేదం దాని ప్రాచీనరూపాన్ని పూర్తిగా నిలుపుకుంది. అతి ప్రాచీన ఉచ్చారణనీ, వ్యాకరణాన్నీ యథాతథంగా నిలుపుకుంది. అందుకే రాహుల్ సాంకృత్యాయన్ బుద్ధ చరియ గ్రంథం ముందు మాటలో అంటాడు. బ్రాహ్మణ ధర్మమూ వేదరాశీ చెక్కు చెదరక పోవడానికీ, దాడులకి గురికాకపోవడానికీ కారణం దాని మౌఖికతే నంటాడు.

అందువల్ల అక్షరం అంటే వాక్కు మాత్రమే. అర్థంవాక్ అనువర్తతే అని భవభూతి అన్నా, వాక్ అర్థా వివ సంపృక్తౌ అని కాళిదాసు అన్నా ముఖతః వెలువడిన వాక్కుకే ప్రాధాన్యం.

మహర్షుల వాక్కులు వరాలుగా, శాపాలుగా పరిణమిస్తాయని అనేక పురాణకథలు ఉన్నాయి. అలాగే దేవీదేవతల వాక్కుల గురించి కూడా. వాక్ శుద్ధి అనే పదం కూడా ప్రాచుర్యంలో ఉంది. చాటు సాహిత్యం ద్వారా కవులు రాజాస్థానంలో ప్రవేశించేవారు. అంటే, ఆశువుగా వెలువడే వాక్కు శ్రేష్ఠమైనది.

పోతన కూడా పలికెడిది భాగవతమట అన్నాడే కాని వ్రాసెడిది అనలేదు. రామాయణాన్ని లవకుశులు గానం చేసినట్లు రామాయణ బాలకాండలో ఉంది.

శోకః శ్లోకత్వం ఆగతః అని, వాల్మీకి నోటి వెంట ఆశువుగా శ్లోకం వెలువడినట్లు రామాయణంలో ఉంది. ఉదయన కథా కోవిదాన్ గ్రామవృద్ధాన్ అని ఉదయన కథని చెప్పడంలో నేర్పరులైన గ్రామీణ వృద్ధుల గురించి మేఘసందేశంలో కాళిదాసు ప్రస్తావించాడు. కాళిదాసు.కథలు ఆశువుగా చెప్పేవారికి గౌరవం ఉండేది. యీ ఉదయన కథ ఆధారంగానే భానుడు స్వప్నవాసవదత్త నాటకం రచించాడు. అంటే మౌఖికంగా ప్రచారంలో వున్న కథలూ గాథలే క్రమేపీ గ్రంథాలుగా ఆవిర్భవించాయి.

వేదవాక్కు అన్నారేకాని వేదలేఖనం అని అనరు. పరమాత్ముని వాచామ గోచరః వాక్కులకి గోచరించనివాడు అన్నారు. సంస్కృతంలో గద్య పద్య నాటక కర్తలందరినీ కవి అనే పిలుస్తారు. అందుకే గద్యం కవీనాం నికషం వదంతి వంటి వాక్యాలు కనబడ్తాయి అంటే గద్యం కూడా మౌఖిక లక్షణాలతో వ్రాయబడేది. శ్రవణపేయంగా వ్రాయబడేది. బాణుని కాదంబరి మహాకావ్యం గద్యమైనప్పటికీ ఛందస్సుకి గల తూగుతో శ్రావ్యంగా సాగుతుంది. తెలుగులో శివ కవి వచనాలు, వైష్ణవ వచనాలు కూడా శ్రావ్యంగా పాడబడే వంటారు.

అన్ని సంస్కృత గ్రంథాలు గురుముఖతః ప్రవచింపబడేవి. కావ్యాలైనా అంతే. స్వతంత్రంగా ఏకాకిగా కూర్చొని చదువుకోవడం అనే పద్ధతి ఆధునిక క్రైస్తవ విద్యవల్ల వచ్చింది మాత్రమే.

అందుకే శ్రీహర్షుడు తన నైషధ కావ్యంలో గ్రంథ గ్రంథులని అంటే కొన్ని చిక్కుముడులని నిక్షిప్తం చేశానన్నాడు. కఠోర అభ్యాసం ద్వారా ఆ చిక్కుముడులని విప్పి చెప్పగల పండితుల ముఖతః గురుశిష్య పరంపరగా తన కావ్యం ఆచంద్రతారార్కం నిలవాలనే ఆకాంక్ష శ్రీహర్షునిలో దాగివుంది.

యీ సందర్భంలో దిలాస్ట్ మొగల్ గ్రంథంలోని వొక సంఘటన గుర్తుకు వస్తోంది. బ్రిటీషు వారు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామాన్ని అణచివేసి, ఢిల్లీ పట్టణాన్ని మొత్తంగా ధ్వంసం చేసేశారు. యీ విధ్వంస కాండలో అభిమానులు భద్రపరచిన గాలిబ్ కవిత్వ గ్రంథాలూ పూర్తిగా నాశనమయ్యాయి.

అప్పుడు గాలిబ్ నిరాశలో మునిగిపోయాడు. యీలోగా మరుభూమిగా మారిన ఢిల్లీ పురవీధిలో వొక గొంతు శ్రావ్యంగా వినబడింది. నిరుపేద ఫకీరు వొకడు గాలిబ్ గీతాన్ని ఆలపిస్తూ వస్తున్నాడు. గాలిబ్ కళ్ళలో ఆనందాశ్రువులు నిండాయి. మరి గాలిబ్ గజళ్ళు అంటే సూఫీ వేదాంతపు శ్రుతులే.

అంతా వాక్కే. ముఖే ముఖే సరస్వతీ అన్నది అందువల్లనే. గురువుని త్రిమూర్తులుగా ఆరాధించింది అందువల్లనే. వాక్కే విద్య.

మరి లేఖనం సంగతి ఏమిటి? చతుష్షష్టి కళలలో లిపి జ్ఞానం వొకటిగా చెప్పబడింది. లిపి అనేది ప్రత్యేక కళ. అంతేకాని లిపి విద్యలతో అవినాభావ సంబంధం కలది కాదు. లిపి తెలియక పోతే విద్యావంతుడు కాకుండాపోడు. త్వామాలేఖ్య ప్రణయకుపితాం అనే మేఘసందేశ శ్లోకంలో ప్రియురాలి రూపాన్ని ప్రియుడు లిఖించినట్లు వర్ణించబడింది. యిక్కడ లేఖనమంటే చిత్రకళ. చిత్రకళకి లేఖనానికి అవినాభావ సంబంధం వుండేది. చిత్ర లిపిని గురించి కూడా మనం వింటాం. లేఖకులూ, వ్రాయస గ్రాండ్రూ వృత్తిపనివారు మాత్రమే. కాని లిపి అనేది కళ స్థాయి నుంచి నైపుణ్యం స్థాయి నుంచి విద్యస్థాయికి యెదగలేదు, వాక్కుదే అగ్రతాంబూలం. వాక్కే విద్య. శృతే విద్య.

అందుకే వాగ్గేయకారులు యెందరో అవతరించారు పుణ్యభూమిలో. గద్దర్, గోరటి వెంకన్న వంటివారికి గొప్ప పేరు ప్రఖ్యాతులు లభించడానికి కారణం వారు వాగ్గేయకారులు కావడమే. కమ్యూనిస్టులు కూడా వాగ్గేయకారులకే ప్రాధాన్యం యిచ్చారు. వారినే ప్రజాకవులని పిలిచారు లేఖనానికి ద్వితీయ స్థానం యిచ్చారు. దీనికి వైదిక సంప్రదాయమే మూలం. వైదిక సంప్రదాయంలో శబ్ద ప్రమాణం గొప్పదిగా చెప్పబడింది. శబ్దమంటే ఆప్తవాక్యం. అంటే ఆత్మీయులు చెప్పిన మాట అని అర్థం. వేదమన్నా అదే. పెద్దలమాట చద్దిమూట అదే వేదం, అదే శబ్ద ప్రమాణం.

ఆధునికులలోనూ, కమ్యూనిస్టులలోనూ వేదజ్ఞానము పట్ల ఆసక్తి నశించింది. కాని భారతదేశంలో వేదమూ, వేదజన్యములైన పురాణ ఇతాహాసములూ బహుళ వాగ్రూపంలో విస్తరించి వున్నాయి. వీటితో ఆధునికులందరకీ సంబంధం తెగిపోయింది. విశ్వవిద్యాలయ విద్య, పరీక్షలూ, గ్రంథాలయాలూ మౌఖికంగా ప్రవహిస్తూ వచ్చిన వేదసరస్వతితో సంబంధాన్ని తెంచివేశాయి. దానివల్ల ఆధునికులు ఉభయభ్రష్టులయ్యారు. మూలంతో సంబంధం తెగిపోయి మోడులుగా మారారు. యీ శూన్యమే నేటి సాహిత్యాన్నీ వాఙ్మయాన్నీ ఆవరించి వుంది. అందుకే నేటి సాహిత్యం యింత అథమస్థితిలో వుంది.

## ఉపసంహారం

భారతమాత పుత్రులలో అగ్రగణ్యుడూ, మహోదారుడూ అయిన గాంధీ నిర్యాణం వల్ల మన దేశమొక్కటే గాక, యావత్ప్రపంచం యెంతో నష్టపోయింది. విశేషించి దారుణమైన యీ హత్యకు భారతీయుడే కారకుడు కావడం మనమందరం మరింత సిగ్గుపడవలసిన విషయం. ఈ కళంకాన్ని తుడిచి వేయాలంటే భారత ప్రజలందరూ సత్యం, అహింస అనే లక్ష్యాలకు యితోధికంగా అంకితం కావాలి.

యిదీ కంచి శంకరాచార్య శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారి హృదయం. యిది సనాతన వేద వాక్కు.

గాంధీ మహాత్ముడు భగవంతుని అనంత నామరూపాలను భారతీయ బహుళత్వంలో వీక్షించి ఆరాధించిన పరమ భాగవతుడు. ఈశ్వర్ అల్లా తేరే నామ్ అంటూ పురుషోత్తముని సహస్రనామములను జపించి తరించిన తపస్వి.

గాడ్సే అందామా? ప్రచ్ఛన్న క్రైస్తవుడైన హిందూవాది.

కమ్యూనిస్టులు, హేతువాదులు, సోషలిస్టులు, దళితవాదులు చివరికి క్రైస్తవ సామ్రాజ్య వాదులు కూడా గాడ్సేకి ఆగ్రహాన్ని తీసుకురాలేకపోయారు. కారణం వారి అభిమతముతో గాడ్సేకి ఏకాభిప్రాయమున్నది. వారందరూ పాశ్చాత్య క్రైస్తవ భావ ప్రేరితులే. అందుకే సత్యం వొకటే, మేము చెప్పినదే మతం,. మామార్గమే ఏకైకమార్గం అన్న ఏకశిలాసదృశ సిద్ధాంతాన్ని అనుసరించారు. బహుళత్వాన్ని వ్యతిరేకించారు. అందువల్ల యీ హిందూ నియంతకి వారిపై కోపమిసుమంతైనను కలుగలేదు. అందుకే అంబేద్కర్ వంటి మేధావులు గాంధీ హత్యకు స్పందించనేలేదు. యిది మనకు మేధావులపై హిందూవాదం ప్రభావాన్ని అర్థం చేసుకోవడానికి పనికివస్తుంది.

ఏకం సత్ విప్రా బహుధావదంతి వొకే సత్యం. బహుళ వ్యాఖ్యానములు, బహుళ నామరూపములు. యీ బహుళత్వాన్ని శాంతి అహింసలతో ఆవాహన చేయడమే సనాతన ధర్మం. అదే పురాణ వేదసారం. తత్సత్.

# వ్యాస శంకరీయం

రూపం రూప విసర్జితస్య భవతో ధ్యానేన యత్ కల్పితం
స్తుత్యా అనిర్వచనీయతాఖిలగురో ర్దూరీ కృతా యన్మయా
వ్యాప్తిత్వం చ నిరాకృతం భగవతో యత్తీర్థ వాసాదినా
క్షంతవ్యం జగదీశ తద్వికలతా దోషత్రయం మత్కృతం

పరమేశ్వరా నిర్గుణ నిర్వికారా సర్వాంతర్యామీ క్షంతవ్యుణ్ణి

పురాణ కల్పన ద్వారా నేను మూడు విధములైన దోషములకు పాల్పడితిని.

రూపములేని పరమాత్మునికి నామరూపములను కల్పించాను. బ్రహ్మ విష్ణుమహేశ్వరులును, అనంతదేవీ దేవరూపములను కల్పించాను. యిది మొదటి దోషము.

నిర్వచనములకు అందని, వాచామగోచరుదు పరమాత్మ. అట్టి పరబ్రహ్మము నకు గుణగణములను కల్పించాను. తద్వారా అనిర్వచనీయతను దూరం చేశాను. యిది రెండవ దోషము.

సర్వాంతర్యామి, సర్వవ్యాపియై విరాజిల్లువాడే సర్వేశ్వరుడు. ఆయనను తీర్థక్షేత్రములలో వెలసిన దైవముగా అభివర్ణించాను. అట్లు చేయుట వలన సర్వవ్యాపి, సర్వాంతర్యామి యను సత్యమును మరుగుపరచాను. యిది ముచ్చటగా మూడవ పాపము.

సర్వజనమనోరంజకములైన పురాణ పుణ్యకథల అద్భుత చిత్రణ కొరకు యిట్టి దోషములకు సాహసించాను. క్షమించుము అని సాక్షాత్తూ వేదవ్యాసమహర్షి పురాణములు సంపూర్ణమైన తరువాత పశ్చాత్తాపముతో సర్వేశ్వరుని స్తుతించారు.

పురాణవేద స్మర్త రాణి శివశంకరశర్మ యిట్టి దోషత్రయమునకే పాల్పడుచు, వేదవ్యాసునితో గొంతు కలిపి భవహరుని వేడుకొనుచున్నాడు.

క్షంతవ్యం జగదీశ తద్వికలతా దోషత్రయం మత్కృతం.

# విష్ణుమాయ

గంగ ప్రవహిస్తోంది. చిన్న బిందువులా ప్రారంభమైన గంగ సూక్ష్మంలోనే మోక్షమన్న తత్వరహస్యాన్ని గానం చేస్తున్నట్లు ప్రవహిస్తోంది.

గంగాతరంగ భంగిమల్ని గంగాహృదయ స్పందనల్ని మంత్రశక్తితో తన తంబురాలోకి ఆవాహన చేస్తున్నాడు నారదుడు.

నిజానికి నారదుడు గొప్ప సంగీత విద్వాంసుడేమీ కాదు. అతడి కంఠం కఠోరం, వీణ అపశ్రుతుల నిలయం. పేరుకి మాత్రమే మహతి. నిజానికి దానిలో మహత్తేమీ లేదు. కాని గానం చెయ్యాలనే తీవ్ర తపన నారదుని వేధించేది.

నిజమునకతడొక శాపగ్రస్తుడు. కాలు నిలువక ముల్లోకములూ-ద్యావాపృథువులూ నిలకడ లేకుండా తిరుగుతూనే వుంటాడు. అతనిని నిలిపి వుంచేదేదీ లేదు.

నిజానికి నారదుని శరీరములో నిశ్చలమైనదేమీ లేదు. అతని దేహములోని అణువుల మధ్యనే బాంధవ్యం లేదు. ఆ అణువులన్నీ వేగంగా విడిపోయి మరుక్షణంలో వొక రూపం ధరిస్తాయి. మళ్ళీ యీ నిలకడలేనితనం కొనసాగుతూనే వుంటుంది.

యీ విచ్ఛిత్తి వల్ల అతని దేహం నుండి వింత వింత ధ్వనులు వెలువడ్తాయి. అతని కంఠం నుండి అనుకోకుండానే కొన్ని స్వరాలు వెలువడ్తాయి. అవి జంతువులకి కాని, మానవులకి కాని, దేవతలకి కాని రుచించేవి కావు.

యీ నిరంతర రూపాంతరీకరణలకు కారణమేమిటి?

నారదుడు అడగకూడని ప్రశ్న అడిగాడు. ఓ పరాత్పరా విష్ణుమాయ అంటే యేమిటి దాని అంతం చూడాలని నేను అనుకొంటున్నాను అని ప్రశ్నించాడు. తక్షణమే అతడు నదిలో పడి కొట్టుకుపోయాడు.

నారదుడు స్త్రీగా జన్మించాడు. మహారాజుని వివాహమాడింది నారది. యీ నారదికి తన పూర్వజన్మ రహస్యం తెలియదు. సకలభోగాలు అనుభవించింది. పుత్రుల్ని కంది, చివరికి మహాసంగ్రామంలో భర్తనీ పిల్లల్నీ సకల సంపదల్నీ

కోల్పోయింది. తీవ్రదుఃఖంతో రోదిస్తూ నదిలో దూకి మరణించి తీరానికి కొట్టుకువచ్చింది.

నారది శరీరంలోని సకల అణువులూ విచ్ఛిన్నమై మళ్ళీ వొకటై మరో రూపాన్ని ధరించాయి. మళ్ళీ పురుషరూపం.

నేనెవర్ని అని అడిగిందా పురుష దేహం. నారదా నీ ప్రశ్నకి సమాధానం యిచ్చేవారెవరూ యీ ప్రపంచంలో లేరు. నువ్వు ప్రశ్నించే కొలదీ ఆ ప్రశ్నలే నీ శరీరాన్ని మరోసారి విచ్ఛిన్నం చేసివేస్తాయి. విష్ణుమాయ అంటే యేమిటి అని ప్రశ్నని సంధించావు. దానికి తగిన ఫలాన్ని అనుభవించావు.

ఆకాశంలోకి నక్షత్రాలలోకి చూస్తూ నువ్వు వేసే ప్రశ్నలు తారాజువ్వల్లా వెనక్కి తిరిగి నిన్నే చీల్చేస్తాయి.

యీ ప్రపంచంలో అశాంతితో పరిభ్రమించడం తప్ప నీకు దిక్కులేదు. నాలుగు దిక్కులున్నా నువ్వు దిక్కులేనివాడివే. యిదే విష్ణుమాయ అని ఆకాశవాణి పలికింది.

అతని వీణ వినరాని అపశ్రుతుల్ని పలికింది.

అతని హృదయం అపస్పందనలతో హోరెత్తిపోయింది.

నారదుడు వొక అనాథ వలె అనంత ఆకాశంలో పరిగెత్తాడు.

యింతకీ నారదుడంటే యెవరు? నారదుడంటే అశాంతి, అనిశ్చితి, కాలం ఆద్యంతాల్ని కనుగొనాలనే తపన. ఇంద్రియ వాసనల మూలాన్ని కనుగొనాలనే తపస్సు.

దైవంలోకి చొచ్చుకుపోయి మూలాల్ని కనుగొనాలనే దహించే వేదన.

యిలా యెన్నెన్నో చెప్పవచ్చు. కాని నారదుడెవరు అనే ప్రశ్నకి సమాధానం దొరకడం కష్టం. యెందుకంటే నారదుడెవరు అని ప్రశ్నించేలోపే అతడు వేరే రూపంలోకి పరకాయప్రవేశం చేసివుంటాడు.

నారదుడెప్పటివాడు యెక్కడివాడు అనే ప్రశ్నకు సమాధానం లేదు.

నారదుడు సృష్టికి ముందు అవ్యక్తంగా వున్నాడు. ప్రళయ సమయంలో మళ్ళీ అవ్యక్తమై నిలుస్తాడు అంటాడు సాంఖ్యవేత్త. కపిలమహర్షి.

నారదుడు సృష్టికి ముందు ఈశ్వరునిలో వున్నాడు. ప్రళయంలో బ్రహ్మ నిశ్వాసమై పరాత్పరునితో లయిస్తాడు అంటారు వేదాంతులు.

కాని యెవరూ చెప్పలేనిది వొకటే ఓం శాంతి శ్శాంతిః అంటూ, శాంతి కోసం తపించే నారదునికి యెప్పుడూ అశాంతి సంచారం యేమిటి?

ముల్లోకాలలో కాలుకాలిన పిల్లిలా తిరుగుతూ, అతడు అన్వేషించేదేమిటి?

నారదుడు అంటే జలమును యిచ్చువాడు అని అర్థం.

జలమే అతడు. నీటికి నిలకడలేదు. గంగకి నిశ్చలత లేదు.

సకల మానవ పాపాల్నీ తనలో లయం చేసుకొని, నురగల చిరునవ్వుల్ని చిందుతూ ప్రవహిస్తోంది గంగ. గంగని ఆవాహన చేస్తున్నాడు నారదుడు. పేరులోనే గంగాజలాన్ని నింపుకున్న నారదునికి దాహం దాహం దాహం తప్ప మరేదీ లేదు. అతడు తన దాహాన్ని తీర్చుకోలేడు. యితరుల తృష్ణని యెలా శాంతపరచగలడు?

నారదుడు, నారాయణుడు పేరులోనే కాదు అర్థంలోనూ సామ్యం వుంది. యిద్దరి పేర్లలోనూ గంగాజల ఆర్ద్రత వుంది. నారదుడు భక్త పుంగవుడు. నారాయణుడు భక్తవత్సలుడైన భగవానుడు అని మునులు అంటారు. అసలు భక్తుడెవరు భగవంతుడెవరు గంగ అన్నా భాగీరథీ అన్నా పేరులోనే మార్పు. తరంగాలూ, బుద్బుదాలూ, సుడిగుండాలూ అన్నీ గంగాజలంలోని పరిణామాలే తప్ప వేరు కాదు. భగవంతుడు వేరు కాదంటారు. నారదుడూ నారాయణుడూ వొక్కరే అంటారు జ్ఞానులు.

నారాయణుడు క్షీరసముద్రంలో శేషతల్పంపై శయనించి వున్నాడు. నారదుడు భగవన్నామ సంకీర్తన చేస్తున్నాడు. భగవంతునికి భక్తుని గానం యింపుగానే వుంటుంది. అలాగే యెవరి స్వరం వారికి సుమధురంగానే వుంటుంది. దీన్నే ఆత్మానందం అంటారు.

యింతకీ గంగమ్మతల్లికి విష్ణుపాదాలు పుట్టినిల్లు. శివుని జటాజూటం మెట్టినిల్లు. గంగమ్మ ఉరకలూ పరుగులతో పరవళ్ళు తొక్కుతూ పుట్టినింటికి బయలుదేరింది. శివుని జటాజూటం నుండి హుషారుగా పర్వతసానువులపై సుతారంగా చిట్లి, బిందువుల్ని చింది ఆయాసంతో నురగలు కక్కుతూ పరుగుపెడ్తోంది. గంగలో యెప్పుడూ లేనంత ఉత్తేజం కనబడ్తోంది. బూడిదరంగు పత్రాలు గంగలో తేలియాడ్తున్నాయి. వేగానికి గంగాజలం వేడెక్కి ఆకులు మరుగుతున్నాయి.

అలా మరిగి మరిగి యెగసి యెగసి గంగవొక కొంగ్రొత్త ఉత్తేజకర సుగంధంతో క్షీరసముద్రంలో కలిసింది. క్షీరసముద్రం రంగూ రుచీ మారాయి.

సర్పం వొళ్ళు విరుచుకొంది. లక్ష్మి గలగలలాడింది. నారద కంఠస్వరం ఉత్తేజంతో కొత్తరాగాల్ని ఆలాపించింది. ఆకాశయానం చేస్తున్న దేవతలు రోదసిలో నాట్యం చేశారు.

విష్ణుమూర్తిలో నూతన ఉత్తేజం, ఉద్వేగం కలిగి వినూత్న అవతారం యెత్తాలనే కోరిక కలిగింది. ప్రకృతి పులకించింది. రజోగుణం హెచ్చింది.

యింతటి మార్పుకి కారణమేమిటి? యింతటి ఉత్తేజానికి హేతువేమిటి? గంగలో మరుగుతూన్న పత్రాలేమిటి?అని దేవతలూ, రుషులూ ఆశ్చర్యచకితులయ్యారు. అదే సమయంలో తులసీదేవి స్వగతం సాగుతోంది.

ప్రకృతిలో కెల్లా నేనే పవిత్రమైన పత్రాన్ని. సాక్షాత్తూ నారాయణుడు దొంగగా రుచి చూసిన ఆనంద రహస్యాన్ని నేను. శ్రీమత్ భాగవతంలోని చీకటి అధ్యాయాన్ని, సాక్షాత్తూ విష్ణుమూర్తి నాపతి వేషాన్ని ధరించి నా భర్త మాటల్నీ, హావభావాల్నీ అనుకరించి నన్ను వశపరుచుకొన్నాడు. జగన్నాటకసూత్రధారి, మాయాలీలాలోలు డాయన. అనంతుని హృదయంలోని అంతుబట్టని గుప్తమంత్రాన్ని నేను. అందరి గృహాల ముందు నిలిచి అందరి రహస్యాల్ని లోపలికి పీల్చుకొని దాచుకొని భరిస్తున్న తులసీమాతని. నరనారాయణుల సరిహద్దుని.

సరే నాగుణగణాల గోల సరే. ఉత్తేజకరమైన యీ కొత్త పత్రం యెక్కడిది. యేదేశానిది. అని మధనపడింది తులసి. విష్ణువుని కూడా చిందులు వేయిస్తున్న ఆ నూతన పత్రాలని చూసి, తులసి పత్రాలు వణికాయి. విష్ణునాభిలోని పద్మపత్రాలు కూడా యించుక చలించాయి.

పద్మాసనాసీనుడైన వృద్ధుడు బ్రహ్మగారి నాలుగు ముఖములూ యేకకాలంలో ఆశ్చర్యచకితములయ్యాయి. వేదగానాన్ని నిలిపివేశాయి. గంగని సంబోధిస్తూ ప్రశ్నని సంధించాయి చతుర్ముఖములు.

ఆనందతరంగా సంగీతమృదంగా చంచలాంతరంగా గంగా యేమిటా పత్రం యెక్కడిది యేలోకానిది యేకాలానిది క్షీరసాగరపు రంగునీ రుచినీ హఠాత్తుగా మార్చివేసిన యీ పత్రంలో దాగిన ఆయుర్వేదమేమిటి? దిగ్గజాలనీ భూభారాన్ని మోసే ఆదిశేషువుని కూడా ఉత్తేజపరిచిన యీ పత్ర విశేషములో దాగిన విశేషమేమి?

మా పితృపాదులనే హృదయపు తులసికోటలో బంధించిన తులసీదళాల మహత్తునే చిన్నబుచ్చిన యీ నవీన దళం యేమిటి? యిది త్రిలోకాలలో యేలోకానికి చెందినది అని ప్రశ్నించాడు విరించి.

అనంతమైన నా అడుగుజాడల నుండి పురాణ కథా స్రవంతి వలె జనించి, ప్రవహించిన మానసపుత్రికారత్నమా, సాగర ముఖముకాని స్వతంత్ర నదీ ప్రవాహమా తండ్రిని పుత్రులు తరింప జేస్తారంటారు. నీవు పుత్రికవై లోక మాలిన్యాన్ని కడిగివేశావు. ఉపనిషత్తువలె నిలకడగా ప్రవహించే నీలో యీ ఉత్తేజం ఏమిటి? కిన్నర కింపురుషుల్ని కూడా నాట్యం చేయిస్తున్న యీ సుగంధభరిత పత్రం యేమిటి? యీ పత్రపు కులగోత్రాలేమిటి? అని ప్రశ్నించాడు నారాయణుడు.

సహస్రశీర్షా పురుషః అని ఋగ్వేద మంత్రములతో గానం చెయ్యబడిన వేదవేద్యా పితృపాదా యీ పత్ర రహస్యాన్ని చెప్తున్నాను విను. దీనిని భూలోకవాసులు తేయాకు అని పిలుస్తారు అని పత్రనామధేయాన్ని వచించింది గంగ.

తేయాకు అని అప్రయత్నంగా వీణను మీటాడు నారదుడు. తేయాకు తేయాకు హర హరాతేయాకు అని శివుని చుట్టూ నాట్యం చేశారు ప్రమథ గణం. తేయాకు ఇంద్రియోద్దీపనం ఇంద్రునకు అని నాట్యం చేశారు అప్సరసలు.

సోమరసమును మించు తేయాకు రసమును
గ్రోలి మత్తెక్కెరా మా మానసంబులే.
వేదగానము మించు రుచిని వెలిగ్రక్కెరా
తేయాకు మాధుర్యమేమి చెప్పుదుమురా.

అని స్వర్గస్థులైన సోమయాజులు గానం మొదలుపెట్టారు.

ఈ తేయాకుని దానవుల కంట బడకుండా జాగ్రత్త పడమని దేవేంద్రుడు సురగణాన్ని హెచ్చరించాడు. ఈ పత్రము అసురుల చేత చిక్కిన పక్షంలో, అసురగణం తీవ్ర ఉత్తేజంతో చెలరేగి దేవతలని హింసలకి గురి చెయ్యవచ్చు. మళ్లీ సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే దిగివచ్చి తనశక్తినంతా ధారపోస్తేగాని పరిస్థితి చక్కబడకపోవచ్చునని నిర్జరులు భయకంపితులయ్యారు.

యింతటి ఉద్రిక్త పరిస్థితులకి దారితీసిన విచిత్ర పత్ర రాజము యెక్కడి నుంచి యేవిధముగా గంగలో సంగమించినది అనే జిజ్ఞాస చెలరేగింది అందరిలో.

ఉప్పొంగే కుతూహలాన్ని చూసి, రుషులకీ, దేవతలకీ, కిన్నరకింపురుషులకీ తేయాకు ఉపాఖ్యానాన్ని జలతరంగిణీ నాదంలో ప్రవచించింది గంగ.

## తేయాకు ఉపాఖ్యానం

ఈ తేయాకు తన స్వచ్ఛ స్రవంతీ కాయమును అంటి సుగంధ భరితము చేయుటకు వినాయకుడే కారణమని జాహ్నవి చెప్పింది.

వొక భక్తుడు వినాయక పూజలో పొరపాటున తేయాకు పత్రిని కూడా జల్లాడు. ఆ తేయాకు పత్రములు గజాననుని మూర్తినుండి జారి నాలో పడినాయి అని వివరించింది గంగ.

యింతకీ వినాయకుడు ఎవరు అని ప్రశ్నించాడు విష్ణువు. విఘ్నేశ్వరుడెవరో విష్ణుమూర్తికే తెలియదంటే ఆశ్చర్యపోయింది గంగమ్మ తల్లి. పవిత్రకర్మ భూమిలో నేడు అందరి ఆరాధ్యదైవం ఆయన అని స్పష్టం చేసింది. యెవరి అంశ నుండి యితడు జన్మించాడు యెప్పుడు జన్మించాడు యెవరి గర్భవాసాన ఉద్భవించాడు అని మళ్లీ ప్రశ్నల వర్షం కురపించాడు లక్ష్మీపతి.

వినాయకుడు స్వయంభువు. యే స్త్రీ గర్భములోనూ అతడు వసించలేదు. త్రిమూర్తులలో యెవరి అంశతోనూ విఘ్న విభుడు జనించలేదు. అతడొక స్వతంత్ర అవతారం అని సమాధానమిచ్చింది నదీమాత. విశ్వవిభుడవై సర్వమూ తెలిసి యుండి అమాయకత్వమును నటించుచు, ఉత్సుకతతో ప్రశ్నించుట నీకెల్లప్పుడూ అలవాటే అని నవ్వింది జలకాంత.

త్రిమూర్తుల కంటె అతీతమైన అవతారమా అది అసంభవం అని గర్జించాడు విష్ణువు. అశక్యం అని రెట్టించాడు.

పుత్రికా రత్నమా! అతడెలా జన్మించాడు అని ప్రశ్నించింది విష్ణుపత్ని లక్ష్మి.

పార్వతీదేవిస్వప్నం సాకారమై వినాయకుడు జన్మించాడు. అతడు స్వప్నసంభవుడు అంది గంగ.

## వినాయక ఉపాఖ్యానం

పాలరాతి బొమ్మ వంటి పార్వతీదేవి స్నానం చేస్తోంది. సకల పవిత్ర నదుల జలాలను తెచ్చి దిగ్గజములు తమ కరములతో కుమ్మరిస్తున్నాయి. అన్ని నదులలోని

జలమూ పారివచ్చి వొక తటాకంగా యేర్పడింది, క్షణంలో స్వర్ణకమలములు పూశాయి. పార్వతి ఆ జలములలో హాయిగా యీదులాడింది. ఆమె పర్వతరాజపుత్రి. సకల నదీనదములూ పర్వత సంజనితములే, పార్వతి తోబుట్టువులే. అవి ప్రవహించే నగజములే. అందుకే సోదరి సుఖస్నానమునకు అవి సహకరించుచున్నవి.

యిట్టి ప్రశాంత సమయములో హిమతనయ హృదయములో చల్లని వూహలు చెలరేగినవి. ఆ అందమైన వూహలకి రూపమిచ్చు ఆశ కలిగినది. తన వొంటి నలుగుపిండితో అందమైన శిల్పమును రూపొందించినది. ఆ బొమ్మ ముఖమున ముఖము పెట్టి వూపిరులూదినవి. శిశువు కదిలినది ఏడ్చినది నవ్వినది కేరింత లాడినది.

ఇంతలో పార్వతీ వల్లభుడు రానే వచ్చాడు. నగజాత నగ్న సౌందర్యమును తిలకించు వాంఛతో వచ్చాడు. శిశువు ఆయన పాదములకు అడ్డము పడినాడు. యెవరు నువ్వు అని భోళాశంకరునే ప్రశ్నించి నాడు. యీ యేకాంత సృష్టిలో పురుష ప్రమేయము లేదు. యీశ్వర ప్రమేయము లేనేలేదు. శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదంటారు. అట్టి రుద్రుని ప్రమేయము యించుకైనను లేకనే శిశువు జన్మించి మాటలు నేర్చి శంకరునే త్వం కః అని ప్రశ్నించుచున్నాడు. యిది దేవీ మహాత్మ్యం.

క్రుద్ధుడైన రుద్రుడు యెవరీ శిశువు అని పార్వతిని నిలదీశాడు. నా స్వప్నములలో జన్మించిన మహా కావ్యం యీ శిశువు అని ఆదిశక్తి సమాధానం చెప్పింది.

వోహో యిది వట్టి పిచ్చివూహలలోంచి పుట్టిన బుద్బుదమా అని శూలంతో శిశువు తల తెగనరికాడు దక్షయజ్ఞ విధ్వంసకుడు.

ఆడదానికి స్వపురుషునే విస్మరించేంత మైమరపు తగినది కాదు. అది పురుషధిక్కారం అని లయకారుడు భావించి శిశువుని వధించాడు. స్త్రీ కల్పనలు ఆకారం ధరించి భూమిమీద యధేచ్ఛగా సంచరించడం పురుషునికే ప్రమాదకరం అని ప్రమధాధిపతి భయగ్రస్తుడయ్యాడు.

పర్వతపుత్రి నేలమీద పడి రోదించింది. ఆమె కళ్ళ వెంబడి నీరు ధారాపాతమై, ఆదిశక్తి కన్నీటి వరదలో ముక్కంటి కొట్టుకుపోయాడు. పాహిమాం జగన్మాతా అని చేతులెత్తి ప్రార్థించాడు. అమ్మలగన్న అమ్మ వన్నాడు. నీ అండం నుంచే బ్రహ్మాండం రూపొందిందని స్తుతించాడు. మనమిద్దరం వాగర్థాల వలె అర్ధనారీశ్వరులమని మహాకవి వాక్కుని గుర్తుచేశాడు. పాహిమాం భక్తవత్సలే అని ప్రార్థించాడు.

మహాశక్తి స్వరూపిణి జగన్మాత శాంతించింది. అసహాయుడైన శివుణ్ణి వుపద్రవం నుంచి బయటకు లాగింది.

దిగ్గజాన్ని ఆహ్వానించింది ఓ గజరాజమా! భక్త పుంగవుల జాతినీది. నీ జాతికి చెందిన గజేంద్రుడొకడు భక్తితో మెప్పించి, సాక్షాత్తూ పురుషోత్తమునిలో లయమయ్యాడు. నీ చర్మాన్ని వలిచి శివునికి దానం చేసిన ఉదారహృదయుడవి. అట్టి సద్బుద్ధి గల జాతికి చెందిన గజరాజా! నీ శిరస్సుని నా శిశువుకి దానం చెయ్యి. నీ మస్తకం ఆచంద్రతారార్కం పూజలు అందుకుని ధన్యమౌతుంది అని కరిని వేడుకొంది పార్వతీదేవి.

గజముఖమూ మానవ శరీరముల మిశ్రమంగా అలరారుతూ ఆ శిశువు జీవులన్నిటికీ, కనువిందు చేసింది.

మానవుడు కూడా పశువే. అందుకే శివుణ్ణి పశుపతి అన్నారు. నరుని యధార్ధ స్వభావాన్ని జ్ఞప్తికి తెస్తున్నందువల్లే గజాననుడు పూజలందుకుంటున్నాడు.

## తేయాకు పూజ

మహా మహిమాన్వితుడైన విఘ్నేశ్వరుని యుగాలుగా ఆరాధిస్తున్నారు జనులు అన్నాడు నారద మహర్షి.

అట్టి పక్షములో నాకెందుకు యీషణ్మాత్రమైనను తెలియరాలేదు అని నిలదీశాడు బ్రహ్మ. అదే ప్రశ్నని సంధించాడు విష్ణువు.

విధాతా నీకు కొన్ని మానవ యుగములు వొక కునికిపాటుతో సమానం. నీవు యోగనిద్రలో వుండగా లక్షల సంవత్సరాలూ కోట్ల రుతువులూ పునరావృత్తి చెందాయి. అని జ్ఞప్తికి తెచ్చింది లక్ష్మీదేవి.

వృద్ధాప్యం వల్ల నాకు మైమరపు పెరిగింది. మా ఆవిడ కూడా ప్రతిదినమూ వెక్కిరిస్తోంది. యింతకీ యిప్పుడు యే యుగం అని అడిగాడు వృద్ధ విరించి.

గంగ గలగలా నవ్వింది. మీరేమో పండు ముదుసలులు,. మీ చదువులూ పాత చదువులు మీ వేదాలు ఎప్పుడో మూలపడ్డాయి. మీరే తీరిగ్గా చదువుకోవాలి వాటిని. నేటికాలాన్ని కలియుగం ప్రథమపాదం అని పిలుస్తున్నారు సనాతనులు అంది నదులరాణి.

ఆ ముసలాయన్ని తరువాత వెక్కిరించవచ్చు. యింతకీ యీ తేయాకు నీకెలా వచ్చిందంటే, యీ శాఖాచంక్రమణా లేమిటి? యీ ఉపాఖ్యానాలేమిటి? నీ కథా కథన ప్రతిభను చాటుకోవడానికా? అని వెక్కిరించింది వాణి, విసురుగా వీణను పక్కకు పెట్టి. భర్తను వెక్కిరిస్తే ఆదికాంతకు కోపం పొడుచుకు రాదూ మరి. యింతకీ రామాయణంలో పిడకల వేటలా త్రిమూర్తుల మధ్యకి యీ కొత్త వింత దేవుడి కథను తీసుకువచ్చావెందుకు వున్న నాయకులు చాలరన్నట్లు యీ వినాయక వ్రతకథయెందుకు అని సాగదీస్తూ అడిగింది వృద్ధమాత. యెంతైనా పాతతరం ఆడపడుచుకదా కొత్త దేవతలూ, ఆచారాలూ వింత పోకడలుగా కనిపిస్తున్నాయి ఆమెకి.

యీ వినాయక వ్రత వృత్తాంతానికీ తేయాకు రాకకీ సంబంధం వుంది. అందుకే వినాయక జనన వృత్తాంతాన్ని చెప్పాను. అంతేకాని మీ దైవత్వాన్ని చిన్నబుచ్చడానికి కాదు అంది గంగ.

వినాయకుడి నవరాత్రులనే పేరుతో వైభవంగా ఉత్సవాలు జరుపుతారు. అప్పుడు వివిధ పత్రులతో పూజలు జరుపుతారు. ఆ అర్చనే కొంపముంచింది. పూజా పత్రాలలో పొరపాటున తేయాకు అనబడే వొక పత్ర విశేషం కలగలిసి పోయింది.

నేనూ పార్వతమ్మా కలిసి గజాననునితో ఆటలాడుకుంటున్నాం. అతడు సర్వదా శిశువే. పతిదేవుడు మహాదేవుడు నవ్వుతూ చూస్తున్నాడు. అప్పుడు ఆ వినాయకుని శిరస్సుమీద భక్తులు జల్లిన పూజాపత్రిలో కలగలసిపోయివున్న ఈ పత్రములు- తేయాకులు నామీద పడ్డాయి. వీటి ఘుమఘుమలకి నాకే మత్తెక్కింది. ఆ సుగంధాన్ని ఆఘ్రాణిస్తూ నేను పితృపాదుల వైకుంఠ వాసమునకు పరుగులు తీశాను. అంటూ పిట్టకథలో దాగిన పత్ర రహస్యాన్ని విప్పి చెప్పింది గంగాతరంగిణి.

త్రిలోక సంచారీ నిరంతర చలన శీలీ నారదా జగన్నాటక సూత్రధారినైన నాకూ జగత్తుకూ మధ్య వారధిగా నిలిచావు. విశ్వములోని విషయములన్నీ పూసగుచ్చినట్లు చెపుతూ విష్ణువుకే వార్తాహరుడిగా నిలిచిన వాడివి. సూక్ష్మస్థూల ప్రపంచముల గురించి సుదూర బ్రహ్మాండముల గురించి వాల్మీకిని మించిన వర్ణనాశక్తితో గానం చేస్తుంటావు. అట్టి నీవు యీ విచిత్ర పత్రమును గురించి యేల తెలపలేదు? అని ప్రశ్నించాడు చక్రధారి.

మాయామయా శ్రీహరీ నీవు నాపై కురిపించే ప్రశంసలన్నీ గగనకుసుమాలే. నానోట సత్యాన్ని పలికించాలనే తపనతో నీవు నాకు లేని సద్గుణములను ఆరోపించినావని తెలుసు. నామాటలు తడబాటుతో కూడుకొన్నవి. నా వ్యక్తీకరణ శక్తి అల్పమైనది. బ్రహ్మాండములంటారా అనంతమైనవి. నేను బలహీనమైన కల్పనాశక్తిని ఆశ్రయించి విశ్వసంచారం చేస్తుంటాను. నా మనస్సు అశాంతితో శాపగ్రస్త పిశాచమువలె వినువీధులలో పరుగెడ్తూంటుంది. నా మనోవేగము దూరముల నధిగమిస్తూంటుంది.

కాని నాకీ మధ్య మానవలోకముపై ఆసక్తి సన్నగిల్లినది. చీమలకదలికలో వొక లయ వున్నది. సూక్ష్మజీవుల ప్రపంచములో వొక పొందిక వున్నది. యీ మానవజాతి వున్నదే యిది పిచ్చెక్కిన శునకముల గుంపు వలె తలొక దిక్కు వ్యర్థవేగంతో పరుగెడ్తోంది. దీని కదలికలోని పరమార్థమేమిటో నాకు అవగతం కాలేదు.

మనుష్య లోకంతో సంబంధమును విడనాడుట వలన వారు ఆదరించు యీ పత్రమును గురించి కూడా నాకు యెక్కువ తెలియరాలేదు.

కాని యిటీవలే యాదృచ్ఛికంగా గమనించితిని. యీ పత్రము మర్త్యలోకములో టీ, చాయ్ అను ప్రసిద్ధ నామములతో అలరారుచున్నది. సర్వే సర్వత్రా మరుగుతూ కనబడ్తున్నది. దీని ఆవిరితోనే మేఘాలు యేర్పడ్తున్నాయని ప్రసిద్ధి. యీ ఉత్తేజకరమైన పత్రాన్ని శ్వేతముఖులు భారతదేశానికి తీసుకువచ్చారని విన్నాను. ఆ అప్రాచ్య శ్వేతముఖులు జంబూద్వీపంలోని ఆచారవ్యవహారాలనే కాదు ఆలోచనా సరళినే మార్చివేశారు. యీ సత్యాన్ని ద్రోణపుత్రుడు అశ్వత్థామ నాకు వర్ణించి చెప్పాడు అని నారదమహర్షి ఆవేదన చెందాడు.

## అశ్వత్థామ వచనములు

అశ్వత్థామ చిరంజీవి. యెప్పటికీ మరణము దరిజేరకపోవుటయనెడి తీవ్రశాపముతో అతడు కునారిల్లుతుంటాడు. అశ్వత్థామ ఉవాచ.

వీణాగానలోలా, కల్లోల నారదా యీ సుదీర్ఘ జీవితం కన్న వేరే శాపం లేదు. మరణం లేకపోవడం నిజానికి వరం కాదు, మహాశాపం. భరతభూమి

స్వరూప స్వభావాలా మారిపోయాయి. అది పేరుకే వేదభూమి. వాస్తవమునకు అదొక అప్రాచ్య ప్రపంచం.

రుషులు లేరు రుష్యాశ్రమాలు లేవు. ఉటజద్వార రోధిభిః ఆశ్రమస్త్రీల పాదముల కడ్డము పడినట్లు కాళిదాస మహాకవి వర్ణించిన లేళ్ళూ, సెలయేళ్ళూ లేవు. దుర్గంధభరితమైనవి యేవో నేటికాలపు రసాయనములూ విషవాయువులూ...

తపస్సు లేదు తత్వచర్చలు లేవు. పండిత సభలులేవు. కవికులతిలకులు లేరు. ఊహలు లేవు. ఆలోచన అనేదే లేదు.

అదొక కరిగిపోతున్న మంచు కొండ. ఇంకిపోతున్న నది. శిధిలమైపోతున్న గూడు, ధ్వంసమైన యజ్ఞవాటిక. రెక్కలు తెగిన పక్షి. యిలా యెన్ని వుపమానాలైనా అల్లుకుపోవచ్చు. కాని కాళిదాసుని సమ్మోహపరిచే వుపమావస్తువేదీ కానరాదు.

యీ చిరంజీవిత్వం నా చావుకి వచ్చింది. దినదినగండంగా వుంది అని ఆవేదన చెందాడు అశ్వత్థామ.

ఆ ద్వాపరయుగంలోనే పరలోకానికి నిరాటంకంగా వెళ్ళిపోయిన కౌరవ పాండవులే ధన్యులు అని కూడా బాధపడ్డాడు.

మహాభారత యుద్ధం వల్ల ప్రాప్తించిన వినాశనం కూడా అతనిని యింతగా నిరుత్సాహపరచలేదు. అశ్వత్థామ తన శిరోభూషణమైన మణిని కోల్పోయిన దుర్నిమిషములో కూడా యింత వేదనని అనుభవించలేదు.

సనాతన సంస్కారమును కోల్పోయిన భరతభూమి అశ్వత్థామను జీవచ్ఛవముగా మార్చినది అని నారదమహర్షి చెప్పాడు.

## త్రికాల సంచారం

త్రిలోక సంచారీ నారదా భరతభూమి దుర్గతికి కారణము యేమిటో తెలుసుకొని రమ్మని ఆజ్ఞాపించాడు విష్ణువు.

నారదుడు త్రిలోక సంచారి మాత్రమే కాదు త్రికాల సంచారి కూడా.

నారద మహర్షి వీణియను మీటాడు. అదొక విచిత్ర రాగాన్ని పలికింది. దానినుండి పలికే సుమధుర సంగీతం యేమిటో దేవతలకు గాని, కిన్నర కింపురుషులకి గాని, రుషులకి గాని అవగతం కాలేదు.

కాని అవ్యక్త గానం సుమధురం. బొంగురు గొంతు ఐనప్పటికీ యేదో అనిర్వచనీయ మధురిమ ద్యోతకమౌతోంది.

ఏమిటా సంగీతం? ఎక్కడిదా సాహిత్యం? అదియే గాంధర్వ భాషలోని సహజ మాండలికం? అని నిర్జరులు సందేహంలో పడ్డారు.

అది దేవభాష యేమాత్రమూ కాదు అని పెదవి విరిచాడు దేవేంద్రుడు.

ఆ మాటవిని మహాబుద్ధిశాలియైన బృహస్పతి ఆగ్రహోదగ్రుడయ్యాడు. ఇంద్రా! రసాస్వాదన మరచిన అమరలోక చక్రవర్తియైనను, కళా ప్రపంచములో అడుగు మోపనశక్తుడు. శిలలను ద్రవింపజేస్తున్న యీగానం స్థూలదృష్టికి అమరవాణి కాకపోవచ్చు. తత్వము విచారించినచో నిజమైన అమృత మిదే అని నారదగానాన్ని స్తుతించాడు దేవగురువు.

నారదవీణకు మహతి అను నామధేయం యిన్ని యుగములకు సార్ధకమైనది అంది సరస్వతీదేవి. నారద సంగీత శిఖరాల్ని అందుకోవాలనే తహతహతో గంగా తరంగాలు మబ్బుల్ని మీటుతున్నాయి.

యింతకీ యే వాగ్గేయ కారుని కృతి అది? యే కాలానిది? యే దేశానిది, యే భాషలోనిది.

**యే మన ఇలే తసవ్వు ఫ్**

**యే తేరా బయాన్ గాలిబ్**

**తు ఝెహంవలీ సమఝ్ తేజో**

**నా బాద్ ఖార్ హోతా**

**చింతిలెదు మాకు బ్రహ్మాండమెంతొ యిరుకు.**

**అందు గగనమ్మొక పిపీలికాండమంత.**

గాలిబ్ అనే వాగ్గేయకారుడు మధురమైన ఉర్దూభాషలో రచించినది, గానం చేసినది ఆ గజల్.

ఆ గజల్‌ని సుందర వాహనముగా మార్చుకొని గతంలోకి మళ్లిపోయాడు త్రికాల సంచార చణుడు నారదుడు.

నారదునికి భూతభవిష్యత్ వర్తమానములు ఆటబొమ్మలు. కాలక్షేపం కోసం అతడు కాలంతోనే క్రీడిస్తుంటాడు. కాలాన్ని పాచికల్లా అటూ యిటూ, యిటూ

అటూ తారుమారుచేసి ప్రహేళికగా మలచి వినూత్న కేళీవినోదములో చరిస్తాడు,. కాల ప్రవాహానికి యెదురీది గతకాలపు వారణాశిలో, భూతకాలపు భాగీరథిలో మరుక్షణం తేలియాడాడు నారద వాగ్గేయకారుడు.

అదే సమయంలో గాలిబ్ ముని పవిత్రగంగా జలములలో స్నానమాచరించి తీరం చేరుకున్నాడు. వేదగాన ప్రవాహములో నిమగ్నుడైన బ్రాహ్మణోత్తమునికి నమస్కరించాడు గాలిబ్.

చతుర్వేద పారీణా బ్రాహ్మణోత్తమా! ఈ రోజు జందాల పౌర్ణమి. కనుక శశికళా పుంజమువలె శోభించు యజ్ఞోపవీతమును ధరింపజేసి, నన్ను చంద్రకళామగ్నుని చేయండి. నన్ను తరింపజేయండి భూసురా అని ప్రార్థించాడు గాలిబ్.

వేదవిప్రుడు యజ్ఞోపవీత విశిష్టతను తెలుపు మంత్రమును పఠించాడు.

**యజ్ఞోపవీతం పరమం పవిత్రం**

**ప్రజాపతేః యత్ సహజం పురస్తాత్**

ఆహవనీయాగ్ని వలె పవిత్రుడవైన సూఫీ యోగివరా కవీంద్రా గాలిబ్ నీవు రుషివి. సాక్షాత్తూ ఆ పరమాత్మనే ప్రేయసిగా భావించి తత్వాన్ని ఆలపిస్తున్న అవధూతవి. నీ చల్లని వాక్కుల వెనుక శ్వేతముఖులపై విద్వేషాగ్నిని దాచుకున్న అగ్నిదేవుడివి. నీకంటె మరెవరు వహ్నిజ్వాలా సందోహము వంటి యజ్ఞోపవీతమును ధరించుటకు యోగ్యుడు? యిదిగో యజ్ఞోపవీతం, శత్రువులకు శరా ఘాతం అంటూ యజ్ఞోపవీతాన్ని ధరింపజేశాడు ద్విజుడు. యజ్ఞోపవీతానివి, వైష్ణవ్యగీతానివి అన్నాడు.

సూర్యునికి అర్ఘ్యమిచ్చాడు గాలిబ్. ఆ పవిత్ర క్షణములలో అరుణబింబం కేసి చూస్తూ గీతాన్ని ఆలపించాడు సూఫీ ముని.

**ఈ యజాండమ్ము లోన నశించునన్ని**

**గాలిలో దీపముట్లుండెగాదె రవియు**

అసంకల్పితంగా నారదుని వేళ్లు వీణని మీటాయి.

ధన్యుడవు గాలిబ్ విశ్వపు నశ్వరత్వాన్ని వేదనామయంగా ఆలపిస్తున్న నీహృదయమే ఆదిత్య హృదయం అని కీర్తించాడు నారదుడు.

ఉషోదయపు సూచనలైనా లేవు. అంతా గాఢాంధకారమేనన్నాడు గాలిబ్.

గురుకులాలు మూతబడ్డాయి మదరసాలు మసిబారిపోయాయి. ముషాయిరాల ముచ్చటే లేదు. గజళ్ళ సందడి లేదు. భోజరాజు ముఖవీక్షణం వల్లనే, కవిత్వం వికసించేది అనేది పురాగాథ మాత్రమే. మొగల్ సామ్రాట్టు సన్నిధిలో పామరుడు కూడా మధురమైన ఉర్దూభాషలో కవిత్వం అల్లేవాడు. పనిమంతుడైన మేదరవాడు బుట్టని అల్లినట్లు, వీరూవారననేల అందరూ మధుర కవిత్వగానం చేసేవారు. తోటమాలి కూడా కవి కోకిలయ్యేవాడు. వారందరిలో నేను వొకణ్ణి మాత్రమే.

కాని ఆ యుగం గడిచిపోయింది. సాఖి మధుపాత్రిక పట్టుకొని కాలయవనిక వెనక్కి నిష్క్రమించింది. చివరి మొగల్ చక్రవర్తి జాఫర్ భరత ఖండాన్ని విడిచిపెట్టి, సుదూరపు దేశానికి ప్రవాసం వెళ్ళిపోయాడు దిగులుగా. ఎర్రకోటపై తెల్లవాడి జండా రెపరెపలాడింది. స్వాతంత్ర్యం శిలువ వేయబడింది. వేదాంతచర్చా గోష్ఠులు ముగిసిపోయాయి. మధురమైన ఉర్దూ భాష చేదయ్యింది. అమరవాణి మృతభాషగా మారింది. ఆంగ్లభాష అధికార పీఠాన్ని అధిష్టించింది. నల్లవాడు కుక్కగా యీసడించబడ్డాడు. అతని విశ్వాసాలూ ఆలోచనలూ అన్నీ అవహేళనకు గురయ్యాయి అని ఆవేదన చెందాడు గాలిబ్‌ముని.

గాలిబ్ తన చొక్కా జేబులోంచి వొక లేఖని తీసి నారదమునికి చూపించాడు. యీ లేఖలోని సారమేమిటి? యెవరు రాసినది? నాకీ లేఖలోని భాష యేమిటో తెలియదు. అన్నాడు నారదమహర్షి.

గాలిబ్ లేఖా సారాంశాన్ని పూసగుచ్చినట్లు వివరించాడు. మునివరా! యీ లేఖ పడమటి దేశపు మేధావియైన మార్క్సు రాసినది. ప్రాచ్య తత్వశాస్త్రం కాలం చెల్లిపోయిన తత్వశాస్త్ర మట. బూజుపట్టిన సిద్ధాంతమట. పడమటి దేశాల తత్వశాస్త్రమే ప్రాచ్యదేశాలకి దిక్కూ దివాణమట. ఆయనకి సూఫీ తత్వము వేదాంతమూ ఓనమాలు తెలియవు. ఆ అప్రాచ్య మేధావికి ఆలిఫ్ బేలూ తెలియవు. అక్షరమాల తెలియదు. అందుకే క్రైస్తవ భక్తుడైన మార్క్సు వలస క్రైస్తవులు భరతఖండాన్ని జయించడమే మంచిదైందని అన్నాడు. యేటర్కీ తురక అనాగిరికుడో జయించి పరిపాలించడం కన్న, పాశ్చాత్యులు భారతదేశాన్ని లొంగదీసుకోవడమే మంచిదైందన్నాడు. అదే నాగరికతకు రాచబాట అన్నాడు అని మార్క్సు భావాలను స్మరిస్తూ వేదన చెందాడు గాలిబ్‌ముని.

గాలిబ్ మాటలు విని నారదముని ఆవేదన వ్యక్తపరచాడు. యీ మార్బు గొప్ప మేధావిలాగానే వున్నాడు. తన్నులు తినడంలో కూడా పరమార్థం వుందంటున్నాడు. తల వంచడంలో కూడా నాగరికత వుందంటున్నాడు మొత్తానికి. భారతీయులకి బానిసత్వమే మేలంటున్నాడు అన్నాడు నారదుడు.

మనవాళ్లు కూడా తక్కువ తిన్నారా. తెల్లదొరల మెప్పుకోసం వేషభాషల్లో ఆచారవ్యవహారాల్లో వికృతమైన పోకడలకి తెగబడ్తున్నారు అని బాధపడ్డాడు గాలిబ్.

గాలిబ్ మాటలు విని చింతాక్రాంతుడయ్యాడు నారదుడు. పవిత్రగంగా తీరంలో ఘోరతపస్సులో మునిగిపోయాడు. శివధ్యానంలో మునిగిపోయాడు. వారణాసీ నిలయుడైన విశ్వేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

శంకరా లోకశంకరా యీ లోకపు వ్యాకరణమే మారిపోయింది. పవిత్ర గంగాతీరాన అన్నపూర్ణాదేవితో కలిసి నర్తిస్తూ ఢమరుకం మోగించినప్పుడు ఆ ఢమరుక ధ్వని నుండి మెరుపుల వలె పిడుగుల వలె అ ఇ ఉ ణ్ ఋ లు క్ ఇత్యాదిగా వర్ణసమ్నాయం వెలువడింది. అచ్చులూ హల్లులూ వెలువడ్డాయి. నీ ఢమరుక ధ్వనిలోని శృతిలయల నుంచి, నీ భరతనాట్య పదపల్లవి నుంచి వ్యాకరణ సూత్రాల్లు ఏర్పడ్డాయి. కర్త కర్మ క్రియ విభజన కందని పూర్ణమైన స్ఫోటనాదం వెలువడింది. శబ్ద బ్రహ్మ వికసించింది. శబ్దమే లేకపోతే జగత్తే అంధకార మయం. నీవే ఆ శబ్దానికి మూలం. నీవే వ్యాకరణానివి. యీ జగత్తుకే మూలసూత్రానివి. అర్ధనారీశ్వరతత్వంతో పద పదార్థాలు వొకటేనని చాటావు.

లయకారకా, యీ విలయమేమిటి శబ్ద బ్రహ్మమా యీ అపశబ్దాలేమిటి. సూత్రధారీ యీ హీన పాత్రలెలా ప్రవేశించాయి అని శివునికి మొరపెట్టుకున్నాడు నారదమహర్షి.

విశ్వేశ్వరుడు సాక్షాత్కరించాడు. అశాంత తపస్వీ నారదా వందల సంవత్సరాల్లు క్షణాల్లా గడిచిపోయాయి. నీ వేదనలోనే అవి గతించిపోయాయి. ఆదిత్యుడు గాలిలో దీపంలా వున్నాడని ఆలపించిన గాలిబ్ యోగివరుడు యెందరో ఆదిత్యుల వలె కొడిగట్టి శతాబ్దాలు గడిచిపోయాయి.

అగణిత నక్షత్రాలు వొక వెలుగు వెలిగి ఆరిపోతున్నాయి.

మానవుడెంత అతని బుద్ధి యెంత యీ అసంఖ్యాక నక్షత్రాల మధ్య అతడొక పిపీలికానికి కూడా సాటిరాడు. విశ్వంలో అతనిని లక్షరెట్లు మించిన జీవులెందరో యేనాడో ఆవిర్భవించారు. మానవుడింకా పసివాడు. అతని జ్ఞానమెంతో అల్పమైనది.

అతడు కనుగొన్న వాటికన్న అతని ఊహాశక్తి కొద్దిదూరం ముందుకు పోగలదు. అతడు పుక్కిటి పురాణాలని తిరస్కరించినవే, అతడి వైజ్ఞానిక ఆవిష్కరణల కన్న గొప్పవి. నిజానికి అతణ్ణి విజ్ఞానం కాదు విశ్వాసమే యింకా నిలిపి ఉంచింది. హిమ ప్రళయాలలోనూ అణు ధూళిలోనూ అతన్ని కాపాడిన అదృశ్య శక్తి విశ్వాసమే.

మానవుని హేతుబుద్ధి అని పిలవబడేదంతా నేతిబీరకాయ మాత్రమే. నేతిబీర కాయ, గగనకుసుమం, వంధ్యాపుత్రుడు లాంటి పదాల్ని సృష్టించిన మానవుడు తన హేతుబుద్ధిలో హేతువు శూన్యం అనే సత్యాన్ని తెలుసుకోలేకపోవడం విడ్డూరం.

మానవుడు అణువుల మధ్య దారి తప్పిపోయాడు. కార్యకారణ సంబంధాన్ని జారవిడుచుకున్నాడు. పదార్థమంటే యేమిటో తెలుసుకోలేకపోయిన క్షుద్ర నరుడు దైవపదార్థం కోసం తపిస్తున్నాడు. ప్రకృతితో దోబూచులాడుతున్నాడు.

నిరంతర పరిణామ శీలమైన నశ్వర ప్రపంచాన్ని కొలవాలని చూస్తున్నాడు. మంచుగడ్డలో ఘనత్వాన్ని అంచనా వెయ్యాలని చూస్తున్నాడు. గాలిని పట్టుకొని శిలగా మార్చి తూచాలని చూస్తున్నాడు పాపం మానవుడు. అతడుదేన్నీ తెలుసుకోలేదు. అసలు తెలుసుకోవడమంటే యేమిటో, జ్ఞానం అని దేన్ని పిలవాలో అతనికే తెలీదు.

అతి సూక్ష్మమైన అణుప్రపంచంలోకి అనవసరంగా ప్రవేశించాడు, అదొక పద్మవ్యూహం.

అణువిచ్ఛిత్తి జరిగింది. మహా నగరాలలో అణుగర్భం బద్దలైంది. శాస్త్రజ్ఞుడి విజ్ఞాన తృష్ణ, తీవ్ర రక్తదాహంగా పర్యవసించింది.

పడమటి విజ్ఞానం కాలమేఘమై ఆకాశాన్ని కమ్మేసింది. అణుధూళియై జీవుల ఉనికినే శపించింది.

భూమాత భోరున విలపించింది. విష్ణుమూర్తిని అవతరించమని వేడుకొంది. కాని నారాయణుడు తిరస్కరించాడు. అన్ని అవతారాలూ యేనాడో ముగిసిపోయాయి అని రుద్రుడు ముగించాడు.

యిదీ నారదునికి గంగాతీరంలో శివుడు బోధించిన రుద్రగీత. యీ రుద్రగీతను పఠించినను వినినను హేతువాదము నుంచి మర్త్యులు విముక్తి చెందుతారు.

పాశ్చాత్య విజ్ఞాన బానిసత్వము నుంచి మోక్షము లభిస్తుంది. యిదీ ఫలశ్రుతి.

# విష్ణువు మాయం

సహస్ర నామాలతో సహస్రరూపాలతో
విరాజిల్లే సనాతనుడా
యుగే యుగే అవతరిస్తూ వుంటానన్న
నీ ప్రతిజ్ఞని యెందుకు మరిచావు
సకల శాస్త్రాలూ కళలూ కావ్యాలూ
చెట్లూ పిట్టలూ పూలూ
అనేకానేక జలచరాలూ స్థలచరాలూ
వర్థిల్లిన భూమి గతియేమిటి?

అని దిగులుగా శూన్యంలోకి ప్రశ్నని సంధించాడు నారదమహాముని.

ఎలాగో శక్తిని కూడదీసుకొని వొక మౌలిక తాత్విక ప్రశ్నని అడిగేవాడు నారదుడు.

దేవాధి దేవుడా

అసలు విష్ణుమాయ అంటే యేమిటి? తత్పురుష సమాసమా, రూపక సమాసమా విష్ణువు యొక్క మాయ అని అర్థమా?

లేక కొంపముంచి... విష్ణువే మాయ అని పరమార్ధమా?

ఈ ప్రశ్న నారదుని నుంచి వ్యక్తమైన మరుక్షణమే విష్ణు భగవానుడు అదృశ్యమైపోయాడు. లక్ష్మీదేవి మటుమాయమైంది. గరుడుడి జాడే లేదు. అతడి రెక్కల ధ్వని మచ్చుకైనా లేదు. పాలసముద్రంలో బిందువు కూడా లేదు. వేదనాదాలు నిలిచిపోయాయి. భక్తిగీతాలు ఆవిరయ్యాయి.

అంతా ఎడారి పరచుకొంది.
విశ్వాసానికి చోటులేని ప్రపంచం
మరుభూమిలా విస్తరించింది.

నారదుడు వీణాతంత్రుల్ని తెంచివేసి, ఉన్మాదియై అంతులేని ప్రపంచ మైదానంలో అశాంతిగా పరుగులు తీశాడు.

శూన్యంలో మేఘాల మధ్య మెరుపులా క్షణం మెరిసి, విష్ణువు నారదుణ్ణి శపించాడు.

శాశ్వత సందేహగ్రస్తా నారదా కూర్చున్న కొమ్మని నరుక్కునే మూర్ఖుని వలె, శుష్కతర్కంతో నిలిచిన నేలనే తొలచివేసుకున్నావు. పాప ఫలితాన్ని నీవు అనుభవించక తప్పదు. సుకుమారమైన భావాలు నీలో యింక పుష్పించవు. సుమకోమల సుందరి దరిజేరినపుడు నీవు కపిరూపములోనికి మారిపోతావు. ఆవిధంగా నీలోని గొప్ప కళాకారుడు విఫలమవుతాడు శాపఫలితంగా నీవు శాశ్వత బ్రహ్మచారివిగా మిగిలిపోతావు. శృంగార అధిష్ఠానదేవతనైన నేను నీ శృంగార జీవితాన్నే శపిస్తున్నాను. నా కుమారుడు మన్మథుణ్ణి నారదునిపై పుష్పశరములు సంధించ వద్దని ఆజ్ఞాపిస్తున్నాను. నీ జీవితం నుంచి వసంతాన్ని వుపసంహరిస్తున్నాను అని కోపోద్రిక్తుడైన విష్ణువు నారదుణ్ణి శపించాడు.

నారాయణుని శాపమునకు కోపమునకు నారదుడు కలత చెందాడు. యింత కాలమూ నమ్మిన బంటువలె వుండి, విష్ణునామ సంకీర్తన తప్ప అన్యమేమీ యెరుగకుండా జీవించాను. ఇప్పుడు సందేహము వ్యక్తం చేయగానే యింతటి ఉక్రోషమా? భగవంతునికైనను యింతటి అసహనమా? అని నారదుడు క్రోధారుణ నేత్రుడయ్యాడు.

భగవంతుడే శాపము యివ్వగల సమర్థుడా? భక్తుడు శపించలేడా?

భక్తుడు స్తోత్రవచనములు భక్తి గీతములు ఆలపించుట మాత్రమేనా

శాపవచనములు పలుకలేడా?

అట్లు పలికినచో నోరుమూతపడునా?

వాక్కు స్తంభించునా? అట్లు శపించినచో రౌరవాది నరకములు ప్రాప్తించునా?

యెట్టి పరిణామమునకైనను యీ నారదుడు సిద్ధమే.

మొట్టమొదటిసారిగా భక్తుడు కూడా భగవంతుని శపించగలడని యీ నారద బ్రహ్మ నిరూపించుచున్నాడు.

మహతీ! భక్తి గీతములు కాదు శాపవచనములకు శృతి కలుపుము.

సర్వదిక్కులారా పంచభూతములారా భయముతో క్రుంగిపోకండి.

యీ మహాభక్తుడు అభయమిచ్చుచున్నాడు. యీ మహాగాయకుడు నిర్భయ వచనములు పలుకుచున్నాడు.

నారదుని దైవశాపమునకు చెవులప్పగించండి.

దైవశాపమంటే, దైవము మనిషికి యిచ్చు శాపమే కాదు.

జీవి దైవమునకు యిచ్చు శాపము అను నూతనార్థమును నారదుడు కల్పించుచున్నాడు. వ్యాకరణమునే మార్చివేస్తున్నాడు.

బహుపరాక్ బహుపరాక్

అని నారదుడు నారాయణున్ని శపిస్తూ యీ మహా శాపగానాన్ని శృతిబద్ధంగా, లయబద్ధంగా ఆలపించాడు. ఆ భీకర గానానికి పిడుగులూ, ఉరుములూ మద్దెల దరువు వేశాయి. గుహలు వంతపాడాయి.

ఆ శాపగీతం యిది

**విష్ణువా విష్ణువా**
**నీ భార్య దూరమై నీ ప్రేమ భస్మమై**
**కోతివలె అడవిలో చరియించుమా హరీ**
**కపివరుల సాయంతో విజయాన్ని పొందినా**
**పరిహాస పాత్రుడై జీవించుమా హరీ**
**మరల మరల పత్ని నెడబాసి జగములో**
**జీవచ్ఛవమ్మువై కడ తేరుమో హరీ**
**నీ అందచందాలు నీ భోగభాగ్యాలు**
**దేనికీ కొరగాక శాంతిలేశము లేక**
**లోక మరుభూమిలో**
**పరుగెత్తుమా హరీ**
**విష్ణువా విష్ణువా**
**నారాయణాఖ్యుడా**

ఈ గీతం వైకుంఠాన్నే కుదిపివేసింది. క్షీరసాగరంలో కల్లోలం రేగింది. విష్ణు హృదయాసీనురాలైన లక్ష్మీదేవికి కూడా శాపతాపం సోకింది.

భక్తుడే భగవంతుని శపించుట.

యిది శ్రీమత్ భాగవతంలో సరికొత్త అధ్యాయం.

భక్తుని వాక్ శరాఘాతములను విష్ణుమూర్తియే రుచి చూచుట.

వాగ్గేయకారుల వాక్కులు మహాశక్తివంతమైనవి, అవి భగవంతుని కన్న మహిమాన్వితమైనవి.

ఆ వాక్ శక్తి ముందు జగద్రక్షకుడైనను తలవంచక తప్పదు.

ఆ శాప ఫలితమే శ్రీమద్రామాయణం. వాగ్గేయకారుని తీవ్ర శాపం కూడా. సుమధుర కావ్యమై అవతరించింది. అదీ కవి మహిమ.

యిదంతా చూస్తున్న మహతి తత్వచింతనలో నిమగ్నమైంది.

మహతి నారదుని వీణ.

పేరులో యెంత మహత్తు వున్నను మీటనిదే పలుకలేదు.

నారదుని అంగుళులు సోకనిదే కిమ్మనదు.

దానిలో అపారగాన సముద్రమున్నది.

శృతిలయలు ఉన్నవి. సరిగమలున్నవి. అనంతగాన సంపద నిక్షిప్తమై వుంది. ఆ వీణియలో.

కాని అశక్తురాలు.

నారదుని హస్త స్పర్శలేనిదే మేల్కొనలేదు. కాని యిప్పుడు మహతిలోనూ స్వతంత్ర చైతన్యం కలిగింది.

సొంత ఆలోచన మేల్కొంది. తత్వవిచారణ మొదలైంది, నిజమే నా అధిపతి నారదముని.

నాలోని సంగీత ఝరులను మేల్కొలిపేది నారద వాగ్గేయకారుడే యదార్ధమే. కాని నారదగీత మంజరిలోని పరిమళం యెవరు? జీవశక్తి యెవరు?

సాక్షాత్తూ నారాయణుడే.

నేడు ఆ నారాయణుని ఉనికినే ప్రశ్నించాడు నారదుడు.

ఆ శ్రీహరినే శపించాడు. నారాయణుని నుంచి విముక్తి చెందాడు నారదుడు.

భగవత్ దాస్యం నుంచి మోక్షం పొందాడు భక్తుడు.

నిజమే అసలైన భక్తి భక్తుణ్ణి భగవంతుని స్థాయికి తీసుకుపోతుంది.

యిద్దరినీ సమ వుజ్జీలని చేస్తుంది. సరే భగవంతుడూ – భక్తుల తత్వపుగోల నాకెందుకు?

అసలు నాకు విముక్తి యెప్పుడు.

గాయకుని హస్తం నుంచి వాద్య పరికరం యెందుకు విముక్తి చెందకూడదు?

నారదుని వలె నేను కూడా యెందుకు స్వతంత్రం పొందరాదు.

నాకూ వొక పేరు ఉంది.

అదే మహతి.

యెంత గొప్పపేరు నాది?

నేను మహతినే కాని అల్పమైన దాన్ని కాను.

నన్ను మీటే హస్తాలెందుకు?

నేను పరికరాన్నే కాదు గాన పరిమళాన్ని కూడా. కార్యానికి కర్తతో పనిలేదు. వాక్యానికీ కర్తతో పనిలేదు. క్రియ సంభవిస్తుందంతే. గానానికి గాయకుడితో ప్రమేయం లేదు. అది పాడబడ్తుందంతే.

యిట్టి తత్వ విచారం మహతి అనే మహత్ నామధేయం గల నారదవీణలో మహాశక్తిని తెచ్చింది.

వెంటనే మహతి గాలిలోకి ఎగిరి వొక వృక్షశాఖను చేరి, స్వయంగా తనని తానే మీటుకుంటోంది. స్వగతాలు పాడుకుంటోంది.

తానే రాగాలు కూర్చుకొని, వినూత్న రాగాలు ఆలపిస్తోంది. నవీన గీతాల్ని విరచిస్తోంది కూడా.

కర్త క్రియావిశేషణంగా మారిపోయాడు. వీణవుంది నారదుడు లేదు. గానం వుంది వాగ్గేయకారుడు లేదు. కాంతిపుంజం వుంది సూర్యుడు లేదు. ప్రకృతి వుంది. పరమేశ్వరుడు లేదు. కృతిలో కర్త కరిగిపోయాడు. కావ్యంలో దూకి కవి అస్తమించాడు.

మహతీవిపంచి నుంచి, పదం మారిన పథం మారిన గాలిబ్ గీతం వెలువడింది.

గాలిలో దీపమట్లుండెగాదె హరియు గాలిలో దీపమట్లుండె గాదె రవియు

గాలిబ్ గీతంలోని రవి మాత్రమే కాదు, శాశ్వతుడైన హరి కూడా గాలిలో దీపమై కొడిగట్టి, అనంత విశ్వంలో కరిగిపోయాడు.

ఓం తత్ సత్ మహత్.

# స్వర్గంలో కోనసీమ బ్రాహ్మణుడు

అంతూదరీ లేని అమరత్వంతో సురేంద్రుడు విసిగిపోయాడు. నిజానికి దేవేంద్రుడికి ఆకలి అనేదే తెలీదు. దేవతలకి క్షుత్పిపాసలనేవే లేవు. వారు యెప్పటికీ గడవని అనంతకాలాన్ని అమృతపానంతో అధిగమించడానికి ప్రయత్నిస్తుంటారు.

అమృతం అంటే ఏమిటి అసలు మరణం అనేదేలేని దేవతలు ఆ ద్రవాన్ని యెందుకు పానం చేస్తుంటారు? పీయూషం యొక్క రంగూ రుచీ యేమిటి?

అమృతానికి రంగూరుచీ లేదు అది అసలు యెవరికీ దృగ్గోచరం కాదు. దేవతలకి కూడా కానరాదు. యెందుకంటే- నిజానికి అమృతమంటే శూన్యం మాత్రమే.

శూన్యపాత్రని హస్తభూషణంగా చేసుకొని లేని ద్రవాన్ని పానం చేస్తున్నట్లు నటిస్తుంటారు దేవతలు. యిలా యుగాలుగా వారు నటిస్తూనే వున్నారు. కాలుడు దరిజేరని అమర్త్యులు యీవిధంగా కృత్రిమ పద్ధతిలో కాలాన్ని గడుపుతున్నట్లు నటిస్తుంటారు.

నిజానికి వారికి కాలం గడవదు. దిగ్భ్రాంతికరమైన యథార్థమేమిటంటే - అసలు వాళ్ళకి కాలమే లేదు. సురులకి వయస్సు లేదు. శైశవ యవ్వన వృద్ధాప్యాలులేవు. వ్యాధులు లేవు. కష్టం లేదు కనుక సుఖమూ లేదు. దుఃఖం లేదు కనుక ఆనందమూ లేదు. యెడారిలా పరుచుకున్న అమరత్వం వారిది. దేవతలు నివసించే అమరపురిలో యెటువంటి మలుపులూ లేవు.

అటువంటి సుందర ముదనష్టపు అమరలోకాన్ని అరుదైన గానం సోకింది. అది దివ్యగానం. భక్తిపూర్ణమైన గానం. కాని ఆ గానంలో పార్థివ స్పర్శ వుంది. మర్త్య అనురక్తి వుంది. ఇంద్రియలోలత దాగి వుంది.

ఇంద్రియాతీతమైన దైవత్వమూ ఇంద్రియ వాంఛల సంకరమైన ఆ గానం విచిత్రమైన రంగునీ రుచినీ తీసుకువచ్చింది. అమృతంలో లోపించినది అదే. ఈ గీతాన్ని ఆలపిస్తూ త్రిలోక సంచారి నారద ముని స్వర్గంలో అడుగుపెట్టాడు.

**వేరొక్కరు లేరు విశ్వమంతా నీమహిమే**
**యే రీతినీవే కలవు ఇతరము లేదు**
**తల్లివై రక్షింతువు తండ్రివై పోషింతువు**
**యిల్లాలివై మోహమిత్తువు నాకు**
**వొళ్లయి పెరుగుదు. వొగి పురాకృత మొదు**
**యిల్లు ముంగిలయి వుండుదు**
**వింతా నీ మహిమే.**

ఈ గానం యింద్రియాలు లేని యింద్రుణ్ణే కదిలించింది. శచీదేవిని తన్మయురాల్ని చేసింది.

గురుపత్ని తారపై చల్లని కిరణాల జల్లు కురిపిస్తున్న చందమామని మబ్బుల తెరచాటునుంచి బయటకు తెచ్చి ఓలలాడించింది ఆ గీతం. దేవగురువు బృహస్పతి మేధాశక్తిని చిన్నబుచ్చింది.

నారదా యేనాడూ వినని వినూత్న గానం యిది. యేలోకానిది యే తపస్వి తపఃఫలితమిది? అని ప్రశ్నించాడు తన్మయుడైన దేవేంద్రుడు.

సురరాజా! భూలోక వాసియైన వాగ్గేయకారుని కృతి యిది. ఆయన పేరు అన్నమయ్య అని చెప్పాడు నారదముని.

యెవరి గురించి రచించిన గీతమిది అని ప్రశ్నించాడు యింద్రుడు.

త్వమేవాహం అని తన్మయపరిచే ప్రేయసి మహిమే కదా యీ గీతసారం అని అడిగాడు అమృతకిరణుడు.

గురుపత్నిని మైమరిపించేందుకు కాదులే యీ గీతం అని చంద్రుని వ్యంగ్యంగా దెప్పి పొడిచాడు సురగురువు. చందమామ ముఖం చిన్నబోయింది.

అన్నమయ్య గానం చేసినది యిష్ట కాంతను గురించి కాదు అని స్పష్టం చేశాడు నారదుడు.

మరి యిల్లాలిలా మోహమిచ్చే దెవరు? యిల్లూవాకిలై సర్వత్రా కానవచ్చే సుందరాంగి యెవరు? అది మోహగీతమే, సమ్మోహనగీతమే యెంతైనా స్త్రీహృదయం పసిగట్టగలదు అంది శచీదేవి.

కాదు కాదు అన్నమయ్య పాట యిష్టకాంతను ఉద్దేశించింది యేమాత్రం కాదు. యిష్టదైవాన్ని స్తోత్రం చేసే గీతమది అన్నాడు నారదుడు.

ఆ యిష్టదైవం యెవరు అని ప్రశ్నించారు దేవతలు.

ఆయన కలౌ వెంకట నాయకః అని ప్రసిద్ధి చెందిన దేవదేవుడు. మోహినీ అవతారంలో జగమునే మోహములో ముంచెత్తిన మాయామానుష విగ్రహుడు. ఆ శ్రీమహావిష్ణువే కలియుగంలో వెంకటేశ్వరస్వామిగా అవతరించాడు. ఆ స్వామి భక్తి పారవశ్యంలో పరమభాగవతుడు అన్నమయ్య ఆలపించిన హృదయంగమ గానమిది అన్నాడు నారదమునీంద్రుడు.

దేవగురువు బృహస్పతి యీ గీతాన్ని గురించి అభ్యంతరం వ్యక్తం చేశాడు.

యీ మానవభక్తుడు మాయని సృష్టించిన విష్ణువునే మాయాజాలంలోకి లాగుతున్నాడు. సర్వేంద్రియాధిపతియైన విరాట్ స్వరూపుణ్ణి యింద్రియ గమ్యుణ్ణిగా వర్ణిస్తున్నాడు. పరమాత్ముని దేహంగా అభివర్ణిస్తున్నాడు. క్షేత్రజ్ఞుణ్ణి క్షేత్రంగా చిత్రిస్తున్నాడు. మోక్షదాతని సంసార బంధితుణ్ణి చేస్తున్నాడు. యిదంతా సాంకర్యం. యిది సంకరవాణి, సంకరగీతం పాంచభౌతిక మర్త్య దేహ పరిధిలోకి సర్వేశ్వరుణ్ణి లాగడం అపచారం అన్నాడు బృహస్పతి.

మహాబుద్ధిశాలియైన బృహస్పతీ నీబుద్ధి గొప్పదేకాని బుద్ధితో దేన్నీ కొలవలేం. యిట్టి అపచారానికీ యిట్టి సాంకర్యానికీ విష్ణుమూర్తి యెప్పుడో పాల్పడ్డాడు. కలియుగంలో వెంకటేశ్వరస్వామిగా అవతరించి బీబీనాంచారి అనే మ్లేచ్ఛకన్యను వివాహం చేసుకున్నాడు స్వామి. సౌందర్యరాశియైన బీబీ కోసమే సప్తగిరివాసుడుగా భువికి దిగివచ్చాడు. అని ధర్మసూక్ష్మాన్ని వివరించాడు నారదముని.

దేవగురువర్యా! విష్ణుమాయని హేతుబుద్ధితో అవగతం చేసుకోలేం. సర్వ సమర్పణ భావంతో మాత్రమే గ్రహించగలం.

సర్వం సంకరమే. పంచభూతములనెడి పలువన్నె నూలుతో భగవంతుడీ విశ్వాన్ని అల్లాడు. ఇది పరమభాగవతుడు అన్నమయ్య వాక్కు. యిందలి ఆంతర్యం సాంకర్య తత్వం.

సాంకర్యం నుంచే స్ఫటిక స్వచ్ఛత సంభవిస్తోంది.

సప్తవర్ణాల సాంకర్యం నుంచే, ధవళ భాసురమైన సూర్యకిరణం ఆవిర్భవించింది. బ్రాహ్మణ వర్ణం కూడా సాంకర్యంవల్లనే సిద్ధించిందని వశిష్ట మహర్షి సచ్చరిత్రవల్ల స్పష్టమౌతోంది.

యీ సంకరగీత యోగులకీ రుషులకీ మాత్రమే దృష్టి గోచరమౌతుంది కాని బుద్ధి బలగర్వితులకి కాదు అని బృహస్పతిని దెప్పి పొడిచాడు నారద మహర్షి.

అప్పటికీ అమరగురువుకి నారదవాక్కు వితండవాదంవలె గోచరించింది. కాని అమరేంద్రుడు మాత్రం దీర్ఘ చింతనలో నిమగ్నుడైపోయాడు.

నారద మునీంద్రా! నీ సంకర తత్వం నన్ను పురాస్మృతులలోకి నెడ్తోంది. సహస్ర అశ్వమేధ ఫలితంగా నేను మర్త్యత్వాన్ని అధిగమించడమే కాక స్వర్గ లోకానికే అధీశుడనయ్యాను. అప్పటికీ మదీయగత జన్మ పరంపరల వాసనలు నశించలేదు. మునిపత్ని అహల్యను చూసినపుడు నాలోని పశుత్వము నిద్రలేచినది.

నారద యోగివరా! నేను పేరుకి సురేంద్రుడ్డైనా నాలో పశుమానవ సంస్కార సాంకర్యం అలాగే వుంది. అచ్చమైన దైవత్వం దుర్లభం. సర్వం సంకరం సంకరం అని నారదుని తర్కాన్ని సమర్థించాడు ఇంద్రుడు.

నారదా! నీతో వొక మిత్రునిగా కొన్ని ఆంతరంగిక విషయాలను ముచ్చటించ వలెనని నా మనస్సు వువ్విళ్లూరుతోంది. యీ అమరత్వం నాకు చాలా విసుగుగా వుంది. మళ్లీ కష్ట సుఖములకు ఆలవాలమైన మానవ జన్మ నెత్తవలెనని తీవ్రమైన వాంఛ వెన్నాడుతోంది. మార్గం చూపుము. అని వేడుకొన్నాడు శచీపతి.

సురాధీశుని కోరిక నారదుని దిగ్భ్రాంతికి గురిచేసింది.

మానవుడు దైవత్వాన్ని పొందవచ్చుకాని సురుడు మానవుడగుట దుష్కరము అన్నాడు నారదుడు.

యింతకీ దేవేంద్రునికి మానవ జన్మ నెత్తవలెనను కోరిక యెట్లు కలిగినది? ఆవకాయయే కారణం. ఆవకాయ రుచి గురించి కోనసీమ సోమయాజులుచేసిన అద్భుత వర్ణనే, మర్త్యలోకంలో జన్మించాలన్న కోరికని రేపింది యింద్రునికి. బలవాన్ ఇంద్రియగ్రామః ఇంద్రియాధిపతి యింద్రున్ని కూడా యింద్రియాలు లొంగదీసు కున్నాయి.

## సోమయాజి ఉపాఖ్యానం అను ఆవకాయ మహోత్మ్యం

సోమయాగం శ్రద్ధగా ఆచరించి పరమపదించిన వెంటనే అమర పురికి యేతెంచాడు సోమయాజులు. అప్సరసలు నాట్యం చేస్తూ మార్గమంతటా విరులు వెదజల్లారు. దేవ కాంతలు, వెలిగి ఆరే దీపాల వలె క్షణంలో మటుమాయమవు తున్నారు. వర్ణనకోసమని గాక నిజంగానే క్షణికంగానే భాసిస్తున్నారు. మరుక్షణం అదృశ్యమవుతున్నారు.

ఈ స్వర్గమేదో వింతగా వుందే అని తలపోశాడు సోమయాజులు. ఆయనని దివ్యకాంతితో వెలుగుతూ, యే విచిత్ర లోహంతో యే గొప్ప శిల్పి కూర్చాడో తెలియని అద్భుత ఆసనంపై ఆసీనుణ్ణి చేశారు. తర్వాత సోమయాజుల చేతికి వొక శూన్య పాత్రని అందించారు. అమృత పాత్ర అంటే అదే.

సోమయాజులు ఆ పాత్రని కిందికీ మీదికీ తిప్పి చూశాడు దానిలో యేమీ లేదు.

సోమయాజులు తర్క శాస్త్రం అభ్యసిస్తున్న రోజులలో పాత్రకు ఘృతము ఆధారమా, ఘృతానికి పాత్ర ఆధారమా అని తర్కించుకుంటూ, అనుభవ పూర్వకముగా తెలుసుకొనబోయి, నెయ్యినంతా నేలపాలు జేసి గురుపత్ని ఆగ్రహమునకు గురయ్యాడు. ఆ సంఘటన యిప్పుడు యథాలాపంగా గుర్తుకు వచ్చింది సోమయాజులుకి. కాని యీ పాత్రలో వొలకబోయుటకు యే ద్రవమూ లేదు.. అంతా హుళక్కి.

సోమయాజులు దేవేంద్రునే నిలదీశాడు. సురచక్రవర్తీ! స్వర్గం సకల సుఖాలకీ నిలయమంటారు యీ శూన్య పాత్ర లేమిటి, క్షణిక సుందరులేమిటి? మాయా పుష్పాలేమిటి? యీ మాయా ప్రపంచంలోకి అడుగుపెట్టడానికేనా నిష్ఠగా యజ్ఞయాగాదులు ఆచరించేది అని కోపోద్రిక్తుడయ్యాడు. సోమయాజులు. అట్టి నిష్ఠాగరిష్ఠుడైన భూసుర దిగ్గజానికి కాకపోతే మరెవరికి సాధ్యం దేవేంద్రుని నిలదీయడం.

వేదపారాయణ పరాయణా బ్రాహ్మణా! శ్రోత్రియులు బుద్ధి జాడ్య జనితోన్మాదులు అన్న ఆర్యోక్తికి దృష్టాంతంలా కనబడ్తున్నావు నువ్వు. దుఃఖ సాంకర్యం లేని స్వచ్ఛసుఖం అసాధ్యం వర్ణ సాంకర్యం లేని బ్రాహ్మణ్యం అగోచరం. పంచభూత సాంకర్యం నుంచే ప్రకృతి ఆవిర్భవిస్తోంది. త్రిగుణ సాంకర్యం నుంచే సృష్టి ఆవిర్భవిస్తోంది. ఇదీ శృతి స్మృతి పురాణ సారం. అందువల్ల విషాద సాంకర్యం లేని

ఆనందం కోసం వెతకడం శశివిషాణ అన్వేషణవలె వ్యర్థం, మూర్ఖత్వం అని శ్రుతి సారాన్ని విప్పి జెప్పాడు యింద్రుడు.

దేవేంద్రుని వాక్కులు సోమయాజులు అభిప్రాయాల్ని తలకిందులు చేశాయి. స్వర్గం అంటే వొక వూహాకల్పన అని తేలిపోయింది.

సోమయాజులు యజ్ఞ కర్మకాండ గురించి విచికిత్సలోనికి వెళ్లిపోయాడు.

యజ్ఞం వొక చక్రభ్రమణం. యజ్ఞం వల్ల వర్షం, వర్షం వల్ల పాడిపంటలు, తద్వారా జీవుల వృద్ధి మళ్లీ యజ్ఞం, వర్షం...యిది అనంతమైన చక్రభ్రమణం అని గీత బోధించింది.

యీ చక్రంలో స్వర్గమూలేదు భోషాణమూ లేదు.

యజ్ఞం వొక చక్రం, కర్మ వొక చక్రం, జన్మ వొక చక్రం, భాగ్యం వొక చక్రం. చక్రార పంక్తిరివ గచ్ఛతి భాగ్య పంక్తిః

మానవుడెప్పుడైతే చక్రాన్ని కనుగొన్నాడో ఆనాడే చక్రంలో యిరుక్కుపోయాడు. నిజానికి చక్రం తనలో తానుగా పరిభ్రమిస్తూంటుంది. ముందుకు కదలడం దాని ఉద్దేశ్యం కాదు చక్రం ఫలానా చోటికి జేరుస్తుందనేది మానవ నిర్మితమైన కల్పన, అదే స్వర్గం.

నిజానికి దేవేంద్రుడు కూడా కర్మచక్రభ్రమణంలో యిరుక్కుని పోయిన వాడే వొక దినాన అతనికీ అధఃపతనం తప్పదు. యిది అవశ్యంభావి.

కాని అనివార్య పతనం వచ్చేంత వరకూ సురేంద్రుడు మాయోపాయాల్ని పన్నుతూనే వుంటాడు. విద్యుల్లతల్ని అప్సరసల్లా భ్రమింపజేస్తూ, తపస్సుని చెడగొడ్తూనే వుంటాడు. ఇంద్రుని కపటపన్నాగమే యింద్రజాలం. నిజానికి స్వర్గం కూడా యింద్ర జాలమే. అప్సరసలు అంటే హరివిల్లులు. హరి అంటే యింద్రుడని అర్థం. హరి అంటే వుపేంద్రుడని కూడా అర్థం. వుపేంద్రుడంటే విష్ణుమూర్తి.

విష్ణుమాయ, యింద్రజాలం అప్పా చెల్లెళ్లు. రెండూ దృశ్య భ్రాంతులే.

కాని భ్రమలు ఆసక్తి కరమైనవి. స్వప్నాలకి మూలం అవే.

స్వప్న ప్రపంచంలో రుషులు కూడా నిస్సహాయులు. యిట్టి నిస్సహాయుడే విశ్వామిత్రుడు. బ్రహ్మర్షి కావాలనే వుత్తమ లక్ష్యంతో తపస్సు ప్రారంభించాడు. ఆ తపస్సు యింద్రున్నే తాపంలోకి నెట్టింది.

మంత్రశక్తితో దిక్కుల నన్నిటినీ వశంలోకి తెచ్చుకున్నాడు విశ్వామిత్ర మహర్షి. దిక్పాలకులనే కాపలా పెట్టాడు. దిగ్గజాలని మోహరించాడు.

అంతటి శక్తి సంపన్నుడూ ప్రకృతిని జయించలేకపోయాడు. చల్లని వర్షం, వాన వెంట యింద్ర ధనస్సు, ఆ రంగుల విల్లు ఊర్వశి అనే నామంతో అప్సరస రూపం ధరించి నేలకు దిగివచ్చి వాన చినుకులతో పాటు నర్తించి, యెదుట నిలిచి, వొడిని జేరి పరవశింపజేసినపుడు-

ప్రకృతి చక్రభ్రమణంలో యిరుక్కుపోయాడు, బింకం సడలించాడు.

రుషివలెకాక మనిషివలె, మనిషిలో పశువువలె ప్రవర్తించాడు.

అదీ యింద్రజాలమంటే

అదే విష్ణు మాయ అంటే.

తపస్సు కన్న తపో భంగమే మహిమాన్వితమైనది.

విశ్వామిత్రుని తపోభంగం వల్లనే శకుంతల జన్మించింది. శకుంతల దుష్యంతుల ప్రేమ ఫలితంగా భరతుడు జన్మించాడు.

అతడే తన పేరుని భరతఖండానికి ప్రదానం చేశాడు. నాట్యశాస్త్రాన్ని రచించాడు. భరతనాట్యమనే విశిష్టనామానికి మూలమయ్యాడు.

ఆ నాట్యానికి సాక్షాత్తూ శంకరుడే తకథింత అంటూ పదముల నిచ్చాడు. ఆ నాట్యంలోని లయనుంచి వ్యాకరణం పుట్టింది. శివపదాలే పదవాక్య నిర్మాణ రహస్యాన్నీ వ్యాకరణాన్నీ అందించాయి.

తపస్సు నుంచి కాదు తపోభంగం నుంచే భరతఖండం, నాట్యం, వ్యాకరణం అన్ని శాస్త్రాలూ పుట్టాయి. పురాణాలు ప్రభవించాయి.

అందుకే రుషి మూలం నదీమూలం అడగకూడదన్నారు. మూలంలోకి వెళ్తే అంతా సాంకర్యమే, స్ఖాలిత్యమే.

యేతావతా తేలిందేమిటంటే-

స్వచ్ఛమైన పదంకన్న అపభ్రంశం శ్రేష్ఠమైనది. శబ్దంకన్న అపశబ్దం ఉత్తమమైనది.

భోళాశంకరుని తప్పటడుగులే నాట్యం, వ్యాకరణం.

తపస్సు ఫలించదు. సత్యం గోచరంకాదు. నిరంతర భగ్న ప్రయత్నాలలో జీవి చక్రభ్రమణం చేస్తూంటాడు. అది విధివ్రాత. దానిలోనే ఆనందం, దానిలోనే స్వర్గం. సత్యం యింద్రధనస్సువలె వొక అందమైన భ్రమ. స్వర్గమంటే అదే.

యిలా సోమయాజుల మనస్సులో స్వర్గపుటాలోచనలు చక్రభ్రమణం చేస్తున్నాయి. ఇంతలో హఠాత్తుగా ఆవకాయ గుర్తుకు వచ్చింది సోమయాజులుకి.

వెంటనే స్వర్గంలో ఆవకాయ ఉప లబ్ధికి గల హేతువులను వెతకడం మొదలు పెట్టాడు తర్క శాస్త్ర పండితుడైన సోమయాజులు. యత్ర యత్ర స్వర్గః తత్ర తత్ర ఆవకాయః అని తర్క పరిభాషలో తలపోశాడు.

స్వర్గమంటే సామాన్యమా? స్వర్గలోకంలో కామధేనువు వుంటుంది. కల్పవృక్షం వుంటుంది. కోరినదల్లా యిచ్చే కల్పవృక్షం నాలుగు మామిడి కాయలను ప్రసాదించలేదా? వాటిని కోసి దేవకాంతలు ఆవకాయ పెట్టలేరా? దేవతలు తలచుకొంటే నూనెకు లోటా? వుప్పు కారాలకి లోటా? మానవులకి కూడా సంకల్పబలం వుంటే యిష్టార్థసిద్ధి కలుగుతుంది అంటారు. యింక సురుల సంగతి చెప్పేదేముంది?

యింతకీ ఆవకాయ లభించని దేవలోకమైనా దేవలోక మెలా అవుతుంది? ఆవకాయ రుచిచూడని జన్మెందుకు? అది సురజన్మయైనా. అసలు దేవేంద్రుడు కూడా వొకనాటి మానవ మాత్రుడే కదా. నూరు అశ్వమేధయాగాలు నిష్ఠగా ఆచరించి నిర్జరేంద్ర పదవిని అధిష్టించాడు. మానవ జన్మలో ఆయనకి కూడా ఆవకాయ లేనిదే వొక ముద్దకూడా దిగి వుండదు. అందువల్ల శచీదేవికి చెప్పి వొక జాడీయైనా ఆవకాయ పెట్టించి వుండకపోదు. బ్రాహ్మణుడు వెళ్లి దేహీ అంటే కాస్త దానం చెయ్యకపోడు అని ఆలోచించి యింద్ర సన్నిధికి వెళ్లాడు.

అసలు ఆవకాయ అంటే యేమిటి అని దేవేంద్రుడు ప్రశ్నించడంతో అవాక్కయ్యాడు సోమయాజులు.

విప్రోత్తమా! నేను దేవేంద్ర పదవిని అధిరోహించి యెన్నో యుగములు గడిచిపోయినవి. నేను భూలోకములో వసించు పురాతన కాలములో ఆవకాయ అను భోజ్య విశేషము అలభ్యము. భూసురా! నీవు పరిశీలించినచో రామాయణ,

భారత, భాగవతాదులలో ఆవకాయ అను ఖాద్య విశేషము కనబడదు. శ్రీరాముడు కాని శ్రీకృష్ణుడు కాని అట్టి దానిని భుజించినట్లు ఆధారము మృగ్యము. కనుక దాని గురించి నాకు తెలియదు అని ఇంద్రుడు కుంభమును పగులగొట్టినట్లు చెప్పివేసెను.

దానితో విసుగు చెందిన సోమయాజులు ఆవకాయ విశిష్టతను గురించి వొక కారికను వుటంకించాడు

**ఆవకాయం వినాలోకే**

**భోజనం రసవర్జితమ్**

**ఆవకాయం వినాతిథ్యం**

**నిష్ఫలం పాపకారకం**

దేవేంద్రా! అమృతపానం చేసిన సురులకన్న, ఆవకాయ రుచి చూసిన భూసురులే శ్రేష్ఠులు. అందుకే నేను యీ దిక్కుమాలిన ఆవకాయ విరహిత స్వర్గమును త్యజించుచున్నాను అని భూసురుడు దిగ్గున లేచాడు.

వెంటనే దేవేంద్రుడు చేతులు మోడ్చి, వేదవేదాంగ విదులైన బ్రాహ్మణులు స్వర్గమును నిందించి విడిచి వెళ్లినారను అపఖ్యాతిని తేవద్దని వేడుకున్నాడు. ఆవకాయని భూలోకం నుంచి తెప్పిస్తానని హామీ యిచ్చాడు. ఆవకాయ లభించు పుణ్యక్షేత్రమేది అని ప్రశ్నించాడు.

కోనసీమ వక్కలంక అగ్రహారంలోని శివాలయం సందులో మా పెంకుటిల్లు వుంది. అక్కడ నా భార్య సోమిదేవమ్మ వుంది. ఆమె వలె ఆవకాయ పెట్టగలవారు భూలోకంలోనే లేరు. అక్కడికి దేవదూతల్నీ, నారదమునినీ పంపు. నా యోగక్షేమాల్ని కూడా తెలియజేయమని చెప్పు అని సలహా యిచ్చాడు సోమయాజులు.

నిజానికి సోమయాజులు స్వర్గానికి వచ్చి రెండు దినములే గడిచాయి. కాని భూలోక కాలమానం ప్రకారం యెన్నో దశాబ్దాలు గడిచిపోయాయి. సోమిదేవమ్మ శతవృద్ధురాలైపోయింది. అగ్రహారం రూపురేఖలే మారిపోయాయి. కొద్దిమంది పండు ముదుసలులు మాత్రమే అగ్రహారాల్లో మిగిలారు. మిగిలిన వారందరూ సుదూర ప్రాంతాలకు తరలిపోయారు.

వేద పఠనమూ లేదు. శాస్త్ర పఠనమూ లేదు. ఆవకాయ లేదు. అతిథులూ లేరు.

యీలోగా పడమటి దేశపు వ్యాపారస్తులు ఆవకాయపై హక్కుని దఖలు పరచుకొన్నారు. సీసాలలో కెక్కించి పెద్దెత్తున వ్యాపారం ప్రారంభించారు. నీటినీ గాలినీ కూడా వ్యాపారంగా మార్చిన వాణిజ్య రాక్షసులు ఆవకాయని మాత్రం వదులుతారా?

శిథిలమైన అగ్రహారాల్ని, చిన్నబోయిన గ్రామదేవతల ముఖాల్నీ కొడిగట్టిన దీపాల్నీ చూడలేక నారదుడు స్వర్గానికి తిరుగుముఖం పట్టాడు.

సర్వం శూన్యం అని పెదవి విరిచాడు నారదముని.

సోమయాజులుకి యింక నీకీ అమృతమే గతి అని పాత్రని అందించాడు దేవేంద్రుడు.

# కింలోకం

ద్రవః కః జడః కః కించిత్రలోకే
చలః కః స్థిరః కః
నరః కః సురః కః
సుతః కః పితాకః కి మాభ్యాతలోకే
కిం జ్ఞానం అజ్ఞానం
కిం సౌఖ్యం కిం దుఃఖం కి మిత్యుక్త లోకే
యతిః కః ఖలః కః
కస్సాధుః కః దుష్టః కించిత్ర లోకే

కింలోకంలోకి ప్రవేశించాడు ద్రిమ్మరియైన నారదుడు. కింగీతాన్ని ఆలపిస్తూ అడుగుపెట్టాడు. కిం శబ్దాన్ని ప్రేమించే జీవుల నిలయం కిం లోకం. కిం శబ్దం ప్రశ్నార్థకం ఏమిటి అనేది దాని అర్థం.

కింలోకంలో కిన్నరులు కింపురుషులు అనే పేరుగల రెండుజాతులు నివసిస్తున్నాయి. కిన్నరులు తమ ముఖాన్ని ప్రతిదినం మార్చుకుంటారు. నూతన వదనాన్ని ప్రతినిత్యం తగిలించుకుంటారు.

కింపురుషులు తమ దేహాన్ని అనుదినమూ మార్చుకుంటారు. కొత్త మొండాన్ని ప్రతిదినమూ తగిలించుకుంటారు.

అంటే వీరు మానవ ముఖాల్నీ మానవదేహాల్నీ ధరిస్తారని అర్థం కాదు. కిన్నర కింపురుషులు అర్ధభాగం మానవాకృతిలోను, మరో సగభాగం జంతు ఆకృతిలోనో పక్షి ఆకృతిలోనో వుంటారు.

కిన్నర కింపురుషులు యిలా దేహస్వభావాన్నే యెలా మార్చివేయ గలుగుతున్నారు అని సందేహం కలుగవచ్చు. యిట్టి అద్భుతవిద్య అశ్వినీదేవతల వద్ద కలదు.

యిలాంటి చిత్రవిచిత్ర వైద్యశాస్త్ర విన్యాసాలతో అశ్వినీదేవతలు సృష్టించిన జాతులే కిన్నర కింపురుషులు. అంటే అశ్వినీదేవతల సృష్టియే కింలోకం.

యీ విధముగా నరపురుష శబ్దములకు ముందు కిం శబ్దాన్ని చేర్చి కొత్త నామధేయములను సృజించుటకు ముఖ్యమైన కారణం వుంది. వారిని వీక్షించిన క్షణములోనే కిం శబ్దభవములైన ప్రశ్నలెన్నో తలెత్తుతాయి.

**తేకే నరాః అథవా వానరాః?**

**తేకే జంతవః అథవా పక్షిణః?**

**తేకే స్త్రియః అథవా పురుషాః?**

యిట్టి రీతిలో వారి జాతి, రూపములపై ప్రశ్నలు రేకెత్తుతాయి. కిం శబ్దం వారిని చూసిన వెంటనే స్ఫురిస్తుంది.

మనకే కాదు కింలోక వాసులు వొకరికొకరు యెదురుపడినపుడు తక్షణం మనసులో మెదిలేది ప్రశ్నయే, సందేహమే. త్వం కః నీవెవరు అనేదే ఆ ప్రశ్న. కుశల ప్రశ్నల కంటె పూర్వమే యీ ప్రశ్న యెదురౌతుంది. స్వరూపమును గురించి సందేహమే మొదటిగా తలెత్తుతుంది.

నిత్యనూతనులైన కిన్నర కింపురుషులలో అనుబంధములకు ఆస్కారము అసలే లేదు. నిరంతరమూ అపరిచిత దేహాలూ అపరిచిత ముఖాలమధ్య సంచారం వల్ల వారిలో యెట్టి స్నేహభావమూ అంకురించే అవకాశమే లేకుండా పోయింది.

కాతే కాంతా కస్తే పుత్రః

సంసారోయమతీవ విచిత్రః

భార్య యెవరు, పుత్రుడెవరు యీ సంసారం చాలా విచిత్రమైనది అని శంకరాచార్యులవారి వేదాంత ప్రశ్న. యిదీ కింశబ్దభవమైన తత్వమే.

కాని కింలోకంలో భార్యలూ లేరు పుత్రులూ లేరు. యెందుకంటే వేగాతి వేగమైన మార్పు, దేహాల్లోనూ ముఖాల్లోనూ నిరంతర పరివర్తన కింలోకాన్ని అపరిచిత ముఖాటవిగా మార్చేసింది. యిట్టి వైఖరి వెనుక వేదాంత ధోరణి, తత్వ విచారమూ యేమాత్రమూ లేవు. నూతనత్వం పట్ల ఆలోచనలేని ఆకర్షణ మాత్రమే వుంది.

అసలు కిం శబ్దాన్ని కనుగొన్నది తామేనని, దానివల్ల తమ జాతి మార్పుకి మరోపేరుగా మారిందని కిన్నర కింపురుషులు గర్విస్తుంటారు, కాని అట్టి వ్యర్థమైన మార్పువల్ల వొరిగేదేమిటన్న ప్రశ్న మాత్రం వారికి తలెత్తదు.

కింలోక వాసులు తాము ప్రశ్నోపనిషత్తుని ప్రేమిస్తామంటారు. కాని వారికి ప్రశ్నలంటే అసలు గిట్టవు. వారు సమాధానాలని ముందుగానే సిద్ధం చేసుకొని ప్రశ్నల్ని గుప్పిస్తుంటారు. ప్రశ్నలు తమ వునికినే కల్లోలపరచడం వారి కస్సలు యిష్టం వుండదు. అందువల్ల వారి ప్రశ్నించే స్వభావం వొక నటన మాత్రమే, బాహిర ప్రదర్శన మాత్రమే.

కిం లోకాన్నే మొదటిసారిగా ప్రశ్నార్థకపు గుర్తు ముందుకు నెట్టినవాడు కేనోపనిషత్కారుడు. కింలోక వాసులు కింశబ్దాన్ని వుపయోగించే విధానంలోనే లోపం వుందని విమర్శించినవాడు ఆ మహాత్ముడు. ఆయన పేరు కింపథ మహర్షి. అంటే కిం శబ్దమునకు మార్గము చూపినవాడు, అసలు ప్రశ్న అనేది పయనించవలసిన దారిని కనుగొన్నవాడు.

కింపథ మహర్షి యెంతో దయతో కింలోక వాసులకి కేనోపనిషత్తుని బోధించాడు. కేనేషితం పతతి ప్రేషితం మనః ఎవరి ప్రేరణ వల్ల ఇంద్రియాలూ మనోబుద్ధులూ చలిస్తున్నాయి? పంచభూతములు ప్రేరణ పొందుతున్నదెవరివల్ల? అని కేనోపనిషత్తులో వొక మౌలిక ప్రశ్నని లేవనెత్తాడు మహర్షి. కిం శబ్దాన్ని తత్వ విచారం వైపు మళ్ళించాడు. కేన అనేది కిం శబ్దం యొక్క తృతీయా విభక్తి రూపం. ప్రశ్నయే యీ ఉపనిషత్ తత్వం. కాని జీవి అస్తిత్వం గురించి మౌలిక ప్రశ్నను రేపే బోధ యిది.

కాని కింలోకవాసులు తత్వ చర్చలకి యిష్టపడరు. యిట్టి చర్చల వల్ల సమయం వృధా అవుతుందని భావిస్తారు. సందిగ్ధ స్థితిలో జీవితానికి అలవాటు పడిపోయారంతే. సందేహమే కిన్నర కింపురుషుల ఉచ్ఛ్వాసనిశ్వాసలు, అదే వారి ప్రాణం.

కాని యీ సందేహం అనేది యెటువంటి తాత్విక మీమాంసకూ యేమాత్రం దారితీయదు. సందేహం అనేది వారిని నూతనత్వపు డొల్లతనం లోకి నెట్టింది.

నూతనత్వ ఆరాధకుల్లారా కిన్నర కింపురుషుల్లారా నవనవోన్మేష శాలియైన ప్రతిభ అంటే యిదేనా? ముఖాల్నీ దేహాల్నీ మార్చుకుంటూ మీరు దేహారాధకులుగా మారిపోయారు. సందేహమే మీదేహం. యీ అర్థరహితమైన మార్పులో మీరు ఊపిరి పీల్చుకునే సమయాన్ని కూడా కోల్పోయారు.

కింపథ మహర్షి మాత్రమే కేనోపనిషత్తుని దర్శించి, కింశబ్దాన్ని దుర్వినియోగం చేయడం మాని తరంగాల వెనుక నిశ్చల తటాకాన్ని చూడడానికి ప్రయత్నించాడు.

మీరైతే కింశబ్ద భవాలైన ప్రశ్నలలో పూచిక పుల్లల్లా కొట్టుకుపోయారు. కిం శబ్దంతో మీలో మీరే అశాంతిని రేపుకొని, నిరంతరం రూపాల్ని మార్చుకుంటూ, మిమ్మల్ని మీరే చిత్రవిచిత్ర పద్ధతుల్లో నిలకడలేని నిర్వచనాల్లో యిరికించుకొని, అశాంతితో జీవించారు. యిప్పటికీ అలాగే బతుకీడుస్తున్నారు.

కిం శబ్ద భవుల్లారా కిన్నర కింపురుషుల్లారా కేనోపనిషత్ సారాన్ని తెలుసుకోండి. పరమార్ధాన్ని గ్రహించండి అని నారద మహర్షి కింలోక వాసులకి బోధించాడు.

యింతకీ నారదమహర్షి కింలోక గమనానికి కారణమేమిటంటే – అదో శాపవృత్తాంతం. కిం శబ్ద ప్రియత్వమే నారదమునిని కూడా కింలోక పతితుణ్ణి చేసింది.

నారదుడు భక్తి సూత్రాలను రచించాడే కాని త్వమేవ శరణం మమ అన్న సర్వసమర్పణ బుద్ధి అతనికి అబ్బలేదు. విష్ణు మాయ వల్ల కావచ్చు సందేహాలలో చిక్కుకుపోయాడు.

వొక అమావాస్య రాత్రి ఏకాంత గంగాతీరంలో నిలబడి వీణను యధాలాపంగా మీటుతూ ప్రశ్నల వర్షాన్ని కురిపించాడు నారదమహర్షి.

కరుణా నిలయా నారాయణా!

విష్ణువనే నామానికి సర్వవ్యాపకుడని అర్థం కదా?

యింతకీ యీ శూన్యపాత్రని నింపుతున్న అమృతమయమైన సత్యం యేదైనా వుందా? నీ విష్ణుత్వం యథార్థమేనా?

యీ ప్రశ్నను విని కోపోద్రిక్తుడయ్యాడు విష్ణువు. శృతిస్మృతి పురాణ విశారదా నారదా! నాకు వేదనిందకులైన నాస్తికుల వల్ల కాదు. నీ బోటి ఆస్తిక భక్త వరేణ్యుల వల్లే ముప్పు పొంచి వున్నట్లు గోచరిస్తోంది.

నీ స్తోత్రగీతములలో సందేహం ధ్వనిస్తోంది. నీ భక్తి సూత్రములలో అస్తి నాస్తి విచికిత్స పొంచి వుంది. యిది పరమ భాగవతులకు తగినది కాదు. యింతకన్నను రావణాది రాక్షసుల వైరభక్తియే స్వచ్ఛమైనది. నీబోటి మహాబుద్ధి శాలుర భక్తి భావం సంశయ కలుషితమైనది.

కిం శబ్ద ప్రియా సందేహ కల్లోలాంతరంగా నారదా! నిరంతరం ప్రశ్నలతో కింకిం అంటూ రొద పెట్టు నీవు కింలోక పతితుడువు కావాలని శపిస్తున్నాను. కింలోకంలో నీ ముఖాన్ని కూడా పోగొట్టుకుని విలపిస్తావు. నిరంతర శాఖాచంక్రమణం చేసే అనిశ్చిత మనస్కుడవి. అందుకే నీవు కపిముఖాన్ని పొంది పరిహాస భాజనుడవై లోక సంచారం చేస్తావు అని శపించాడు విష్ణుమూర్తి.

నారాయణ వాక్కు తక్షణం ఫలించి, కింలోకంలో అధః పతనం చెందాడు.

యిదీ శాప వృత్తాంతం.

కేనోపనిషత్ సారమైన బ్రహ్మజ్ఞానాన్ని బోధించడానికి ప్రయత్నిస్తున్న నారద మహర్షిని వింతజంతువుని చూసినట్లు చూశారు కిన్నర కింపురుషులు. పూర్తి మానవాకృతిని కలిగి వుండడమే వారి సంభ్రమాశ్చర్యములకు మూలం.

అర్థ నరరూపం మాత్రమే వారి దృష్టిలో అర్థవంతం, సుందరం. ఆపాదమస్తకం మానవ రూపం కలిగివుండడం కింలోక వాసులకి వికారంగానూ విడ్డూరంగానూ కనిపించింది.

విచిత్రరూపా నీవెవరివి?

వికార మర్త్యాకారా నీ నామధేయమేమిటి? ప్రతి సూక్ష్మ విషయాన్ని కిం కిం అని ప్రశ్నించే కింలోక వాసులకి పరమార్థాన్ని బోధించే సాహసం నీకెలా వచ్చింది? అని నారదుణ్ణి నిలదీశారు.

నేను నారదుణ్ణి త్రిలోక సంచారిని

ఇహ పరలోకాలకి అనుసంధానాన్ని నా గానంతో నారాయణుణ్ణే తన్మయుణ్ణి చేసినవాణ్ణి.

ప్రశ్నల కీకారణ్యంలో దారి తప్పి కింలోక పతితుణ్ణయ్యాను. శాపగ్రస్తుణ్ణయ్యాను అని నారదుడు తన పూర్వాపరాలు వివరించాడు.

నారదా కింలోక ఆగమనం అధఃపతనం కాదు ఊర్ధ్వగమనం. అది శాపం కాదు వరం. నిత్యనూతనమైన కింలోకంలో పుణ్యాత్ములే అడుగుపెట్టగలరు. ఏ పూర్వ భాగ్యం వల్లనో నీవు యిక్కడికి వచ్చావు. మా ఊహలు నిత్యనూతనం. మా బుద్ధి ప్రతిక్షణ నవీనం. చివరికి మా శరీరాలూ ముఖాలూ నిత్య ఆధునికాలు.

మాకు పాత అంటే రోత. అందువల్ల ప్రతిదాన్నీ విచ్ఛిన్నం చేస్తుంటాం. కొత్తరూపం యిస్తుంటాం. ఇది నిరంతర ప్రక్రియ అన్నారు కిన్నరులు.

కింలోక వాసుల్లారా కిన్నర కింపురుషుల్లారా నా సందేహాల్ని తీర్చండి. స్థావర జంగమాత్మకమైన ప్రకృతిలో ప్రతిదానికీ స్వభావం వుంటుంది. నిమ్మచెట్టు పుల్లనైన నిమ్మకాయలు కాస్తుంది. ద్రాక్ష తీయని ద్రాక్షాఫలాల్ని యిస్తుంది. దీనినే స్వభావం అన్నారు పెద్దలు. స్వభావో దురతిక్రమః అన్నారు. ఇట్టి సహజ స్వభావాన్ని అతిక్రమించి మీరేమి చేయగలరు అని ప్రశ్నించాడు నారదమునీంద్రుడు.

నారదా మాకు అసలు స్వభావమంటూ యేదీలేదు. మాకు ప్రకృతి లేదు వికృతి మాత్రమే వుంది అన్నారు కిన్నర కింపురుషులు.

మాది విశ్వామిత్ర గోత్రం. మారుషి విశ్వామిత్ర మహర్షి. విశ్వామిత్ర నామధేయం విశ్వానికి అంటే చరాచర ప్రకృతికి అంతటికీ అమిత్రుడు - వైరి అనే అర్థంలో వచ్చింది. తరువాత ఆ పదానికి వ్యాకరణవేత్తలు విశ్వానికే మిత్రుడు అని అర్థం చెప్పారు.

వ్యాకరణ సూత్రాలు సంగతి పక్కనపెట్టి మా ఆదిరుషి విశ్వామిత్ర మహర్షి నిజానికి విశ్వానికి అమిత్రుడే అంటే బద్ధ శత్రువే. ప్రకృతిని దాని స్వస్వరూపంలో వుంచకూడదని ఆయన ఆదేశించాడు. స్వభావం, సహజం వంటి పదాలని ఆయన ద్వేషించాడు. విశ్వామిత్ర మహర్షి అశ్వినీ దేవతలను పిలిచి మానవులూ జంతువులూ అనే రెండు జాతులెందుకు? రెండింటినీ కలిపి వొకే జాతిగా మార్చెయ్యమన్నాడు. అప్పుడు అశ్వినీ దేవతలు కిన్నర కింపురుషులను సృష్టించారు.

అలాగే ఔషధీ దేవతలని పిలిచి నిమ్మనీ ద్రాక్షనీ కలిపి నిమ్మద్రాక్ష ఫలములని సృజించమన్నాడు. కాకరకాయల్నీ బీరకాయల్నీ కలిపి కాకరబీరల్ని ఉత్పత్తి చెయ్యమన్నాడు. ప్రతి సృష్టికి పిలుపు నిచ్చాడు.

నదుల్ని వూర్ధ్వంగా ప్రవహించమన్నాడు. పర్వతాల్ని చదును కమ్మన్నాడు. ప్రతిదాన్నీ స్వభావ విరుద్ధంగా మార్చివేశాడు. వొక వికృతి లోకానికే రూపకల్పన చేశాడు. అదే కింలోకం త్రిశంకు స్వర్గమన్నా అదే.

అంటే అది స్వర్గమూ కాదు నరకమూ కాదు మధ్యస్థితి. కింలోక సారం అదే. అని కిన్నర కింపురుషులు నారదునికి విపులీకరించారు.

సాక్షాత్తూ విష్ణుభగవానుడే శపించేంతవరకూ, నారదుడు యేనాడూ కింలోకం దరి జేరలేదు. కాని కింలోకాన్ని నారదుడు ప్రత్యక్షంగా చూడాలా? అది నారదుని హృదయాన్నే పోలివుంది. అందుకే నారాయణుడు కింలోకానికి పొమ్మని శపించాడు.

అస్తిత్వాన్ని సందేహస్థితికి నెట్టిన లోకం అది.

కాని కేనోపనిషత్కారుడు కింశబ్ద ఆధారంగానే యీ అసహజ కింలోకంలోంచి సహజత్వానికి తిరోగమించి, తరించాడు.

ఐతే కేనోపనిషత్కారుడైన కింపథ మహర్షి కింలోకంలో చెడబుట్టాడని కిన్నర కింపురుషుల నిశ్చితాభిప్రాయం. సహజస్థితిని ప్రేమించిన కేనోపనిషత్ రుషికాదు, సృష్టికి ప్రతిసృష్టిని ప్రకృతికి వికృతిని సృజించిన విశ్వామిత్రుడే తమ గోత్రరుషి అని కింలోక వాసుల నిశ్చయం.

నారదుని చూసేకొలదీ కింశబ్దం పురుగులా దొలవడం మొదలుపెట్టింది.

**కిం నారద వదనం ఈదృశమస్తి?**

**కి మర్థం అన్యథా నాస్తి?**

అనే ప్రశ్న వుదయించగానే, అశ్వినీ దేవతలని ప్రార్థించారు కిన్నర కింపురుషులు. నారద ముఖం యిలాగే యెందుకుండాలి అనేదే ఆ ప్రశ్న. అశ్వినీ దేవతలు రానే వచ్చారు.

తక్షణం కపివదనుడిగా మార్పుచేయబడిన నారదముని రోదిస్తూ నారాయణుని చెంతకు పరుగుపెట్టాడు. క్షమించమంటూ, శాపాన్ని వుపసంహరించుకోమంటూ విష్ణుపాదాలపై వాలిపోయాడు నారదుడు.

చతుర్దశ భువనములూ యెలా పరిభ్రమించగలనని మొరపెట్టుకున్నాడు.

దుఃఖితనారదా నీలో పశ్చాత్తాపం కలిగినందువల్ల శాంతించాను. నీకు పూర్వపు నరవదనమే తిరిగి సంప్రాప్తిస్తుంది. కాని ఏకాంతంలో కాంత దరిజేరినపుడు నీ ముఖము వానర ముఖముగా పరివర్తన చెందుతుంది. అందువల్ల నీవు శాశ్వత బ్రహ్మచారివై భగవద్భక్తితో తరించుము అని ఆశీర్వదించాడు నారాయణుడు.

భగవాన్ నీ శాపములే కాదు వరములు కూడా యెవరికీ అర్థం కావు. కాని నేను ప్రశ్నించసాహసించను. నారాయణ అఖిలగురో భగవాన్ నమస్తే అని చేతులు జోడించాడు నారదుడు.

# శ్వేతదాసుడు

భరతఖండాన్ని ఆక్రమించి సర్వస్వాన్ని దోచుకున్నారు శ్వేతముఖులు.

శ్వేతముఖులు సంపదని ఆశించారే కాని సంపదని దోచుకోవడం వల్ల వచ్చే అపకీర్తిని కాదు. తమ మాట కాదన్న వారి తలలు నరికారు నిజమే కాని చేతికి నెత్తురు అంటడం అపరిశుభ్రమని అనారోగ్యకరమని నాగరికులైన శ్వేతముఖులు భావించారు. భారత ప్రజల సంప్రదాయ సంస్కృతుల్ని నాశనం చేశారు. యధార్థమే కాని సంకుచిత మత మౌఢ్యవాదులన్న అపకీర్తిని మూటగట్టుకుపోవడం యిష్టం లేదువారికి.

శ్వేతముఖులు శ్వేతదేవుణ్ణి ప్రార్థించారు. పరలోకమందున్న ప్రభువా క్షమాహృదయుడవైన నీవు మాకు మరిన్ని పాపములు ఆచరించే అవకాశం కల్పించు. కాని మా చర్యల వల్ల మాకు అపకీర్తి సోకగూడదు. అంతేకాదు నాగరికులము సంస్కర్తలము కరుణామయులమన్న గొప్ప ప్రఖ్యాతి మాకు లభించాలి. ఏడు దినములలో భూమినీ ఆకాశాన్నీ సృష్టించిన నీకు యిది పెద్ద ఘనకార్యం కానేకాదు మమ్మల్ని కనికరించుము అని శ్వేతముఖులు తలలు వంచి ప్రార్థన చేశారు.

వారి ప్రార్థన ఫలించి దేవుడు ప్రత్యక్ష మయ్యాడు శ్వేత పాపులారా మీ అంతులేని పాపపంకిలాన్ని తమ శిరస్సుపై మోయగల గొర్రెవంటి జాతికోసం భరతఖండమంతా గాలించండి. అప్పుడు మీరు పాపవిముక్తులవడమే కాదు. సరికొత్త పాపములను చేసే సదవకాశాన్ని పొందుతారు. అని శ్వేతదేవుడు అదృశ్యమయ్యాడు. శ్వేతదేవుడు యెల్లప్పుడూ తాను యెంచుకున్న జాతికి మార్గనిర్దేశకుడుగా వుంటాడు.

సాక్షాత్తూ పరలోక ప్రభువు సూచించిన గొర్రె వంటి జాతికోసం శ్వేతప్రభువులు గాలించడం మొదలుపెట్టారు. అప్పుడు వారికి పవిత్రగంగా తీరంలో నారదముని గోచరించాడు.

నారదముని నారాయణుని తత్వాన్ని గానం చేస్తున్నాడు. మహతి సుమధురంగా మోగుతోంది.

నారాయణా హే నారాయణా
నీ ఘనత యేముంది ఖగవాహనా
సీతే కదా నిన్ను లంకకు రప్పించి
రాక్షసుల చంపించె సీతాపతీ
లక్ష్మీ కటాక్షమే లక్ష్మీపతిని చేసె
లేకుంటె వైకుంఠమతి దరిద్రము కాదె
నారాయణా హే నారాయణా
నీ ఘనత యేముంది ఖగవాహనా
కరుణామయుండన్న ఘన యశము నీకేల
కపివరులు ఖగవరుడు
సకలజీవులు నీకు పరివారమగుటచే నీ చరిత ఘనమయ్యె నీకీర్తి వ్యాపించె
జీవుడూ శ్రీహరీ యిద్దరూ వొకటన్న
అద్వైత కాంతిలో నీ కీర్తిలయమగును
నీ వునికి మాయమగు
నారాయణా హే నారాయణా
నీ ఘనత యేముంది ఖగవాహనా

యీ గానాన్ని విని శ్వేతముఖులు ఆశ్చర్యపోయారు. శిఖాయజ్ఞోపవీతముల వల్ల అతడు బ్రాహ్మణుడేనని నిర్ధారించుకున్నారు. అతని దరిజేరారు.

ద్విజుడవై యుండి తీవ్ర దైవనిందకు పాల్పడు హేతువేమని ప్రశ్నించారు.

నేను దైవస్తుతియే చేస్తున్నాను దైవనిందకాదు. దీనిని వ్యాజస్తుతి అంటారు. నింద వాచ్యం స్తుతి ధ్వనిపూర్వకమైనది. యిది శ్రేష్ఠమైన నారాయణ స్తుతి అని శ్వేతముఖులకి వివరించి చెప్పాడు నారదముని.

నారదా నీవు మహాపాపివి అని ప్రకటించారు శ్వేతముఖులు. మా మతం ప్రకారం దైవనింద మహాపాపం. దేవుడు తండ్రి ప్రభువు. పరిహాసమునకైనను,

వ్యంగ్యముగానైనను యే విధముగానైనా ప్రభువైన దేవుడిని నిందించడం పాపమే. యింతకన్న ఘనమైన పాపం లోకంలో మరొకటి లేదు. యిట్లు ఘోరాతిఘోర నీచాతినీచ పాపమునకు పాల్పడిన నీపై మా పాపములను కూడా మోపుచున్నాము. నీ పాపమనే సముద్రములో అవి కాకిరెట్ట కన్న యెక్కువ కావు.

యిప్పటినుంచి కర్మభూమిలో మేము ఆచరించిన సకలపాపములకు నిన్ను బాధ్యుని చేస్తున్నాం. మొత్తంగా నీ జాతిపై బ్రాహ్మణజాతిపై బాధ్యతని మోపుతున్నాం. ఆ జాతి ప్రతినిధిగా నిన్ను యెంచుకున్నాము అని వెంటనే పాపభారాన్ని అంతటినీ నారద మహర్షిపై మోపివేశారు శ్వేతముఖులు.

వెంటనే నారదుడు సాధారణ బ్రాహ్మణుడిగా మారిపోయాడు. సకల లోక సంచారం చేసే శక్తిని కోల్పోయాడు. సంగీత సాహిత్య ప్రతిభని కూడా పోగొట్టుకొని అల్పుడిగా మిగిలాడు. శ్వేతముఖుల పాపఫలితమది. చివరికి తన గురించి స్మృతులను కూడా కోల్పోయాడు నారదుడు.

అప్పటినుంచి శ్వేతముఖులు బ్రాహ్మణుల గుణగణాలని నిర్వచిస్తూ గ్రంథాలని రచించి ప్రచారంలోకి తెచ్చారు. బ్రాహ్మణులు మహాపాపులు, క్రూరులు. కరుణ అంటే వారికి తెలియనే తెలియదు. వారి క్రూరత్వం వారు రచించిన తాళ పత్ర గ్రంథాలలో గుప్తంగా వుంది. భయంకరమైన అస్త్రశస్త్రాల గురించి, మారణాయుధాల గురించి సమాచారం ఆ తాటాకు ప్రతుల్లోనే వుంది.

నిజానికి బ్రాహ్మణులు ఆరాధించే దేవతలు కూడా ఆయుధాలని ధరిస్తారు. శిశువులనీ అమాయకులనీ వధించి రక్తం తాగుతారు. శాంతిప్రియులూ కరుణామయు లైన శ్వేతముఖులపై దుష్టశక్తుల్ని ప్రయోగించి వారిని క్రూరులుగా మార్చింది బ్రాహ్మణులే. వారి తాటాకుల్లో అట్టి క్రూరమంత్రాలు దాగివున్నాయి మరి.

అంతేకాదు తమ క్రూర దేవతల హస్తభూషణములుగా అలరారుతున్న భయంకర ఆయుధములనే శ్వేతముఖులకి కానుకలుగా యిచ్చి వశీకరణ మంత్రము లతో జన హననమునకు పురిగొల్పినది విప్రులే.

అంతేకాని శ్వేతముఖులు పుట్టుకతో శాంతిప్రియులు, కరుణామయులు, నాగరికులు, సంస్కర్తలు, చీమకు కూడా హాని తలపెట్టని వారు. అందువల్ల బ్రాహ్మణులే నిజమైన పాపులు, క్రూరులు, విజేతలు.

యిట్టి ప్రచారాన్ని శ్వేతముఖులు విశ్వవ్యాప్తం చేశారు, పాపవిముక్తి లభించడంతో కొత్త పాపాలని ఆచరించడం కోసం, నూతన ప్రాంతాలని వెదుక్కుంటూ వెళ్ళారు శ్వేతముఖులు.

పుణ్యభూమి నుంచి నిష్క్రమిస్తూ శ్వేతముఖులు వొక ధాన్యపు కంకిని పాతిపోయారు. అది నరమాంసభక్షక జాతికి చెందిన మొక్క. రుధిరమే దానికి యెరువు. ఆవరి కంకి నుండి శ్వేతదాసుడు జన్మించాడు. రక్తదాహంతో పుట్టాడు. పుట్టానే పేదజనాన్ని చంపి రక్తం జుర్రుకున్నాడు. మిగిలిన రుధిరాన్ని వరికంకికి యెరువుగా వేశాడు.

అప్పుడు పాపభీతుడైన శ్వేతదాసునికి, శ్వేతముఖుల మార్గాన్నే అనుసరించమని దారిచూపాడు కరుణామయుడైన దేవుడు.

శ్వేతదాసుడు రచ్చబండపై నిలబడి, ప్రజలకి తనదైన సత్యాన్ని ప్రవచించాడు.

కర్మభూమి జనుల్లారా నేను కరుణామయుణ్ణి, నాగరికుణ్ణి, నా రక్తదాహమునకు మాత్రము బ్రాహ్మణులే కారణం. వారి తాళపత్ర గ్రంథములే మూలహేతువు. నిజమునకు నేను మీ హితైషణి, మీ పొలాలలోని వరికంకి నుండే జన్మించాను. మీ అన్నపుమెతుకు లాంటి వాణ్ణి నేను. మీ సహచరుణ్ణి అని ఉపన్యసించాడు శ్వేతదాసుడు.

అబ్బో తాటాకుల్లో యింత మహిమ దాగివుందా అని ఆశ్చర్యపోయాడు బడుగు బ్రాహ్మణుడు. అతడు పూర్వస్మృతిని కూడా కోల్పోయిన శాపగ్రస్త నారదుడే. బ్రాహ్మణులు తాటాకుల వల్ల ఆపారశక్తినీ మహిమల్నీ పొందారన్న వాదన అతన్ని మోహితుణ్ణి చేసింది. ఉన్మాదిని చేసింది. తాటాకులని అసంఖ్యాకముగా పోగుచేసి, వాటిని మంత్రించినచో తనకు కూడా పూర్వ బ్రాహ్మణులకు వలె శక్తులు సంప్రాప్తించ వచ్చును. మహిమలు లభించవచ్చును. అప్పుడు శ్వేతముఖులూ శ్వేతదాసుడూ ప్రవచించినట్లు తాను లోకమునే వశీకరించుకొని శాసించవచ్చును. సకల కష్టములనుండి, దారిద్ర్యము నుండి బయటపడుటయే కాక విశ్వమునే పాదాక్రాంతము చేసికొనవచ్చును. అందుకు కావలసిన వుపకరణములు కేవలము తాళపత్రములే తాటాకులేనని తలపోశాడు పూర్వనారదుడు.

తలచినదే, తడవుగా లెక్కలేనన్ని తాటాకులతో తన పర్ణశాలను నింపివేశాడు. దురదృష్టవశాత్తూ పెద్దగాలివీచి వొక నిప్పురవ్వ ఆ గుడిసెపై పడినది. ఆ పర్ణశాల భస్మీపటలమైనది. అందున్న నారదుడు శాపవిముక్తుడై వైకుంఠమును జేరాడు.

నారదా! బ్రాహ్మణుల తాళపత్రములు మహా మహిమాన్వితమైనవి. సర్వజ్ఞానమూ, సర్వశక్తులూ వాటిలోనే దాగివున్నాయి. అంతేకాదు స్వాహాపతి అగ్నిదేవుణ్ణి తృప్తిపరచగల పవిత్రత కూడా తాళపత్రములలోనే వుంది అన్నాడు శ్రీహరి.

# దాసబోధ

నారద సాక్షాత్కారం కోసం నారాయణుడు తపస్సు ప్రారంభించాడు. భగవంతుడే భక్తుని అనుగ్రహం కోసం వేచివున్నాడు. సృష్టి రహస్యాన్ని భగవంతుడు భక్తుని నుంచి తెలుసుకొనదలచాడు.

భగవంతుడు భక్తుని మానసపుత్రుడా? లేక భగవంతుడే భక్తుడనే మృణ్మయ సాలభంజికను రూపొందించి ప్రాణం పోశాడా? చెట్టు ముందా విత్తు ముందా అనే సందేహంలో పడిపోయాడు అచ్యుతుడు.

భక్తుని వలె మెల్లగా పక్కనజేరి నారదముని భగవంతునిలోనే సందేహబీజాల్ని నాటాడు.

యిప్పుడు నారదయోగీంద్రుడు యెక్కడ వున్నాడు? యీ అనంతకోటి నక్షత్రాలలో శూన్యమే ఆలంబనగా యెక్కడ చరిస్తున్నాడు? నారద విరహం నారాయణుణ్ణి తీవ్రంగా బాధించింది. నారదా అని శూన్యంలోకి పొలికేక వేశాడు విష్ణుమూర్తి.

భక్తియోగమును తత్వవిచారమును చక్కగా మేళవించిన నారదమునీంద్రా! సందేహజీవివని నిన్ను నేను పరిహసించాను. కాని నేనే సంశయ స్వరూపుడిగా మారిపోయాను.

కల్లోల కురుక్షేత్ర సంగ్రామ మధ్యంలో నిశ్చలంగా నిలబడి భగవద్గీతను బోధించాను. మరల మరల సందేహగ్రస్తుడైన నరునికి అనుగీతను బోధించాను. బోధించి బోధించి చివరికి నేనే గీతాసారాన్ని మరచిపోయాను.

శృతిస్మృతి స్వరూపుడైన ముకుందుడు విస్మృతికి గురి యగుట యేమిటి అని నీవు సందేహించవచ్చును సకల జగమూ విస్మయము చెందవచ్చును.

కాని విస్మృతి నా స్వభావములోనిదే. శ్రీరామావతారములో నేను స్వస్వరూప జ్ఞానమునే కోల్పోయాను. మానవుడనై అరిషడ్వర్గములలో చరించి, సుఖదుఃఖ ద్వంద్వ భాజనుడై జీవించి నేనే అనంతుడను కేశవుడను అను పరమార్థమునే మరచి పోయితిని.

అప్పుడు సాక్షాత్తూ దేవగణమే దివినుంచి దిగివచ్చి సప్తరుషులూ పరుగున వచ్చి శ్రీమన్నారాయణుడనను సత్యమును స్తోత్రములతో వేదమంత్ర పఠనముతో గుర్తుకు తెచ్చినారు. తీవ్ర ప్రయత్నమువలన స్వస్వరూప జ్ఞానమును, నేనే సాక్షాత్తూ పరమాత్ముడనన్న సత్యమును తిరిగి పొందగలిగితిని. లేకపోయినచో కేవలం మర్త్యుడనై అంతరించెడివాడను.

నిజముగా నేను ఆత్మజ్ఞానమును తిరిగి పొందానా? లేక మానవ లక్షణములు నాలో మిగిలిపోయాయా?

దైవమునే శపించిన ఘటనా ఘటన సమర్థుడా దాస్యభక్తిని ఆశ్రయించినట్లు చూపులకు స్ఫురించే మహాధీరుడా నారదుడా నీ అద్భుతమైన భక్తి శక్తితో భక్తి సూత్రములను రచించి భక్తులను తన్మయత్వంలో ఓలలాడించావు.

అదే వాగ్గేయ శస్త్రమహిమతో నారాయణునే శపించావు. మాధవునే మానవావతారునిగా చేశావు. అహో నీ కత్తి రెండు వైపులా పదునైనది. నీ వాక్కు అమోఘమైనది. నారదా! నా సందేహాన్ని తీర్చి, తత్వజ్ఞానాన్ని కలిగించు భక్తుల మనస్సులలోని స్వప్నమే శ్రీహరియా? పరాత్పరుడు రజ్జు సర్ప భ్రాంతా? పరమాత్మ స్వప్ననగరమా?

నారదా నా తత్వాన్ని నాకు బోధించుము.

భగవంతుని తపస్సు ఫలించి భక్త నారదుడు ప్రత్యక్షమయ్యాడు. మధుసూదనునికి తత్వబోధ చేశాడు.

నారాయణా! యింతకాలానికైనా యిన్ని యుగములకైనా జ్ఞానోదయమైందా? భక్తునికి భగవంతుడు యెంత అవసరమో, భగవంతునికి భక్తుడూ అంతే ఆవశ్యకం. ఇద్దరూ ప్రేయసీ ప్రియులవంటివారు.

స్త్రీ ప్రాయమితరం జగత్. నారాయణుడు తప్ప యితరులందరూ స్త్రీలేనని వైష్ణవులు ప్రవచిస్తున్నారు. రతి ఆనందానికి స్త్రీపురుషులు యిద్దరూ అవసరమైనట్లే బ్రహ్మానందానికి జీవుడూ బ్రహ్మమూ యిద్దరూ ప్రధానమే. జగతోస్య జగచ్చసః జగత్తులేనిదే జగదీశ్వరుడు లేడు అని తత్వబోధ చేశాడు నారదుడు. పవిత్ర సరయూనదీ తీరంలో నారదగీత బోధించబడింది.

నారద గీతా బోధవిని నారాయణుడు చిరునవ్వులు చిందించాడు. నారదా భక్తులు తమ భక్తితత్వంలో భగవంతుణ్ణి కరిగించివేస్తారు. త్వమేవాహం అంటూ భగవంతుని ప్రత్యేక అస్తిత్వాన్నే రద్దు చేస్తారు. భగవంతునికి భక్త గణమువల్లనే మహాప్రమాదం అన్నాడు పరమాత్మ.

ఆ సమయంలోనే సరయూ తీరంలో వొక వేదికపై నిలబడి శ్వేతదాసుడు అధర్మబోధ ప్రారంభించాడు. భారతీయులారా నేను మహాశక్తిశాలిని. శ్వేతముఖుల వద్ద సకల విద్యలు నేర్చిన ధీశాలిని. మీకు భగవత్తత్వం బోధించదలచాను.

నేను దేవుడిని శాశ్వతుడిని చేయదలచాను. అందుకే దేవదేవుడిని శిలగా మలచి, ఆలయములో ప్రతిష్ఠించదలచాను. వర్షమునకు కాని, తీవ్ర ఆతపమునకు కాని శిథిలముకాని శిలను శ్వేతముఖుల లోకము నుండి తీసుకువస్తాను. ఆ శిలను క్షణములో శిల్పముగా మలచగల యంత్రమును కూడా ఆ మహాలోకము నుండే తీసుకు వస్తాను. దేవుణ్ణి భౌతిక వాస్తవంగా మారుస్తాను.

యిప్పుడు భారతఖండములో గల దేవాలయములు చాలా పురాతనమైనవి. నేను శ్వేతముఖుల దేవాలయమును బోలిన దేవాలయమును నిర్మించి మన దేవునికి నూతనత్వమునూ, దృఢత్వమునూ, శాశ్వతత్వమునూ పరికల్పిస్తాను. భక్తుల హృదయంలో కాక, నేలమీద దృఢంగా నిలుపుతాను.

యిట్టి దేవాలయమును యితర ప్రార్థనా స్థలమును కూల్చి నిర్మించినచో కొత్తగా పునాది వేయవలసిన కష్టము వుండదు. అందువల్ల ప్రార్థనా స్థలమును ధ్వంసం చేయవలెను.

విధ్వంసం వల్ల శక్తి పుడ్తుంది. అణుశక్తి యిట్టిదే. మనలో నవీన దేవాలయ నిర్మాణమునకు కావలసిన శక్తి జనించవలెనన్నచో యితరుల ప్రార్థనాలయమునొక దానిని కూల్చవలెను. అప్పుడు మన శరీర మనస్సులు నూతన జవసత్వములతో నిండిపోవును. యిది శ్వేతముఖుల జ్ఞానబోధ.

మహావిజ్ఞానులైన శ్వేతముఖులు వూరికే వినోదము కొరకు ఇతరుల రాజ్యములను ధ్వంసం చేస్తూ వుంటారు. కేవలం వినోదము కొరకే వారు అట్లు చేస్తూ వుంటారు. అలాగే లక్షలాది మందిని శతఘ్నులతో హతమారుస్తూ వుంటారు. నిజమునకు వారికి యెట్టి ద్వేషభావమూ లేదు. శ్వేతముఖులు శాంతి ప్రియులు. యిట్టి విధ్వంసకాండ వల్ల వారిలో శక్తి జనిస్తుంది. వారి ఆరోగ్యమూ వృద్ధి చెందుతుంది.

విధ్వంసం వొక ఆరోగ్యకరమైన క్రీడ వారికి. అందువల్ల మనం శ్వేతముఖులను అనుకరించుచు మహాశక్తి శాలురము కావలెను.

అట్టి మహాశక్తితో దృఢ సంకల్పముతో గండ శిలను శిల్పముగా చేయవలెను. భగవంతుడు సర్వాంతర్యామియను వ్యర్థ వేదాంతమును విడనాడవలెను.

నా బోధ విని యీ మహావిధ్వంస నిర్మాణమునకు సన్నద్ధులు కండి. మనం మన దేవుణ్ణి శాశ్వతుణ్ణి బలవంతుణ్ణిగా మారుద్దాం. మనదేవుడికి సకల శక్తుల్నీ ప్రదానం చేద్దాం. మనదేవుణ్ణి నాగరికుణ్ణి చేద్దాం. నవీనుణ్ణి చేద్దాం అని శ్వేత దాసుడు బోధించాడు.

నారదా! ఛత్రపతి శివాజీ గురువు సమర్థ రామదాసు దాసబోధ రచించిన పుణ్య భూమి యిది. యిక్కడ నీచమైన శ్వేత దాసబోధ వినవలసి వచ్చింది. అంతా నా కర్మ. తపస్సుకి అర్హమైన ధర్మ భూమి అని భరత ఖండమునకు వచ్చాను. కాని యిది దాస్యముతో నిండిపోయినది. యిక్కడ శ్యాములునికి చోటులేదు. అని వైకుంఠ నిలయుడు మటుమాయమయ్యాడు.

# శ్వేతదాసుని మాయాశిల్పం

శ్వేతదాసుడు ధనుర్ధారియైన శ్రీరామ చంద్రుని విగ్రహాన్ని మలచాడు. కాని శ్రీరాముని వామపార్శ్వములో సీతామహాలక్ష్మి లేనేలేదు.

**సీతా రహితమైన రఘురామ శిల్పం**

**యెంతటి మహాపచారం. యెంతటి ఘోరం.**

తక్షణమే వైకుంఠవాసియైన శ్రీధరునిలో గుబులు రేగింది. సిరికింజెప్పక, శంఖచక్రయుగమును చేదోయి సంధింపకుండా, గరుడ వాహనము లేకుండా పరుగు పరుగున భూలోకానికి జేరాడు నారాయణుడు. శ్వేతదాసునికి ప్రత్యక్షమయ్యాడు. సాక్షాత్తూ శ్రీరామచంద్రుని రూపంలో సాక్షాత్కరించాడు.

శ్వేతదాసుడు సంభ్రమాశ్చర్యాలకు గురయ్యాడు.

ధనుర్ధారీ రాజ్యలక్ష్మీ ప్రదాతా శ్రీరామచంద్రా నేను నీ అపురూప శిల్పాన్ని పూర్తి చేయగానే నీవు ప్రత్యక్షమయ్యావు. యిది నా అదృష్టం. జ్యోతిష్కులు నాకు ప్రతినిత్యం చెప్తూనే వున్నారు. నావిష్ణుః పృథివీపతిః అనే ఆర్యోక్తిని అనుసరించి, నేను పృథివీపతినై విష్ణుతుల్యుడనవుతానని ఢంకా బజాయిస్తున్నారు. నేను యుద్ధ సన్నద్ధమైన నీ మూర్తిని కల్పించాను. నేను కూడా అధికారం కోసం సమరభేరిని మోగించుట వలన నీ రూపమును యీ విధముగా మలచాను. అన్నాడు శ్వేతదాసుడు.

శ్రీరామతత్వ దూరా శ్వేతదాసా! మహారణ్య మందైనను, స్వప్నావస్థ యందైనను నన్నొక్క క్షణము కూడా విడువక వెన్నంటి యుండే నా ధర్మపత్ని సీతాదేవి తోడు లేకుండా నన్ను వొంటరి వానిగా యేల చిత్రించినావు. నా కట్టి దుర్భరవియోగతాపాన్ని యెందుకు కల్పించావు. ప్రవృత్తి మార్గ పరతంత్రుడనైన నాకు కాషాయ వస్త్రములను చుట్టి సాధుపుంగవునిగా సన్యాసిగా మార్చుటలోని ఆంతర్యమేమి? యుద్ధ రంగమునందు నేను విజృంభించినది కూడా జానకి కోసమే. మైథిలి వినా నేను లేను. నేను వూహలో కూడా సీతావియోగాన్ని భరించలేనని నీకు తెలియదా? నీవు

వొక్క మార్తైనా శ్రీమద్రామాయణమును పఠించావా? వాల్మీకి కోకిలారావములకు చెవి యొగ్గావా అని గద్దించాడు రాఘవుడు.

శ్వేతదాసుడు వెటకారంగా నవ్వుతూ సమాధానం చెప్పాడు.

అయోధ్యా చక్రవర్తీ శ్రీరామ చంద్రా నీకు సీతావియోగం అలవాటైన విషయమే. సాక్షాత్తూ నీవే ఆరాధనాయ లోకస్య, ముంచతో నాస్తి మేవ్యథా అంటూ లోకం కోసం సీతాదేవిని ఘోరారణ్యంలో త్యజించావు. అధికార ప్రాప్తి కోసం యీవొక్కసారీ నేను శ్రీరాముణ్ణి వొంటరిగా చిత్రించడం వల్ల మునిగే దేమీ లేదు అని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పాడు శ్వేతదాసుడు.

అధికార దాసా శ్వేతదాసా శ్రీరామ అవతార తత్వం నీ బోటి అజ్ఞానులకు అర్థం కావడం అసాధ్యం. భూజాత సీత లేనిదే శ్రీరామ చంద్రుడు లేడు. శక్తి లేనిదే యీశ్వరుడు లేడు. దీనినే అర్థ నారీశ్వర తత్వం అంటారు. నన్ను పరమ భాగవతులు సీతాయాః పతయే నమః అని భజిస్తారు. సీతాపతిగానే నా ప్రతిష్ఠ.పరమభక్తాగ్రేసరుడు శ్రీరామదాసు దయచూడమని చెప్పవే సీతమ్మ తల్లీ అని అమ్మవారినే వేడుకొన్నాడు. కాని ప్రత్యక్షంగా నాకు కష్టసుఖాలను విన్నవించుకోలేదు.

తల్లి లేనిదే తండ్రి లేడు. అందుకే మొదటిగా మాతృదేవోభవ అని బోధిస్తారు గురువులు. అసలు పితరౌ అనే పితృశబ్దపు ద్వివచనానికి తల్లిదండ్రులు యిద్దరూ అని అర్థం. అంటే, యిద్దరినీ విడదీయలేం. విడదీయడం ధర్మభ్రష్టత్వం. అందుకే కాళిదాసు జగతః పితరౌవందే అని దైవస్తుతి చేశాడు. రామశబ్దానికి దీర్ఘమిస్తే రామాశబ్దం అవుతుంది. దానికి స్త్రీ అని అర్థం. స్త్రీత్వం నుంచి పురుషోత్తముణ్ణి విడదీయడం అసాధ్యం. సాక్షాత్తూ శ్రీమద్రామాయణాన్ని సీతాయాః చరితం మహత్ అని కీర్తించారు.

రాజధర్మాన్ని అనుసరించడం వల్లనూ, లోకభీతి వల్లనూ నేను సీతను త్యజించినా, స్వర్ణ సీతను పక్కన కూర్చోబెట్టుకొని అశ్వమేధక్రతువుని పూర్తి చేశాను. కర్మభూమిలోని సకల రామాలయములలోనూ సీతారాములు దంపతులుగా దర్శనమిస్తారు. కాని ఏకాకి రాఘవుడు యెక్కడా కానరాడు. ధర్మవిదూరా శ్వేతదాసా యిట్టి అఘాయిత్యానికి యెందువల్ల పాల్పడ్డావు. గృహస్థ ధర్మమునకు రుషివాక్కుకి విరుద్ధమైన యిట్టి కల్పనకు యెందువల్ల తెగించావు అని ప్రశ్నించాడు దాశరథి.

అయోధ్యా వల్లభా శ్రీరామా శ్వేతముఖులనే ఆదర్శంగా తీసుకొని నేనీ శిల్పాన్ని రూపొందించాను. అనాగరికులమైన మనకి పరిపాలించుకోవడమెలాగో నేర్పింది శ్వేత ప్రభువులే. శ్వేతముఖుల మతం ప్రకారం భగవంతుడు ప్రభువు, లోకపిత. ఆయన స్వచ్ఛమైన పురుషుడు. స్త్రీత్వపు కాలుష్యంలేని పురుషుడు అట్టి పురుషదేవుడే మగతనానికీ ఆధిపత్యానికీ చిహ్నంగా విరాజిల్లగలడు. అధికార పీఠానికి మార్గం చూపగలడు.

శత్రుభంజకా శ్రీరామా నిన్ను నేను సంస్కరించాను. అసలైన మగవాడివిగా రూపమిచ్చాను. సీతాపతిగా కాక లోకపితగా పరలోకపితగా నిన్ను నాగరీకరించాను. నిన్ను శ్వేత దేవుడితో జతకలిపాను. శ్రీరామా నిన్ను శ్రీమద్రామాయణమనే శిథిలపురాతన గ్రంథం నుంచి విముక్తుణ్ణి చేశాను. పూర్తిగా అధికారానికి , విస్తరణకి చిహ్నంగా మలచాను అని శ్వేతదాసుడు తన చర్యని సర్వాత్మనా సమర్థించుకొన్నాడు.

సనాతన తత్వ సారా శ్రీరామా! పూర్తి యథార్థాన్ని నీకు వివరించి చెప్తాను. శ్రద్ధగా విను.

నేను నీ భక్తుడిని కాదు. నీకు దాసుడిని కాదు. నేను శ్వేతముఖులకు దాసానుదాసుణ్ణి. శ్వేతదాసుడను నా నామధేయము సార్థకమైనది.

రామనామము రోమ్‌కి పోలిక కలిగి వుంది. రామరాజ్యం రోమన్ సామ్రాజ్యం అను పేర్లు సాదృశ్యముతో అలరారుతున్నాయి. నేను రోమ్ భక్తుడినే కాని రామ భక్తుడిని కాదు. శ్రీరాముడు జన్మించిన దేశములో రామనామమును అధికార సోపానములుగా స్వీకరించక తప్పదు. అంతస్సారము మాత్రము శ్వేతముఖమే.

శ్రీరాఘవా నీవు జాగ్రత్తగా పరిశీలించినచో నేను చిత్రించిన ముఖము శ్వేతముఖునిదే యని తత్వమును గ్రహించగలవు అని వాస్తవాన్ని కుండబద్దలు కొట్టినట్లు చెప్పాడు శ్వేతదాసుడు.

శ్రీరామ పరంధామా లక్ష్మీపతే విష్ణో చింతామాస్తు. పౌండ్రక వాసుదేవుడు యథార్థ వాసుదేవుడు కానేరడు. మాయాప్రవరుడు వస్తుతః ప్రవరుడు కాదు. శ్వేతదాసుడొక మాయావి. అతడు రూపమిచ్చిన శిల్పము మాయాశిల్పము.

అది పరమార్థమునకు శ్రీరామ పరమాత్ముని నిజరూపము కానేరదు. యీ సత్యమును తత్వవిదులు తెలుసుకొనగలరు అని నారదముని నారాయణుణ్ణి వోదార్చాడు.

# చండరోముని వృత్తాంతం

**తా**ను రూపొందించిన శ్రీరామ శిల్పమును చూసి తానే ముగ్ధుడయ్యాడు శ్వేతదాసుడు. తన ప్రతిభను తానే మెచ్చుకున్నాడు. శ్వేతముఖుల ప్రమాణములను అనుసరించి శిల్ప శాస్త్రమును సమూలముగా సంస్కరించవలెనని భరత ఖండమందలి స్థపతులందరికీ బోధించాడు.

శ్వేతముఖులు అందరూ అతని మాయాశిల్పమును వేనోళ్ల కొనియాడారు. పరమార్థమునకు నిర్గుణ నిరాకార తత్వముగా మహర్షులందరిచే కీర్తింప బడిన శ్రీరామ చంద్ర పరమాత్మునికి తన శిల్పము వికృతముగా కనబడుటవల్ల వచ్చిన నష్టమేమిటి? పైగా ప్రపంచమును పరిపాలించుచున్న శ్వేతముఖులు మెచ్చుట వలన తన శిల్పమునకు విశ్వవిఖ్యాతి లభించినది అని మురిసిపోయాడు శ్వేతదాసుడు.

ఆ మాయాశిల్పమును వేదవేదాంగవిదులైన ఆస్తిక వరేణ్యులెవరూ మెచ్చలేదు. మొక్కలేదు. కాని శ్వేతదాసుని గురువైన శ్వేత విజయస్వామి మాత్రము వేనోళ్ల కొనియాడాడు. వెంటనే మాయా మానుష విగ్రహుడైన విష్ణుభగవానుడు నవ్వుతూ యిట్లు పలికినాడు. కాషాయ వేషధారీ శ్వేతవిజయస్వామీ! నీ బోటి గొప్పవానికి వుచితమైన స్థానమును నేను కల్పించుచున్నాను. శ్రీకృష్ణ జన్మస్థాన ప్రాప్తిః అస్తు అని ఆశీర్వదించినాడు. అట్లే తక్షణం శ్వేత విజయస్వామికి శ్రీకృష్ణ జన్మస్థాన ప్రాప్తి కలిగినది. దైవవాక్కు వ్యర్థము కాదు.

తను చెక్కిన రామశిల్పమును చూసిన కొలదీ చిత్ర విచిత్రమైన ఆలోచనలు చెలరేగాయి శ్వేతదాసునిలో. ఆ ఆలోచనలు ఉత్తమ చిత్రములు వీక్షించునపుడు సీతమ్మవారిలో కలిగిన నిష్కల్మషమైన వూహలవంటివి కావు. భవభూతి మహాకవి రచించిన ఉత్తర రామచరిత నాటకములో వొక కళాకారుడు గంగాతీర మందలి రుష్యాశ్రమ చిత్రములను చిత్రించి రాజదంపతులకు బహూకరించాడు. ఆ చిత్రములను చూసి జానకి ప్రశాంత చిత్తురాలిగా మారింది. ఆ పవిత్ర ప్రశాంత వాతావరణములో తిరిగి నివసించాలనే కోరిక కలిగింది ధరణీ తనయకి. ఆమె మనస్సు నిర్వికల్ప ప్రశాంతమయమైపోయింది. ఆ చిత్రములు అట్టివి. ఆ చిత్రముల

వెనుకదాగిన కళాకారుని హృదయము అంతటి నిష్కల్మషమైనది, ఆత్మజ్ఞాన పూర్ణమైనది.

కాని శ్వేతదాసునికి స్వీయపరికల్పిత క్షుద్ర శిల్పమును చూసినపుడు కలిగినది అట్టి ప్రశాంత చిత్తవృత్తి కాదు. కల్లోలమూ అధికార దాహమున్నూ. సంసారతారకుడైన తారకరాముని రూపము శాంతి భావమునే ప్రేరేపిస్తుంది. యోగినాం హృదయేషు రమతీతి శ్రీరామః యోగుల హృదయములలో ఆనందకేళి సలిపే పరమాత్ముడే శ్రీరాముడు. యోగః చిత్తవృత్తి నిరోధః అను యోగపరమార్థము శ్రీరామచంద్రుడే తప్ప అన్యుడు కాదు.

కాని శ్వేతదాసునికి యోగము పట్ల ఆసక్తి లేదు. రాజయోగం, అధికారయోగం యివే అతని లక్ష్యాలు. అందుకే శిల్పమును చూసుకొన్నపుడు రావణ హిరణ్యాక్షాది రాక్షసులవలె అహంకారము వుద్రేకించినది. విజయకాంక్ష వుప్పతిల్లినది. అదికారదాహము మిక్కుటమైనది.

అట్టి అజ్ఞాన మదాంధతవల్ల శ్వేతదాసుడు యెంతకైనా తెగించాడు. తననే శ్రీరాముడిగా ప్రకటించుకోవడంతో అతని అవివేకము తారాస్థాయినందుకొన్నది.

నేనే శ్రీరామ చంద్రుడను. నేనే అయోధ్యాధిపతిని, నన్నే అందరూ ఆరాధించండి అంటూ ధనుర్బాణములను ధరించాడు. సొంత రథమును కూర్చుకున్నాడు. అరణ్యములోని వానరములను బంధించి, చిత్రవిచిత్ర పద్ధతులలో వాటిని హింసించి దారికి తెచ్చుకొని, కపిసేనను కూర్చుకున్నాడు. చివరికి తన పేరుని చండరాముడిగా మార్చుకున్నాడు.

శ్వేతదాసుడు చండరాముడు అని పేరు మార్చుకున్నాడు కాని పుణ్యభూమిలోని జనులెవ్వరూ ఆ నామధేయముతో పిలవడానికి సాహసించలేదు. అట్లు చేసినచో రౌరవాది నరకములు ప్రాప్తించునని భయకంపితులయ్యారు.

అతడి ఆగడములను భరించలేక, అతనిని కాదను ధైర్యము లేక కర్మభూమి జనులు ఆ దుష్టుడిని చండరోముడు అని సంబోధించడం ప్రారంభించారు. రామనామానికి బదులు రోమ శబ్దంతో వ్యవహరించడం మొదలుపెట్టారు. అతడు వెంట్రుకవలె తీసిపారవేయదగినవాడు అను భావము మనసులో గోప్యముగా వుండుట వలన, వారు అట్లు పిలవడం ఆరంభించినారు.

ఆ బుద్ధిహీనుడు మత్తుడై యీ మార్పుని గమనించనే లేదు.

చండరోముని అజ్ఞానమునకూ అహంకారమునకూ అవధులు లేకుండా పోయాయి. పేరు మార్చుకొనుటతో సరిపోదు. ప్రవర్తనలో కూడా శ్రీరాముని అనుకరించుటతో పరిసమాప్తము కాదు. నేను కూడా ఇక్ష్వాకు కులాధీశుని వలె యజ్ఞము ఆచరించవలెను. అశ్వమేధయాగమును తల పెట్టవలెను. అప్పుడే నేను అవతారపురుషుడను, సూర్యవంశపు చక్రవర్తిని అని మూర్ఖప్రజలు విశ్వసిస్తారు అని చండరోముడు తలపోశాడు. వెంటనే పండితులను పిలిచాడు.

చండరోముని అవివేకమును అహంకారమునూ గమనించి వేద వేదాంత వేత్తలైన భూసరురులు ముక్కుమీద వేలు వేసుకొన్నారు.

అవతారపురుషుల వాక్కులను అనుసరించినచో సద్గతులు కలుగును. కాని వారి చర్యలను అనుసరించి వారివలె బుద్ధిశాలురము, బల శాలురము, మహిమాన్వితులము కావలెనని భావించుట ఘోరాపరాధం కలి ప్రభావం.

ఈ సత్యము తెలిసినను చండరోముని కాదని నిలుచు ధైర్యము బుధులకు లేదు. అతనిని కాదనిన వారు యెంతటి బుద్ధి శాలురైనను, నిష్టాగరిష్ఠులైనను వారిని అతడు నాస్తికులని నిందించును. అపకారము తలపెట్టును.

అసలు చండరోముని క్రూరత్వమును యీషణ్మాత్రమైనను యెరిగిన వారు అతనికి యెదురు చెప్ప సాహసించరు. ప్రచండ రోముడు కేవలము వినోదము కోసము గర్భిణిని చంపి గర్భస్థపిండమును బయటకు తీసి వికటాట్టహాసము చేసిన ఘనుడు. అంతకన్న ఘోరమైన పాపము అతడి శిల్పము.

అందువల్ల అతడిని కాదనలేక నారదునికి మొరపెట్టుకున్నారు వేద పండితులు.

నారదముని పురోహితుని వేషంలో చండరోముని సన్నిధికి వెళ్లాడు. అశ్వమేధయాగానికి తెలివిగా అవరోధం కల్పించాడు.

రాజాధిరాజా చండరోమా నేను సాక్షాత్తూ విశ్వేశ్వర నిలయమైన వారణాశి నుంచి వచ్చిన మీమాంసా పండితుడిని. యీ కలియుగములో అశ్వమేధయాగము ఆచరించదగినది కాదు. అట్టి మహాక్రతువును పరిపూర్ణముగా నిర్వహించగల ఋత్విక్కులు దుర్లభులు. అదియును గాక కలి దోషమువలన అశ్వమేధ మంత్రములు అనేకములు ఖిలమైపోయినవి.

రామాభాసుడా చండరోముడా నీవు సాక్షాత్తూ శ్రీరామచంద్రుడివి కాదు. నిన్ను నీవు దాశరథిగా ప్రకటించుకున్నావు.

యీ సందర్భమునకు తగిన పురాణ వృత్తాంతమును నేను చెప్పుతున్నాను. యీ కథను వినుట వలన నీకు తత్వబోధ కలుగును. శ్రద్ధగా వినుము.

ద్వాపరయుగములో శ్రీకృష్ణుడు కైలాసమునకు వెళ్లిన సమయంలో పౌండ్రక వాసుదేవుడు అనువాడు తానే వాసుదేవుణ్ణి అని ప్రకటించుకొన్నాడు. శ్రీకృష్ణుని వలె వేషధారణ చేసి చక్రమును కూడా ధరించాడు. ద్వారకా పట్టణమునకు వెళ్లి శ్రీకృష్ణుని రాజసింహాసనాన్ని ఆక్రమించాడు.

రుక్మిణీ వల్లభుడైన వాసుదేవుణ్ణి వెర్రి గొల్లడని అవమానించాడు. తాను క్షత్రియుణ్ణని, తానే రాజ్యాధికారమునకు సర్వవిధములా అర్హుణ్ణని విర్రవీగాడు. చివరికి యెంత అహంకరించాడంటే వాసుదేవ కృష్ణుడనే నామధేయమును విడిచి పెట్టి పొమ్మని హెచ్చరించాడు.

అవతారతత్వ విదూరుడా చండరోముడా! పౌండ్రకవాసుదేవడను అనుకరణ శీలియైన అహంకార మదాంధుడు చివరికి కృష్ణ చక్రంవల్ల శిరస్సు తెగి దుర్మరణాన్ని పొందాడు.

కారణమేమిటి? పౌండ్రక వాసుదేవుడు నిజమునకు వాసుదేవుడు కాదు. అతడి చక్రము యథార్థమునకు మహిమాన్వితమైన విష్ణుచక్రము కానేరదు. అతని శౌర్యమూ వాస్తవము కాదు. అంతా అనుకరణ. అనుకరణ శీలత అపమృత్యువుకి దారితీస్తుంది అని శృతిస్మృతి పురాణవేత్తలు బోధిస్తున్నారు.

కలికాల జన్యుడా చండరోముడా! యీ కథను నీకు గుర్తు చేయుటకు కారణమేమిటంటే-నీవు స్వత్వమును కోల్పోయావు. పూర్తి అనుకరణ శీలిగా మారావు.

నీవు శ్వేతముఖుల మానస పుత్రుడివి. నీకు వేదభూమితో యీషన్మాత్రమూ అనుబంధము లేదు. నీవు నిజమునకు శ్రీరామచంద్రుని కాదు శ్వేతముఖుల ఆచార వ్యవహారములను సర్వాత్మనా అనుకరించుచున్నావు. నీవు నిజముగానే శ్వేతదాసుడివి. నీది అప్రాచ్యబుద్ధి. నీకు రాముడొక మిష మాత్రమే. అధికార సోపానము మాత్రమే.

స్వతంత్ర బుద్ధి విహీనా చండరోమా! అశ్వమేధయాగమును ఆచరించాలనే కోరిక కూడా నీకు అనుకరణ శీలత వల్ల వచ్చినదే. శ్రీరామాది మహాచక్రవర్తులు

ఆచరించిన గొప్ప యాగమది. అది నీకు అసాధ్యము అని హితవు పలికాడు నారద మహర్షి.

పురోహితా! నీవు చెప్పినదంతయు వాస్తవమే. నేను శ్వేతదాసుడినే, శ్వేతముఖుల మానస పుత్రుడినే, అప్రాచ్యుడినే.

అధికార ప్రాప్తికోసం ధర్మమునూ సంస్కృతినీ మనకు అనుకూలముగా నిర్వచించుకొనవలెను. యిది శ్వేతముఖులు భారతీయులకి నేర్పి పోయిన విద్యయే. అట్టి విద్యలో నేను ఆరితేరిన ఘనుణ్ణి అని తెలుసుకొనుము.

ధరణీ సురోత్తమా! నేను సింహాసనము అధిష్టించవలెనని నచో, గొప్ప యాగమును దేనినైనను ఆచరించవలెను. అద్యతన కాలములో అది అత్యంత ఆవశ్యకము అన్నాడు చండరోముడు.

అప్పుడు నారదమునీంద్రుడు తీవ్ర ఆలోచనా నిమగ్నుడయ్యాడు. తాళపత్రగ్రంథ ములను పరిశీలిస్తున్నట్లు నటించాడు. చివరికి గార్దభమేథము ఆచరించమని ఆజ్ఞాపించాడు. యిట్టి యాగము కలికాలములో కూడా సంపూర్ణ ఫలప్రదము అని శాస్త్ర ప్రమాణములు చూపాడు.

**అశ్వో గార్దభతా మేతి**
**గార్దభో తురగాయతే**
**తస్మాత్ గార్దభమేథోపి**
**శ్రేష్ఠో భవతి సర్వదా.**

కాలమహిమవల్ల అశ్వరాజము గార్దభమై దుఃఖమును అనుభవించుచున్నది. కలి కాలపు ప్రభావము వల్లనే గార్దభము తురగమై విర్రవీగుచున్నది.

అందువల్ల అశ్వమేథం లాగే గార్దభమేథం కూడా శ్రేష్ఠమైనది.

యిదీ నారదుడు చూపిన మిథ్యా శాస్త్ర ప్రమాణం.

వెంటనే చండరోముడు గార్దభమేథం ప్రారంభించాడు. ఆలస్యం అమృతం విషం. తలపెట్టిన కార్యమును జాప్యము లేకుండా ఆచరించవలెనని చండరోముని నిశ్చితాభిప్రాయం.

పండితులు కల్పిత మంత్రములతో గార్దభయాగమను నూతన యాగమునకు చండరోముని చేత నాంది పలికించారు. అట్టి హీనుని సమక్షంలో వేదమంత్రములను వుచ్చరించరాదు.

అందువల్ల కృత్రిమ మంత్రములను కల్పించి, స్వరములు కూర్చి హోమములు చేయించారు.

గార్దభాయ స్వాహా
గార్దభతుల్యాయ స్వాహా
గార్దభాదపి హీనాయ స్వాహా
గార్ధభాదపి నిందితాయ స్వాహా
జంతుతుల్యాయ స్వాహా
వరాహ సదృశాయ స్వాహా
దుష్టాగ్రేసరాయ స్వాహా
అప్రాచ్యతత్వాయ స్వాహా

యిత్యాది మంత్రములతో హోమము నిర్వర్తింపజేశారు.

హోమము ముగిసిన తర్వాత చండరోముని గార్దభ వాహనంపై వూరేగించారు. వూరేగిస్తూ యిట్టి కల్పిత శ్లోకములను సామగానము వలె సాగదీస్తూ పఠించారు.

గార్దభస్య స్వరం ఘోరం
దుష్టస్యాలోచనం కలౌ
బహుధా కీర్త్యతే మూర్ఖైః
వివేక భ్రష్ట దుర్జనైః

దీని భావమేమి తిరుమలేశ అంటే – గార్దభము యొక్క ఘోరమైన స్వరాన్ని దుష్టుని ఆలోచనని కలికాలంలో అనేక విధములుగా కీర్తిస్తారు. యెవరయ్యా ఆ కీర్తించే వారంటే, మూర్ఖులూ, వివేక హీనులూ, దుర్జనులూ ఆవిధంగా స్తుతిస్తారు.

బుద్ధిహీనుడైన చండరోమునికి అర్థతాత్పర్యములేమి తెలుసు? అందుకే పండితులు దుష్టున్ని ఆవిధంగా ఆటపట్టించారు.

యిట్టి దుర్బుద్ధిని, రామతత్వ దూరుణ్ణి పండితులు భయంతో సేవించవలసి రావడం చూసి హనుమంతుడు కోపోద్రిక్తుడయ్యాడు. యిట్టి మూఢుడినా సేవించుటయని స్వయముగా మహాపండితుడైన పవన తనూజుడు తలపోశాడు.

యీ చండరోమ అపరనామధేయుడైన శ్వేతదాసునికి అమరవాణి అంటే యేమిటో తెలియదు. శృతిస్మృతి పురాణముల గురించి అసలే యెరుగడు. క్షుద్రశ్వేతముఖుల సేవలో తరించి వారి వాక్కులనే తనవిగా చేసుకున్న పెంపుడు చిలక యితడు. యితనికి వాక్ శుద్ధి లేదు.

రావణబ్రహ్మనైనను సేవించుటలో పరమార్ధమున్నది, రావణబ్రహ్మ వేదవేదాంగములు శ్రద్ధగా అభ్యసించిన బ్రాహ్మణోత్తముడు. అతని రాజస స్వభావమువలన చంచల బుద్ధివలన చెడిపోయి రాక్షసుడిగా ప్రసిద్ధి కెక్కాడు రావణబ్రహ్మ.

కాని దశకంఠుడు గొప్ప శివభక్తి పుంగవుడే కాదు శివకవి కూడా. అతడు రచించిన శివస్తోత్రములో కూడా అతని రాజస స్వభావమే వుట్టిపడును. జటాకటాహ సంభ్రమ, భ్రమన్నిలింప నిర్ఝరీ విలోలవీచివల్లరీ విరాజమాన మూర్ధని యిత్యాదిగా రావణ విరచిత శివస్తోత్రం గంగా నిర్ఝరిణివలె యెగసిపడు తరంగములతో గొప్ప వేగముతో సాగును. అది రావణ బ్రహ్మయొక్క స్వభావమును కూడా పట్టియిచ్చును.

పౌలస్త్యుడు సీతామహాలక్ష్మిని అపహరించి మహాపరాధమునకు పాల్పడినాడు నిజమే. అదే అతని అధఃపతనమునకు ముఖ్యకారణము. కాని అశోకవనములో జానకిని భద్రముగా నిక్షేపించి, ఆమె అనురాగ వీక్షణము కొరకు నిరీక్షణలోనే గడిపినాడు. నిరీక్షణలోనే మరణించాడు. కాని చెరపట్టలేదు. హద్దులను అతిక్రమించలేదు. యిది అతని రాక్షసత్వములో దాగిన వివేకము.

చండరోముడు రావణబ్రహ్మ యొక్క కాలిగోటికి కూడా సరిపోలడు. అధికారదాహము తప్ప వివేకము లేనివాడు. యితనివాక్కా? అహంకార భరితం; జ్ఞాన శూన్యం. దైవమును కూడా అధికార సోపానముగానే భావించు హీనుడీ చండరోముడు.

చండరోముని తక్షణమే హతమార్చవలెనని ఆంజనేయుడు నిశ్చయించుకొనెను. అందువలన భూభారము తగ్గి భూదేవి హాయిగా వూపిరి పీల్చుకుంటుందని తలచాడు. సీతమ్మవారి తల్లే కదా భూదేవి. అంజనీసుతునికి మాతృసమురాలు. ఆమె భారమును తన భారముగా తలచి విముక్తిని ప్రసాదించదలచాడు.

కాని నారద మహర్షి కపీశ్వరుణ్ణి వారించాడు. అట్లు తొందరపడి చంపుట వలన, యీ కలికాలములో చండరోముడు అమరవీరుడిగా కీర్తిని గడించే అవకాశమున్నది. మూర్ఖులైన జనులు అతనిని అవతారపురుసునివలె ఆరాధించే ప్రమాదం వున్నది. కనుక అట్టి నీచునికి మరణము శిక్ష కానేరదు. అది వరముగా పర్యవసించగలదు అన్నాడు భాగవతోత్తముడైన నారదమహర్షి.

యేమి చేయవలెనో తోచక ధ్యాననిమగ్నుడయ్యాడు ఆంజనేయుడు. మహావైయాకరణియైన హనుమంతుడు శబ్దబ్రహ్మములో మనస్సును లగ్నము చేశాడు.

బహువ్యాహరతానేన, నకించి దపశబ్దితం

గొప్ప వ్యాకరణ వేత్తయైన వాయునందనుడు అపశబ్దమును యేనాడూ వుచ్చరించలేదని శ్రీమద్రాయణం కీర్తిస్తోంది.

కాని చండరోముడెట్టివాడు అతడు అపశబ్దస్వరూపుడు, వేద విద్యావిదూరుడు. శబ్దమే బ్రహ్మము. నీచములైన సంస్కారవిహీనములైన అపశబ్దములు జనులను అంధతమస్సులోనికి నెట్టును. చండరోముడు శ్వేతముఖుల ప్రభావమువలన భ్రష్టసిద్ధాంతములను అనుసరించుచు, వేద విరుద్ధములైన పదములను ప్రచారములోనికి తెచ్చుచున్నాడు. ఆవిధముగా ఆర్యావర్త జనులను అధోలోక పతితులను చేయుచున్నాడు.

శబ్దతత్వజ్ఞుడైన హనుమంతునికి ధ్యానావస్థలో వొక పాణిని సూత్రము స్ఫురించినది. హఠాత్తుగా మెరుపువలె ద్యోతకమైనది.

ఆదర్శనంలోపః అనునది ఆ సూత్రం. విద్యమానస్య ఆదర్శనం లోపసంజ్ఞం స్యాత్ ఉన్నది కనబడకుండా పోవుటయే లోపము. యీ చండరోముడు వెంటనే లుప్తమైపోవలెను. అంటే కనబడకుండా పోవలెను. అదృశ్యుడై పోవలెను.

అతడు భౌతికముగా నామమాత్రముగా మిగిలిపోవలెను. అతని ప్రభావము సర్వాత్మనా క్షీణించిపోవలెను. అతడు వొక జీవచ్ఛవమువలె వుండవలెను. కర్మభూమిపై

భారత జనులపై చండరోముడు యెట్టి ప్రభావమును నెరపలేని అశక్తుడిగా కేవలం ప్రాణావశిష్టుడిగా మిగిలిపోవలెను. లోపమంటే అదే. లుప్తమగుట అంటే అదే.

భౌతిక హననము హననము కానేరదు. మనోబుద్ధుల నుంచి అతడి దుష్టసంకల్పములను, వేద విరుద్ధభావములను సర్వాత్మనా తొలగించి వేయవలెను. శ్రీ రామ పరంధాముని పవిత్ర నామధేయమును దుర్వినియోగ పరచుచు, చండ రోముడు ప్రచారం చేసిన ఆసురీ భావములు అంతరించవలెను. అదియే చండరోముని అంతము.

యిట్లు తలపోయుచు పవన తనూజుడు తండ్రియగు వాయుదేవుని స్మరించెను. మారుతము వేగముగా వీచగనే, అదర్శనం లోపః అనుచు వాతాత్మజుడు గర్జించెను.

గాలి వేల్పు చండరోముని వేగముగా చుట్టి, గార్దభమునుంచి పైకి లేపి సుళ్లు తిప్పుచు, తాళ్లతో కట్టి యీడ్చినట్లు వేగాతి వేగముగా యీడ్చుకొని పోయి శ్వేతముఖుల దేశములో పడవేసెను. శ్వేతముఖుల మధ్య పడవేసెను.

అదర్శనం లోపః సూత్రానికి అర్థం అది.

అతడు శ్వేతముఖులలో కలిసిపోయాడు.

మళ్లీ కర్మభూమిలో యెవరికీ దర్శనం యివ్వలేదు. అదర్శనం లోపః చండరోముడు ప్రజల హృదయాల నుంచి శాశ్వతంగా లుప్తమైపోయాడు. అదర్శనం లోపః

# శ్వేతదాసుని పునరుత్థానం

**అతడి పేరు లోపించింది**

**అతడి మాటలు లోపించాయి**

**అతని జ్ఞాపకాలు శాశ్వతంగా**

**లుప్తమైపోయాయి**

శ్వేతముఖులలో శ్వేతముఖుడిగా మారిపోయాడు శ్వేతదాసుడు. హనుమంతుని ఆగ్రహంవల్ల శ్వేతముఖుల మధ్య పతితుడైన శ్వేతదాసుడు, వారితో ఆత్మీయంగా మెదలడం మొదలు పెట్టాడు.

శ్వేత ముఖుల విద్యలు నేర్చాడు. వారి బోధలని శ్రద్ధగా విన్నాడు. అసలు సృష్టిని దేవుడు కొన్నివందల సంవత్సరాల క్రితమే సృజించాడని శ్వేతముఖులు బోదించారు. ఈ వాదం శ్వేతదాసుని బాగా ఆకర్షించింది.

ఈ కాలాన్ని మరింత ముందుకు జరిపి తనతోనే సృష్టి ప్రారంభమయిందని బోధించుటకు శ్వేతదాసుడు సన్నద్ధుడయ్యాడు. భరతఖండానికి తిరిగి వెళ్లి తన వాదాన్ని వినిపించాలని నిశ్చయించుకొన్నాడు.

భరత ఖండానికి మళ్ళీ వెళ్లి, జనులను సంస్కరించే అవకాశం కల్పించమని శ్వేతదేవుడిని ప్రార్థించాడు. శ్వేతదేవుడు ప్రత్యక్షమై కాంతులీనే ఖడ్గాన్ని శ్వేతముఖుడికి ప్రదానం చేశాడు. ఇది కరుణఖడ్గం, శాంతిఖడ్గం అని దేవుడు చెప్పాడు.

శాంతికరుణలకీ రక్తపిపాసియైన ఖడ్గానికీ సంబంధమేమిటని సందేహం పొటమరించింది. కాని శ్వేతదాసుడు ప్రశ్నించలేదు. అట్లు ప్రశ్నించుట దైవ ధిక్కారమని అతడికి తెలుసు.

ఆ ఖడ్గాన్ని చేతబూని సముద్రాన్ని అధిగమించి కర్మభూమికి చేరాడు. అతడిని యెవరూ గుర్తించలేదు. అతడి వేషభాషలే కాదు ఆకారమే పూర్తిగా మారిపోయింది. అతడు శ్వేతముఖునిలాగా వున్నాడు.

భరతఖండ వాసులారా! మీ మేలు కోరి నేను వచ్చాను. అసలు నాతోనే యీ ప్రపంచం మొదలైంది. నా జన్మదినమే సృష్టిదివసం. నా మాటే వేదం, నా మాటే శాసనం. యెందుకంటే యీ ప్రపంచానికి నేనే నాందీవాచకాన్ని.

యిదిగో నా వాక్కుల్ని ఖడ్గంగా మార్చి ప్రతిష్టిస్తున్నాను. పూజించండి. కత్తివాదర లాంటి తర్కం కన్న ఖడ్గమే గొప్పది. తర్కంతో తలపులను మాత్రమే ఖండించగలం. ఖడ్గంతో తలనే తెగనరకవచ్చు. దానివల్ల పుర్రెకో బుద్ధి అనే సామెత నశిస్తుంది. వొకే సత్యం స్థాపితమౌతుంది.

వొకే సత్యం వొకే మార్గం వొకే నీతి వొకే చట్టం అదే నేను. ప్రపంచానికి ఆదినీ అంతాన్నీ నేనే అని ప్రవచించాడు శ్వేతదాసుడు.

హనుమంతుడు నారదునిపై కోపోద్రిక్తుడయ్యాడు. నారదా నీమాట విని శ్వేతదాసుని సజీవునిగా వదిలివేశాను. యిప్పుడు అతడు వేదభూమికి తిరిగి వచ్చుటయేగాక, శ్వేతహాసమనే ఖడ్గాన్ని ప్రతిష్ఠించాడు. శ్వేతముఖుల విజయ విలాసమే శ్వేతహాసం. దాని కృత్రిమ కాంతి మిరిమిట్లకు భరతవాసులు మోహితులయ్యారు. గత మంతా నిరాకరించబడింది. క్షుద్రవర్తమానమే మిగిలింది. వర్తమానమంటే శ్వేత హాసమేనని వేదన చెందాడు మారుతి.

హనుమద్విలాపాన్ని విన్న నారదముని విష్ణుమూర్తిని స్తోత్రం చేశాడు. వాసుదేవుడు ప్రత్యక్షమై నారదునికి శ్వేతదాసుని ప్రాణ రహస్యాన్ని బోధించాడు.

నారదా శ్వేతదాసుడు క్షుద్రుడు. కాని క్షుద్రత్వమే అతని బలం. అతడిని హతమార్చి దహనం చేసినచో అణుధూళి మేఘమై వ్యాపించి జీవజాలాన్నే నశింప జేస్తాడు.

అతని ఖడ్గం పేరు శ్వేతహాసం. అది విషంపూసిన కత్తి. దాని కాంతి విషకాంతి, విషదరహాసం. తత్వ తేజస్సులో ఆ ఖడ్గం కనబడకుండా పోయినపుడు, శ్వేతదాసుడు మరణిస్తాడు. అందువల్ల జనులు ఆత్మజ్ఞానాన్ని పొందాలి. అంతవరకు కర్మభూమికి శ్వేతదాసుని నుండి విముక్తి లేదు అని విష్ణుమూర్తి అదృశ్యమయ్యాడు.

# సర్వం శ్యామలం

స్రష్టశ్యాముడు సృష్టియు శ్యామలమ్ము
జగమునందున శ్యాముడు శ్యామునందు
జగము కలదు మీ శ్యాముని శ్యామలతను
పొడగనినవారు శ్యాములై పోదురమ్మ

(ఉత్పల సత్య నారాయణాచార్యులుగారి శ్రీకృష్ణ చంద్రోదయం నుంచి)

ఆదిలో జగత్తంతయు కారునలుపులో మునిగిపోయి వుంది. చూడడమంటే యేమిటో యేజీవికీ తెలియదు. స్పర్శయే వుంది. స్పర్శముఖంగానే అనుభూతి కలిగేది, చినుకులు, ఆకులు, వేడి, గాలి సూటిగా దేహాన్ని తాకేవి.

సకలమూ శ్యామలమే. వెలుగులాంటి దేదీలేదు. ప్రతీదీ దేహాన్ని తాకేది. జీవజాలంలో విభజనే లేదు. సకలం వొకటే. ఏకం సత్. వ్యాఖ్యానాలు లేవు. వ్యాఖ్యానించే పండితులు లేరు. అసలు జ్ఞానమనే హింసలేదు. అంత స్వచ్ఛంగా వుండేది ప్రపంచం.

జీవుల దేహాలు నిజమైన కలయికను పొందేవి. ఆ ఆదిమ శ్యామల గర్భంలో నిజమైన మైథున క్రీడ సంభవించేది. దేహాలనుంచి ఆనందగంధం అడ్డంకి లేకుండా యేరులా పారేది.

ఆ శ్యామల సాగరంలోకి యెలా ప్రవేశించిందో వొక కిరణం చొచ్చుకు వచ్చింది. జీవులు కళ్లు తెరిచాయి. దేహాలు అనుభూతుల్ని కోల్పోయాయి. జ్ఞానం అనే భ్రాంతి పుట్టింది. యీ మిథ్యాభ్రాంతి నుంచి అశాంతి పుట్టింది.

ఆనాటి నుంచి జీవి శ్యామల వర్ణంలో లీనం కావడం కోసం తపిస్తూనే వుంది. కోల్పోయిన దేహం కోసం తపస్సు చేస్తూనే వుంది.

శ్యామల సాగరంలోకి చొచ్చుకువచ్చిన కిరణమే యీ అనంత విశ్వభ్రమని కలిగించింది. యీ మాయాప్రపంచంలో జీవి దేహాన్ని కోల్పోయాడు. ఆదిమ రతి

లోని ఆనందాన్ని కోల్పోయాడు. తప్పిపోయిన ఆనందం కోసం ఆనందో[బ్రహ్మ అని వుపనిషత్తులని గానం చేశాడు.

కాని ఆనందం శ్యామల గర్భంలో నిలిచిపోయింది. అదెప్పటికీ తిరిగి రానిది.

శ్యామల వర్ణం అంటే తనలో తానుగా వుండడం. ఆత్మానుభూతియే శ్యామల వర్ణం. దేహమనః ప్రాణాలు వొకటై వుండడం. యీ ద్వంద్వాతీత స్థితియే శ్యామల వర్ణం. యీ శ్యామల సముద్ర గర్భంలోనే జీవి వ్యక్తస్థితి లోకి వచ్చింది. సూక్ష్మజీవియై మనింది. మత్స్యమై యీదింది. తాబేలై వొడ్డుకు జేరింది.

అవతారాలు అనంతంగా సాగాయి. పరమాత్ముని మొట్టమొదటి అవతారం శ్యామలం. అక్కడ వ్యాఖ్యానం లేదు. వునికి మాత్రమే వుంది. ఆస్వచ్ఛమైన శ్యామలత్వాన్ని యే కిరణమూ వ్యాకుల పరచలేదు.

**ఆ స్వచ్ఛమైన శ్యామలత్వాన్ని యేశ్వేత వ్యాధీ సోకలేదు.**

**ఆ శ్యామలమే సాగరం.**

**విష్ణువూ అదే**

**సర్పశయనమూ అదే.**

**మూడు లేవు. మూడూ వొకటే.**

**బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఆ అనంత శ్యామలంలో లయించి,**

**వొకే వొక సత్**

**అక్కడ అవతారాలు లేవు.**

**స్వస్వరూపం మాత్రమే వుంది**

**యిదే శ్యామల తత్వం**

**యిదే విష్ణుతత్వం**

**సర్వం శ్యామలం.**

# పాలపిట్ట పుస్తకాలు

| | | |
|---|---|---|
| 1. | దీపఖడ్గం *(కవిత్వం)* - పెన్నా శివరామకృష్ణ | రూ. 30/- |
| 2. | కథావలోకనం - కె.పి. అశోక్ కుమార్ | రూ. 50/- |
| 3. | సంవిధానం *(కథా వ్యాసాలు)* - గుడిపాటి | రూ. 50/- |
| 4. | ఆమె ఎవరైతే మాత్రం *(కవిత్వం)* - శివారెడ్డి | రూ. 50/- |
| 5. | ఒబామా - స్ఫూర్తిదాయక విజయగాథ - గుడిపాటి | రూ. 50/- |
| 6. | తీవ్రవాదం *(రాజకీయ వ్యాసాలు)* - కస్తూరి మురళీకృష్ణ | రూ.100/- |
| 7. | మనసులోని మాట *(కవిత్వం)* - డా॥ అనంత్ కాబ్‌రా | రూ.150/- |
| 8. | రంకె *(కథ)* - స్వామి | రూ.10/- |
| 9. | దేశదేశాల హైకు*(కవిత్వం)* - పెన్నా శివరామకృష్ణ | రూ. 30/- |
| 10. | ప్రేమ... మరికొన్ని సంగతులు - పెన్నా శివరామకృష్ణ | రూ. 50/- |
| 11. | కలియుగ కృష్ణార్జునులు*(కథలు)* - పులిగడ్డ విశ్వనాథరావు | రూ. 80/- |
| 12. | మధుపం *(వ్యాసాలు)* - పూడూరి రాజిరెడ్డి | రూ. 45/- |
| 13. | నిర్నిమిత్తం *(కథలు)* - బి.పి. కరుణాకర్ | రూ. 60/- |
| 14. | మైకెల్ జాక్సన్ *(జీవితచరిత్ర)* - కస్తూరి మురళీకృష్ణ | రూ. 60/- |
| 15. | ముద్దుల ముచ్చట్లు *(వ్యాసాలు)* - పెన్నా శివరామకృష్ణ | రూ. 60/- |
| 16. | ఊరి చివర *(కవిత్వం)* - అఫ్సర్ | రూ. 60/- |
| 17. | మా - *బా రహమతుల్లా కథలు* | రూ. 50/- |
| 18. | శివారెడ్డి కవిత్వం విమర్శలు-విశ్లేషణలు | రూ. 150/- |
| 19. | హైకు సారస్వతం - డా. రూప్‌కుమార్ డబ్బీకార్ | రూ. 70/- |
| 20. | మనిషి *(కథల సంపుటి)* - యస్.డి.వి. అజీజ్ | రూ. 60/- |

*ఈ పుస్తకాలు కావలసిన వారు సంప్రదించవలసిన చిరునామా :*

**పాలపిట్ట బుక్స్**

\# 16-11-20/6/1/1, # 403, విజయసాయి రెసిడెన్సీ

సలీంనగర్ కాలనీ, మలక్‌పేట్, హైదరాబాద్ - 500 036

Cell: 9848787284 • Palapittabooks@gmail.com

*Philosophy / Mythology*

**PURANAVEDAM**

by Rani Siva Sankara Sarma

ప్రాచీనమైనదే పురాణం కాదు

వెనక్కి వెనక్కి పోతే వేదకాలం రాదు

వేద పురాణాలు యిక్కడే యిప్పుడే

యీ రెండింటి వెలుగులోనే

వలసతత్వమూ సామ్రాజ్యవాదమూ

నామరూపాలని కోల్పోతాయి

సనాతన నామరూపాలు

సహజ బహుళత్వంతో వికసిస్తాయి

అదే పురాణ వాదమ్

అదే పురాణ వేదమ్



PALAPITTA BOOKS

118

